

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక


Journal of the Telugu Academy
KAKINADA

సంవత్సరము చందా రు 3—0—0.

సంపుటము 52 శోభకృత్తు చైత్ర-ఆషాఢములు సంచికలు 1-2

Vol 52 1963 ఏప్రిల్ & జూలై Parts I & II


విషయసూచిక

# స్వ వి ష య ము.

ఈ శోభకృద్వత్సర చైత్రమాసముతో నీ పరిషత్పత్త్రి
నేఁబదియొక్క-యేండ్లు గడచి యేఁబది రెండవ వత్సరము ప్రార
మైనది. ఆంధ్రసాహిత్యపరిషత్సంస్థ, తదనుబంధముగ వెలువడుచు
యీపత్త్రికయు నిన్ని సంవత్సరములనుండియు గ్రాంథిక భాషోద్ధ
మునకు శక్తికొలఁది కృషి నెఱపుచు నేయున్నది. ఈనాఁడు వివిధ
విద్యాలయములందును ప్రాచీనాంధ్ర సాహిత్యగ్రంథములపై వివ
నములు సాగించుచున్న విద్యార్థులు ఆంధ్రసాహిత్య పరిషత్పు
ద్భాండాగారమందున్న ముద్రితా ముద్రిత గ్రంథముల సాహా
మున విషయసేకరణము గావించుచున్నారు. అట్టివారికి పరిషత్
యందలి గ్రంథసంచయమేగాక, పరిషత్పక్షమున పండిత సాహా
మునఁ బ్రచురింపఁబడిన శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు విశేషసా
య్యము నొసఁగుచున్నది. ప్రాచీన వాఙ్మయములో నేయే శబ్ద మే
యర్థమున నే శతాబ్ది మొదలుగ నుపయుక్తమయినదో తెలియు
శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు పరమసాధనమై వెలయుచున్న
ఈవిధముగ నాంధ్రభాషాచరిత్రమునుగాని, సారస్వతచరిత్రమును
వ్రాయఁదలపెట్టినవారికీ నిఘంటు వత్యంతోపకారియై వెలయ
న్నది. ఇట్టి యీనిఘంటువునఁ గొఱవడియున్న 'శ ష స హ'
నాలుగక్షరములకు సంబంధించిన భాగమును ప్రకటించి, గ్రాంథికా
భాషోపాసనాపరుల యభిమతము నీడేర్చుటకుఁ బరిషత్తు కృషి చే
చున్నది. భగవంతుని యనుగ్రహముకూడివచ్చిన నచిరకాల
నాపని పూర్తికాఁగలదని భావించుచున్నాము. లోకాస్సమస్తా
నోభవన్తు.

ఇట్లు,

సంపాదకుఁ

# తిరుపతి వేంకటేశ్వరస్వామి విగ్రహముగూర్చిన పరిశోధనము.

ఆంగ్లవ్యాసరచయిత :— వీరశైవేతిహాసప్రవీణ శ్రీ బి. వి. శ్రీనివాసరావుగారు M. A. M. R. A. S. (Ceylon) F. R. A. S. (London) తుముకూరు, మైసూరురాష్ట్రము, గుల్బర్గా శ్రీశరణ బసవేశ్వర కళాశాలా చరిత్రోపన్యాసకులు (Ex.)

అనువాదకులు:—శ్రీ బండారు తమ్మయ్య.

తిరుపతిక్షేత్రమునఁ బూర్వము స్థాపితమయినది వీరశైవుఁడగు వీరభద్రుని విగ్రహమే. అది రామానుజమతీయులచేఁ దరువాత శ్రీనివాసమూర్తి (వైష్ణవవిగ్రహము)గామార్చివేయఁబడిన విషయము నుగూర్చి పరిశోధనపూర్వకమగు నంశము లీ వ్యాసమున నిరూపింపఁ బడినవి.

రామానుజమతావలంబకులయిన సాళ్వవంశ రాజులు, సంగమ వంశ్యుల (వీరశైవులు) విజయనగరసామ్రాజ్యము నాక్రమించి పరిపాలించినకాలములో ప్రజలలో మత విప్లవమునకు రక్తపాతమునకు స్థానము లేకుండ, చల్లచల్లగానే పయిమార్పును గావించియుండిరి. వీరశైవరాజ్యములో నీ రామానుజమతీయులు క్రీ. శ. 1419–1491 మధ్య కాలములో నీయుద్యమవిషయమున నిపుణత్వముతో, కుతంత్రముతో, స్వతంత్రముగఁ దమ యభిలాషమును సాధించికొనినారు. త్రిపుండ్రాంకితమయిన వీరభద్రవిగ్రహము, ఊర్ధ్వపుండ్రాంకితమయిన వేంకటరమణమూర్తిగాఁ బరిణతి నొందినది.

వీరశైవమతావలంబకులయిన సంగమవంశరాజులకు రామానుజమతీయులైన వైష్ణవరాజులతోఁ గలిగిన మతాంతర వైవాహిక సంబంధములు, బాంధవ్యములు ముఖ్యముగా నిందుకుఁ గారణములయి ప్రజలలో బహిరంగముగ విప్లవము కలుగకుండఁగనే తిరుపతిక్షేత్రమందలి వీరశైవ విగ్రహమును శ్రీనివాసమూర్తిగా మార్పుచేయఁ

గల్గినవి. దక్షిణ హిందూదేశచరిత్రములో క్రీ.శ. 1419-1491 మధ్య కాలమున నీ తిరుపతి దేవాలయమందలి వీరభద్ర విగ్రహము వైష్ణవ విగ్రహముగా మార్పు నొందుటకుఁ గారణమయిన వాస్తవచరిత్ర మీక్రింద నుదాహరించిన ప్రామాణికాధారములను బాగుగాఁ బరిశీలించినఁ బరిశోధకులకు విమర్శకులకు వ్యక్తము కాఁగలదు.

(1) కన్నడమున విరూపాక్షపండితుఁడు (క్రీ. శ. 1584) రచించిన చెన్నబసవపురాణముగూర్చి ఆర్. నరసింహాచార్యులుగారు రచించిన కర్ణాటకవిచరిత్ర ద్వితీయభాగము పుటలు3 07-310 లో నున్న విషయములు.

(2) విజయనగరసామ్రాజ్యమును స్థాపించిన సంగమరాజులు, అసలు కురుబ (గొల్ల) వంశమునకుఁ జెందినవారు. కర్ణాటకవిచరిత్ర ద్వితీయభాగము పుటలు 461-465 లలో తిరుమలరాయలు (క్రీ. శ. 1645-1706) గూర్చి వ్రాసిన విషయములు.

(3) సాళ్వవంశరాజులు, వారి వైష్ణవమతమునుగూర్చిన వివరములకు డాక్టరు ఎస్. కృష్ణస్వామి అయ్యంగారు రచించిన Historical Insciptions of Sonthern India (దక్షిణ హిందూదేశ చారిత్రిక శాసనములు) అను గ్రంథమందలి వంశానుక్రమణపట్టికలను, మైసూరు విశ్వవిద్యాలయ పక్షమున వెలువడిన ప్రబుద్ధకర్ణాటక వృష సంవత్సర దీపావళిసంచిక 10 పుటలో, పదునేనవ శతాబ్ది యందలి కన్నడవాఙ్మయమునుగూర్చి ధార్వారులోని కర్ణాట విశ్వవిద్యాలయోపన్యాసకులు, ప్రొఫెసరు S. S. Malavad గారు ప్రకటించిన వ్యాసము చూడఁదగును.

(4) సాళ్వరాజుల ప్రియదైవతము. అహోబలక్షేత్రమందలి నృసింహస్వామి - రాజనాథడిండిమపండితుని సాళ్వాభ్యుదయము (సంస్కృత కావ్యము) పుట 60 చూడుఁడు. డాక్టరు ఎస్. కృష్ణస్వామి

అయ్యంగారు రచించిన Ancient India (ప్రాచీనభారతదేశము) South Indian History and Culture (దక్షిణ హిందూదేశ చరిత్ర, సంస్కృతి) అను గ్రంథము ద్వితీయ సంపుటములో విజయ నగరరాజ్యమునుగూర్చి తెలియవచ్చిన స్వల్ప చరిత్రాంశములు (A Little known chapter of Vijayanagar History) అను అధ్యాయము చూడుడు.

(5) క్రీ. శ. 1419 రెండవ దేవరాయలకు (ప్రౌఢ దేవరాయలు) వీరశైవాగమసారసంపన్న" అను బిరుద మీయఁబడినది. 1928 సంవత్సరము మైసూరు ఆర్కియాలజీరిపోర్టు 91 పేజి నెం. 92 శాసనము, మైసూరు విశ్వవిద్యాలయము ప్రొఫెసరు డాక్టరు ఎస్. శ్రీకంఠశాస్త్రిగారు రెండవ దేవరాయలుగూర్చి 1928 మే నెల ఇండియను ఆంటిక్వరీ 57 వాల్యూములో వ్రాసిన వ్యాసము.

(6) క్రీ. శ. 1430 రెండవ దేవరాయలు చామరసు వలన వీరశైవదీక్ష నొందెను. కర్ణాటకవి చరిత్ర ద్వితీయ భాగము 64,65 పుటలు. వైష్ణవ రామానుజమతీయుఁడైన సాళ్వతిప్పదేవుఁడు, వీరశైవుఁడయిన రెండవ దేవరాయల జ్యేష్ఠ సోదరి నారమ్మను వివాహమయ్యెను. విజయనగరసామ్రాజ్య రాజవంశానుబంధమునుగుఱించి కర్ణాట విశ్వవిద్యాలయము ప్రొఫెసరు డాక్టరు B. A. Salatore గారి వ్యాసము పుటలు 415, శ్రీ కృష్ణస్వామి అయ్యంగారు విజయనగర చరిత్రాధారములు (Sources of Vijayanagar History) పుట 62, ఇండియను ఆంటిక్వరి 52 వాల్యూము 1-12 భాగములు 7 పేజి, 1913-14 మైసూరు ఆర్కియాలజీరిపోర్టు 47 పుట చూడుఁడు.

(7) క్రీ. శ. 1434 ప్రౌఢదేవరాయలమంత్రి లక్కణామాత్యుఁడు, దేవరాయల బావమఱఁది వైష్ణవుఁడు నయిన సాళ్వతిప్పదేవునకు కోలారుజిల్లాలోని తేకల్ (మాలూరు) పరగాణాను వప్ప

గించెను. పైని పేర్కొనిన డాక్టరు B. A. Salatore గారివ్యాసము 7 పుట, 1928 మే ఇండియను ఆంటిక్వరి 57 వాల్యూము పుటలు 77-85 చూడుఁడు.

(8) 1442 A. D:—చంద్రగిరి శాసనములో తిరుపతి దేవస్థానము శైవమునుండి వైష్ణవములోనికి మార్పునొందుచున్న ప్రారంభదశనుగూర్చిన ప్రస్తావనగలదు. 1933 ఏప్రియలు నెల Mystic Society త్రైమాసికసంచిక 23 వాల్యూము 477 పుట చూడుడు.

(9) క్రీ. శ. 1444:— తిరుపతిదేవస్థానము పూర్తిగా వైష్ణవగ్రస్తమయ్యెను. అప్పుడు విజయభూపతి కుమారుడు శ్రీగిరిభూపాలుఁడు చంద్రగిరి గవర్నరుగా నుండెను. పైనిజెప్పిన త్రైమాసిక సంచిక 476 పుట చూడుఁడు.

(10) ప్రౌఢదేవరాయలు క్రీ. శ. 1446 మెయి నెల 26 తేదీని నిర్యాణమొందెను. ఎపిగ్రాఫియా కర్నాటికా 2 వాల్యూము శ్రావణబెళగోళ 328; తిరుపతిదేవాలయము ఉత్తరపుగోడ దానిపై నెట్టవ్రాఁతలు లిఖింపఁబడక క్రీ. శ. 1446 వఱకు పూర్తిగా ఖాళీగా నుండెను. తిరుమల తిరుపతి దేవస్థానమువారి మాస సంచిక 4 వాల్యూము సంచిక (1933 నవంబరు).

(11) శ్రీపతి పండితారాధ్యుని శ్రీకరభాష్యము తిరుపతి దేవాలయమందలి విగ్రహము మొదట వీరభద్రునిదే యను విషయమును విశదీకరించుచున్నది.

"నను వేంకటేశ్వర వీరభద్రేశ్వర స్థానే విష్ణోరీశ్వర శబ్ద శ్రవణాత్ పరశురామావతారే, తస్య బ్రాహ్మణకులసంభవ శ్రవణాత్ కథం క్షత్రియత్వముపదిశ్యతే. ఇతిచెన్న వేంకటేశ్వరస్యాభాసావిష్ణుత్వేషు, తదంగే నాగభూషణాది ధర్మాణాం ద్యోతనాత్, మూలవిగ్రహే శంఖచక్రాది లాంఛనానా మదర్శనాత్, వీరేశ్వరస్య రామానుజ

కల్పిత వేంకటేశ్వరత్వం రజ్జు సర్పవదాభాసమాత్రమేవ, కించ తత్ప్రాణ్యాన్యో దేశ శివలింగదర్శనాదీశ్వరశబ్దో వ్యవహ్రియతే". దీని వలన తిరుపతి దేవస్థానమందలిది మొదట వీరభద్రవిగ్రహమే యనియు అందలి సర్పాభరణములు, పాణిక్రిందిప్రదేశమున శివలింగముండుట యిందుకుఁ దార్కాణమనియుఁ దెలియుచున్నది. మైసూరు పంచాచార్య ఎలిక్ట్రికలు ముద్రాలయములో 1932 లో ప్రకటితమయిన పండిత కాశీనాథశాస్త్రిగారి వీరశైవరత్న అను గ్రంథము పుట 51 చూడుఁడు.

(12) క్రీ॥శ॥ 1455 తిరుపతి దేవాలయ మంటప నిర్మాణము జరిగెను. 1914 ఇండియను ఆంటిక్వారీ 43 వాల్యూము 12;13,14 పుటలు చూడుఁడు

(13) క్రీ॥శ॥ 1470 సాళ్వ నరసింహరాయలు, అతని భార్య, ఇద్దఱు కుమారులు వీరితో తిరుమల దేవాలయమునకు చతుస్తంభ మంటపనిర్మాణము జరిగెను. తిరుపతి దేవాలయమందలి కట్టడముల యభివృద్ధినిగూర్చి తిరుమల దేవస్థానమువారి మాసపంచిక 4 వాల్యుము 12 సంచిక (డిసెంబరు 1953) 10,11 పుటలలో V. M. నరసింహము గారు వ్రాసిన వ్యాసము చూడుఁడు.

(14) క్రీ॥శ॥ 1471 సాళ్వ నరసింహరాయల ఏజెంటు ఈశ్వర నాయకుఁడు నరసింహ తిరుపతి అగ్రహారము (colony) నిర్మాణము జరిగించెను. 1921 సంవత్సరము మదరాసు ఎపిగ్రాఫికలు రిపోర్టు అనుబంధము 120 of 1921 ఉత్తర ఆర్కాటుజిల్లా, ఆర్ని డివిజను అయ్యంపాలెయము శాసనము, రావుసాహెబ్ సి.హయవదనరావుగారిచే మైసూరు గెజటీరు 2 వాల్యూము మూఁడవభాగము 1628 పేజీలో ప్రకటింపబడినది చూడుఁడు.

(15) క్రీ॥శ॥ 1473 1482:_ తిరుపతిదేవాలయ గోపురనిర్మాణ

ము- సాళ్వ నరసింహరాయలు దుర్గా సముద్రమను గ్రామము దాన ముచేయుట తిరుమల దేవస్థానము మాససంచిక 4 వాల్యూము 12 వ సంచిక (డిసెంబరు 1953) పుటలు 10,11 లలో V.Mనరసింహముగారు కట్టడముల నిర్మాణాభివృద్ధినిగూర్చి వ్రాసిన వ్యాసము.

(16) క్రీ॥శ॥ 1485:- వీరశైవరాజు మూఁడవ విరూపాక్షరాయల నాతని వజ్రసింహాసనమునుండి తొలగించి యాతని సేనాని సాళ్వ నరసింహరాయలు దాని నపహరించి యధిష్ఠించెను. S. కృష్ణస్వామిఅయ్యంగారు దక్షిణహిందూదేశ చారిత్రకశాసనములు పుటలు 71,72,73, అనంతాచార్యుల ప్రసన్నామృత కావ్యము. కృష్ణస్వామి అయ్యంగారు విజయనగర చరిత్రకాధారములు (నె 27 వ ఆధారము)

(17) మంతిన మఠనిర్మాణము- రామానుజ కూటమును స్థాపించి, చంద్రగిరికోటను రామానుజ మతీయుఁడయిన సాళ్వ నరసింహరాయ లొక్కఁడే నిర్మించెను. Mythic Socioty వారి త్రైమాసిక సంచిక 1933 సంవత్సరము 23 వాల్యూము 477 పుట చూడుఁడు.

## ఉపసంహారము

పైని పేర్కొనిన 17 అంశములువలన విజయనగర సామ్రాజ్యమును బరిపాలించిన సంగమ వంశ్యులలో మొదటి వీరశైవరాజగు రెండవ దేవరాయల (క్రీ॥శ 1419-1446) కాలముననే తిరుపతిదేవాలయమందలి వీరభద్రవిగ్రహము వేంకటరమణమూర్తిగా మార్పు నొందెనని తెలియనగును. ముఖ్యముగా 8,9,11 అంశములు చిత్తగింపుఁడు.

రెండవ దేవరాయల కొడుకు, రెండవ వీరశైవరాజు నయిన మల్లికార్జునరాయల కాలములో (క్రీ॥శ॥ 1446-1466) తిరుపతి దేవాలయ మంటపనిర్మాణము జరిగెను. 12వ అంశము చూడుఁడు-

తుదకు విజయనగర వీరశైవరాజులలోఁ గడపటివాఁడయిన మూఁడవ విరూపాక్షరాయల కాలమున (1465-1491) తిరుపతి దేవాలయము "నరసింహ తిరుపతి" యను పేరితో నూత్నక్షేత్రమయ్యెను. ఆ కాలముననే ఆ దేవాలయ గోపురనిర్మాణము జరిగెను. 14, 15 అంశములు చూడుఁడు.

వీరశైవరాజు మూఁడవ విరూపాక్షరాయల వలన పైనిజెప్పిన గోపురము, నూత్నక్షేత్రము నిర్మించుటకుగాను బహువిధములయిన దానములు, సాహాయ్యములు నొంది తుదకు స్వామిద్రోహులయి రామానుజమతస్థులు సాళ్వరాజు లాతనిని వజ్రసింహాసనమునుండి తొలఁగించిరి. అనఁగా నీ సాళ్వరాజులే విజయనగరమందలి వీరశైవ సామ్రాజ్యమును దద్వజ్రసింహాసనముతోఁగూడ నపహరించియున్నారు. 16వ అంశము చూడుఁడు.

6వ అంశము వీరశైవుఁడయిన ప్రౌఢదేవరాయల సోదరికి, రాజకీయముగ వైష్ణవమతీయుఁడయిన సాళ్వతిప్పదేవునకు జరిగిన వివాహమును జేర్కొనును. ఇదియే తిరుపతియందలి వీరభద్రవిగ్రహము వేంకటరమణవిగ్రహముగా మారుటకు సులువుగా దారితీసినది. అనఁగా వీరశైవులకు, వైష్ణవులకు ఆనాఁడు రాజకీయముగ జరిగిన మతాంతర వైవాహిక బంధమే, తిరుపతిదేవస్థానమునఁ బయి మార్పునుసంఘటించినది. సాళ్వతిప్పదేవునకుఁ దనసోదరి నిచ్చిన కారణమునఁ బ్రౌఢదేవరాయలు రామానుజమతస్థులయిన సాళ్వవంశమువారియెడ జాలి, చనవు, నెయ్యము నెఱపి తన వీరశైవ రాజ్యములో వైష్ణవమతీయులకు సంసినంత పట్టుపట్టి నధికారము కలిగించెను. తత్ఫలితముగనే తుదకాతఁడు నాతని పుత్త్రుఁడు మల్లికార్జునరాయలు, మూఁడవ విరూపాక్షరాయలు పేరికిమాత్రము చక్రవర్తులుగానున్నను వైష్ణవమతీయు

లైన సాళ్వరాజులచే సింహాసనభ్రష్టత్వము నొంది తమరాజ్యమును గోల్పోయిరి.

వేయేల! సంగమవంశ్యుల వీరశైవ రాజ్యము యావత్తు రామానుజమతీయుల స్వేచ్ఛావిహార ప్రవర్తనములకు గురియయ్యెను. ఉభయవంశ్యులుగూడ విభేదముల విడనాడి మనోవాక్కాయ కర్మానురూపముగ స్నేహముతో మెలంగిరి. ఇందుచేతనే ప్రజలలో మతవిప్లవము గాని రక్తపాతముగాని లేకుండ రామానుజమతమువారు చల్లగా తమ యభీష్టానుసారముగఁ దిరుపతియందలి వీరభద్రవిగ్రహమును వైష్ణవ విగ్రహముగా మార్చఁగలిగిరి. సంగమవంశము వారికి సాళ్వవంశము వారికి, ఆనాఁడు రాజకీయముగ జరగిన రక్తసంబంధ బాంధవములే రక్తపాతము జరుగకుండఁ బయి పరిణామమును సాధింపఁగలిగెను. అభిషేక ప్రియుఁడయిన శివుఁడు, అలంకార ప్రియుఁడయిన వేంకటరమణునిగా మార్పుచెందెను. పర్యవసాన మేమనఁగా రెండవ దేవరాయల కాలముననే (క్రీ॥శ 1419-1446) తిరుపతియందలి దేవుఁడు విష్ణువుగా మారుటయు, సంగమవంశ్యులలోఁ గడపటివాఁడగు మూఁడవ విరూపాక్షరాయలకాలమునాఁటికి రాజును ప్రజలునుగూడఁ బూర్తిగా రామానుజమతీయుల ప్రాబల్యముచే వైష్ణవమతీయులగుటయు జరిగినది. అనంతాచార్యుని ప్రపన్నామృతము పుటలు 71,72,73 చూడుఁడు

శ్రీ కృష్ణస్వామిఅయ్యంగారు రచించిన విజయనగర చరిత్రాధారములలో నె 27 రు అధారము.

ఈ పరిశోధన వ్యాసముయొక్క ప్రధానసారాంశమేమనఁగా విజయనగర సామ్రాజ్యమును బరిపాలించిన వీరశైవరాజుల దౌర్బల్య కారణముననే వైష్ణవము క్రమముగాఁ బ్రాబల్యమొంది భరతఖండమందంతట వ్యాపించెను.

# అనుబంధము

(1) పైని పేర్కొనిన యాధారములలో 11 వ ఆధారము శ్రీకర భాష్యముయొక్క రచయిత శ్రీపతి పండితారాధ్యులు క్రీ॥ శ॥ పదునొకండవ శతాబ్దమున శ్రీరామానుజాచార్యులకు కొంచెము తరువాత నుండినవాఁడు. శ్రీకర భాష్యమును వ్రాసినది యాతఁడేయయినచో * నాతఁ డందుదాహరించినట్టు లప్పటికే యాతని కాలమునాఁటికే తిరుపతిక్షేత్రమందలి శివవిగ్రహము విష్ణువిగ్రహముగాఁ గొంతవఱకు మార్పునొందిన ట్లూహింపనగును. శ్రీరామానుజాచార్యు లానాఁడు దక్షిణహిందూదేశమున మతాధికారము నిర్వహించు సమ్రాట్టుగా వ్యవహరించుచుండి, శివవిగ్రహములను శివక్షేత్రములను విష్ణువిగ్రహములుగను క్షేత్రములుగను మార్పుచుండెననియు, యథారాజా తథా ప్రజా" అనునట్టులు ప్రజలుకూడ నాతనికి వశులయి వైష్ణవమతస్వీకార మొనర్పుచుండినట్లు గ్రహింపనగును.

---

* శ్రీకర భాష్యము వాస్తవముగా శ్రీపతి పండితారాధ్యుఁడు రచించినది కాదనియు, బసవేశ్వర, పంచాచార్య పార్టీలు కర్ణాటదేశమునఁ బ్రబలముగ రేగిన రోజులలో శ్రీ పండిత కాశీనాథశాస్త్రిగారు సికిందరాబాదునందు సమర్థుఁడగు నొక బ్రాహ్మణ పండితునిచే వ్రాయించి శ్రీపతి పండితారాధ్య కల్పితముగాఁ గల్పించిన గ్రంథమనియు నావిషయమునఁ దామా పండితుని కుటుంబమువారినుండి వాఙ్మూలములఁ దీసికొంటిమనియు నా మిత్రులు శ్రీ T. H. సదాశివయ్యగారు MA.BL.(Retired District and Sessions Judge) నాతోఁ బలుసారులుముచ్చటించియుండిరి, ఇట్టులీ శ్రీకర భాష్యరచనము వివాదగ్రస్త విషయముగనే యున్నది. ఇది పూర్వము తెలుఁగులిపిలో సికింద్రాబాదునందును, దేవనాగరలిపిలో, ముప్పదియేండ్లక్రిందట రావుసాహెబ్ సిహాయవదనరావుగారివలనను, మరల 1962 సంవత్సరములో మైసూరు విద్యాలయము ప్రొఫెసరు T.G. సిద్ధప్పారాధ్యులవారివలనను, శ్రీపతి పండితారాధ్య కృతముగానే ప్రకటితమయినది.

—బండారు తమ్మయ్య,

(2) తదితరాధారములనుబట్టి క్రీ॥ శ॥ 1419-1446 ప్రౌఢదేవరాయలకాలమున రాజకీయముగ నాతని సోదరికి వైష్ణవుఁడగు సాళ్వతిప్ప భూపాలునికి జరిగిన వైవాహికబంధము కారణముగా సాళ్వనరసింహరాయల కాలమునాఁటికే క్రమముగా వైష్ణవము ప్రాబల్యమొంది తత్ఫలితముగా తిరుపతియందలి వీరభద్రవిగ్రహము పూర్తిగా నేఁటి వేంకటరమణమూర్తిగా మార్పునొందెననియు, ఇట్టి మార్పులు కొంతవఱకు మొదటఁ బదునొకండవ శతాబ్దియందే (రామానుజాచార్యుని జీవితకాలముననే) ప్రారంభమయి తరువాత మరలఁ బదునైదవ పదునాఱవ శతాబ్దులలోఁ బూర్తియయినట్లు మనము గ్రహింపవలసియుండును.

(3) వేంకటరమణమూర్తి విగ్రహమున నేఁడుగానవచ్చు శంఖచక్రములు కృత్రిమపు లోహముతోఁ దరువాత నిర్మింపఁబడినట్లేగాని మొదటనే ఱాతితోఁ జెక్కఁబడినట్లు కానరావు. శైవధర్మచిహ్నములు నాగాభరణాదికములు ఱాతిలోనే శరీరముపయి నేఁటికి నిలిచియున్నవి; హస్తముయొక్క దిగువను శివలింగము ప్రత్యక్షముగ నుండనే యున్నది.

శివయోగుల రచనలగూర్చి పరిశోధనము

సుప్రసిద్ధ శివయోగి, చిల్లకలవాడి వాస్తవ్యుఁడు బహుగ్రంథకర్తయునగు నిజగుణ శివయోగివర్యుఁడు తాళ్ళపాక అన్నమయ్యగారికి సమకాలీనుఁడు. ఆతఁడు ప్రౌఢదేవరాయల కాలమునఁ దిరుమలక్షేత్రమునఁ గొంతకాల మందుండెను. అతని గ్రంథములలో ఆనాఁడు తిరుపతి దేవాలయమందలి విగ్రహము నాతఁడెట్లు పేర్కొనెనో పరిశోధించుట నేఁటి చరిత్ర పరిశోధకులకెల్ల నీవిషయమున సత్యనిర్ణయమొనరించుటకయి పరమావశ్యకము. అందుకయి వారు శ్రద్ధవహింతురుగాక. (తిరుమల తిరుపతి దేవస్థానమువారి మాసపత్రిక: 4 వ వాల్యూము నెం 1 రు జనవరి 1953 సంచిక పుటలు 15,16 చూడుఁడు)

# కుమారసంభవమునఁ గాళిదాసు ప్రతిపాదించిన ప్రేమస్వరూపము.

శ్రీ అయ్యగారి నరసింహమూర్తి, తణుకు.

ప్రకృతిసిద్ధముగ హృదయ కుహరమునందు జనించు నొక పవిత్రమైన శక్తియే ప్రేమ. ఇది హృదయమునం దప్రయత్నముగ జరుగు వ్యాపారము. ప్రేమకు గమ్యస్థానము హృదయసంజనితానందమే. ఒకరికి మఱియొకరియెడఁగల అమిత సద్భావమునకు అన్యోన్యవయః పరిమితినిబట్టి భక్తి, వాత్సల్యము, ప్రేమయని యందుము. పిన్నలకుఁ బెద్దలయెడఁ గల భావమును భక్తియనియు, పెద్దలకుఁ బిన్నలయెడఁ గల భావమును వాత్సల్యమనియు సమవయస్కులమధ్యఁగల భావమును బ్రేమయనియుఁ జెప్పుదుము.

సుహృత్ప్రేమ, దాంపత్యప్రేమ-యని ప్రేమ రెండు విధములు. దంపతిభావము దాంపత్యము. ఈదాంపత్యప్రేమ మఱల రెండు విధములు. ఒకటి బాహ్యసౌందర్యకారణముగా యౌవనమదముచే నరముల యుద్రేకమువలనఁ గలుగునది. దీనినే మోహమందురు. దీనికిఁ గామము ప్రధానము. అంగసౌఖ్యసంజనితానందములో నిది యణఁగి పోవును. రూపలావణ్యాదు లస్థిరములైనట్లే యీప్రేమయు నస్థిరమే. ప్రేమించి ప్రేమింపఁబడెడి రెండు వస్తువులకు హృదయ వైశాల్య నైర్మల్యములుండి, స్వార్థరహితమైనపుడు జనించు ప్రేమ నిష్కామప్రేమ. ఇయ్యది బాహ్యసౌందర్యము నాశింపక నిష్కపటమై నివాతదీపమువలె నిశ్చలమై యనశ్వరమై యుండును. ఇట్టిప్రేమ సర్వసాధారణముగ సామాన్యులకు సాధ్యముగాదు.

కవికుల తిలకుఁడగు కాళిదాసుచేఁ గుమారసంభవమునఁ బ్రదర్శింపఁబడినప్రేమ నిష్కపటము, నిష్కామము, నిశ్చలమునై యన్యోన్యాశ్రయమై పరమపవిత్రమై యార్షసమ్మతమైనది. పార్వతీ పరమేశ్వరులకును, రతీ మన్మథులకును నడుమఁగల ప్రేమను దాంపత్య

ప్రేమయని యందురు రతీమన్మథులప్రేమ స్త్రీపురుషుల యన్యోన్యాశ్రయమున కుదాహరణముకాఁగా, పార్వతీ పరమేశ్వరుల ప్రేమ నిష్కామప్రేమ కుదాహరణమగుచున్నది. పార్వతీ-తత్సఖులకును మన్మథ వసంతులకును నడుమఁగల ప్రేమను సుహృత్ప్రేమయని యందురు.

ప్రేమకుఁ బ్రధానము ధర్మముగాని కామముగాదు. నిష్కామప్రేమతత్త్వమునకుఁ గామము నిగ్రహింపఁబడవలెను. కామరహితమైనట్టి ప్రేమతత్త్వమును గాళిదాసు కుమారసంభవమున పార్వతీ పరమేశ్వరుల ద్వారమున వ్యక్తము చేసినాఁడు. పార్వతి తొలిజన్మమున మహేశ్వరుని పెండ్లియాడిన సతీదేవిగాని యన్యరాలుగాదు. వర్షము కురియుటతోడనే మొలకెత్తు బీజములరీతి నారదుని పలుకులు వినినంతనే యామె మనమునం దేమూలనో దాగియున్న ప్రేమాగ్ని ప్రజ్వరిల్లఁదొడఁగినది. నారదవాక్యప్రేరితుఁడైన నగసార్వభౌముఁడు హరుని పరిచర్యకుఁ గూఁతునంపఁగా నామె తనలావణ్యముచే శివుని లోఁగొననెంచినది. కాని పరమేశ్వరుఁడు సమాధినిష్ఠలో నివాతదీపమువోలె నిశ్చలమనస్కుఁడై యుండి తనపైఁ బుష్పబాణము నేయ నుంకించిన పంచబాణుని ఫాలాగ్నిచే క్షణములో భస్మీభూతునిఁగావించెను. అట్లే కామదహనఘట్టము నిష్కామప్రేమకు సూచకమగుచున్నది.

తనకుగా నెప్పుడు మదనుఁడు కామారికంటిమంటకు ఆహూతయ్యెఁడయ్యెనో యపుడే శైలాత్మజ తండ్రి మనోరథము, తన శరీర సౌందర్యము నిష్ప్రయోజనమైనవని చింతించి శరీరలావణ్యాదులు మోహజనకములేగాని ప్రేమజనకములుగావనియు నప్పరమేశ్వర వశీకరణమునకుఁ దపోలావణ్యమే ప్రధానమనియెంచి తపముచేయఁ గృతనిశ్చయురాలయ్యెను.

మహేశ్వరుని లోఁగొననెంచిన పార్వతి తపముచేయఁగృతనిశ్చయురాలైనదనువిషయము తల్లియగు మేనక యెఱిఁగి "తపఃక్వవత్సే క్వచతావకం వపుః పదం సహేత భ్రమరస్య పేలవం శిరీషపుష్పం నపునఃపతత్రిణః" అని తన తనయను దపోమార్గమునుండి మరలింప యత్నించెను. దీనినిబట్టి మాతృమూర్తికి బిడ్డపైఁగల వాత్సల్య మెట్టిదియో వ్యక్తమగుచున్నది.

"గురుర్నియోగాచ్చ నగేంద్రకన్యా, స్థాణుం తపస్యన్తమధిత్యకాయామ్ అన్వాస్త..." "శైలాత్మజాపి పితురుచ్ఛిరసోఽభిలాషం వ్యర్థం సమర్థ్య..." అనువానివలనఁ గూఁతునకుఁ దండ్రిపైఁ గల భక్త్యనురాగము లెట్టివో వెల్లడియగుచున్నవి.

సకల సాధనలకు నిలయమై యిష్టకామ్యసిద్ధిగల యింటఁబుట్టి రాజసభావముతో నంతఃపురములందు మెలఁగెడి నగసార్వభౌముని కూఁతున కొకు(క్క?)మ్మడిని సత్త్వగుణములవశఁజాలదు. అంతఃకరణమునందలి మాలిన్యము తొలఁగి నిర్మలమై చిత్తశుద్ధి గలిగినపిమ్మటఁగాని సత్త్వగుణ ప్రధానురాలుగాదు. అట్టిగుణమలవడిన పిమ్మటఁగాని శివుని సపర్యకును, దపోధ్యానమునకును నధికారముగాని యర్హతగాని చేకూఱదు. అట్టిపరిణామము గలుగుట కామె యాయింటిలో నరణ్యములందుండి యచటి చేతనాచేతనములకు సేవచేసెను. ఆమె మనమునందు నైర్మల్యము పొడసూపిన పిమ్మట మునిజనంబులకుఁ బూజలుచేయుచు కఠోరమగు నియమములచేఁ దపముచేసి మేనును గృశింపఁజేసి, అహంకారాదిగుణముల నంతరింపఁజేసి సత్త్వగుణసంపన్నురాలై పరమేశ్వరునిలోఁగల పరమోత్కృష్ట సౌందర్యమును బరిగ్రహింపఁగలిగెను.

స్వచ్ఛము, అమలినము నైన యపర్ణ మనమునందలి యాదర్శప్రేమను నిరూపించుటకై కాళిదాసు శివుని మాయాబ్రాహ్మణ బ్రహ్మచారివేషమునఁ దపోనిష్ఠలోనున్న పార్వతిని బరిపరివిధములఁ బరీక్షిఁ

పఁజేసెను. ఆపరీక్షయం దామెనెగ్గెను. ఈవిధముగఁ బార్వతి ధర్మదీక్షతో నిష్కామప్రేమను సాధించినది. కనుకనే పరమేశ్వరుఁడు "అనేన ధర్మస్సవిశేషమద్య మే, త్రివర్గసారః ప్రతిభాతి భావిని, త్వయా మనోనిర్విషయార్థకామయా, యదేక ఏవ ప్రతిగృహ్య సేవ్యతే" అని పలికినాఁడు

అగ్నితప్తమైన యపరంజివలె నపర్ణహృదయ మమలినమగుటచే బ్రహ్మచారి ప్రశ్నముల కన్నిటికి నుచితమైన సమాధానము లొసఁగి, పరమేశ్వరునిఁగూర్చి యిఁక శ్రుతికటువగు మాటలను విననోపక! "నివార్యతామాలికిమప్యయం వటుః పునర్వివక్షుః స్ఫురితోత్తరాధరః న కేవలం యో మహతోఽపభాషతే శృణోతి తస్మాదపి యస్స పాపభాక్" అని చెలికత్తెలతోఁ బలికి యటనుండి వెడలిపోవ నుంకించెను. సత్త్వగుణసంపన్నయు, నిర్భరతపఃకృశ కోమలదేహయునగు పార్వతి తనూవిలాసమే యయస్కాంతమువలెఁ బరమేశ్వరుని నాకర్షించి పట్టి బంధింపసాగినది. తత్క్షణమే చంద్రశేఖరుఁడు నిజస్వరూపముతోఁ బ్రత్యక్షమై "అద్యప్రభృత్యవనతాఙ్గి! తవాస్మిదాసః క్రీతస్తపోభిరితి వాదిని" యనిపల్కి యామెనర్ధాంగిగా స్వీకరించుట కంగీకరించెను.

పార్వతీపరమేశ్వరు లిరువురును బరిణయోత్సుకులై యున్నను గాంధర్వవివాహము నెఱపక ఆర్షసంప్రదాయానుగుణముగ "కన్యకను, పితృపరాధీన నగుటచే దేవరచిత్తంబున నవధరింపవలయు" నని చెలిచే విన్నపంబుచేయించి పవిత్రప్రేమను ఆదిమ దంపతుల మూలమునఁ గాళిదాసు లోకమునకుఁ జాటిచెప్పెను.

కామోద్రేకమువలనఁ గలిగిన యింద్రియచాపల్యము కాదు కనుకనే పరమశివుడు మునీశ్వరులతో "సోఽహం తృష్ణాతురైర్వృష్టిః విద్యుత్వానివచాతకైః అవివిప్రకృతైర్దేవైః ప్రసూతిం ప్రతి యాచితః" అని స్పష్టముగఁ బల్కినాఁడు.

ఆదిమదంపతులగు పార్వతీపరమేశ్వరుల ప్రేమ విషయతాల్ప

ముచే జనించినదిగాదు గనుకనే యౌవనమదముచేఁ గలుగు దుష్కృత్యములకు లోనుగాక ధర్మబద్ధమైయుండెను. ఈశ్వరుండును బిత్రుదత్తమైన కుమార్తెను చేఁబట్టి కుమారోత్పత్తిచేఁ దాను జగమునకు జనకుఁడై యామెనుజననిగాఁజేసి యిష్టఫలసిద్ధితోఁ గృతకృత్యుఁడాయెను

తన సఖులు గొనివచ్చిన పుష్పములను స్వహస్తలూనములగు పుష్పములను గలిపి హరుని కర్పించుచుండిన పార్వతి కామదహన సందర్భమునఁ దనసఖుల సమక్షముననే తన మనోరథము భగ్నమయ్యెనని యెంతయో వ్యథనుజెందెను. కాని తత్సఖు లామెచేయుప్రయత్నము కెల్లవేళలఁ దోడ్పడిరి. అట్లే మాయాబ్రాహ్మణ బ్రహ్మచారి రూపమున వచ్చిన స్మరవైరికిఁ జెలికత్తె ద్వారమునఁ దన మనోభీష్టమును (వరునివిషయమును) నెఱిఁగించెను. ధర్మపరీక్షయందు విజయమునొందిన పిమ్మట సాక్షాత్కరించిన చంద్రకళాధరునకుఁ దనతండ్రి యగు హిమవంతుఁడు కన్యాదానముచేసిన పిమ్మటఁ బరిగ్రహింపవలయునన్న సందేశమును జెలికత్తెద్వారమునఁ దెలియఁబఱిచెను. తపోనియమ సమయమందుఁ బార్వతి, తత్సఖులును సుహృద్భావముతో మెలఁగిరి. వసంతుఁడు మన్మథున కెడబాటులేని మిత్రుఁడు. మన్మథుని కష్టసుఖములను దనవిగా భావించుకొనెడివాఁడు. కనుకనే రతీదేవి భర్తృమరణమునకై విలపించుచుఁ దనకు దర్శనమీయకున్నను బ్రియమిత్రుఁడగు మాధవునకు దర్శనమీయుమని కోరినది.

"దయితాస్వనవస్థితం నృణాం నఖలుప్రేమచలం సుహృజ్జనే" అను దానినిబట్టి కైతవములేని స్నేహబంధ మెంతసుస్థిరమైనదియో మనమూహింపవచ్చును.

ఇఁక రతీ-మన్మథుల ప్రేమయు నన్యోన్యానురాగాశ్రయమై పవిత్రమైనది.

అన్యోన్యానురాగాశ్రయమైన దాంపత్యప్రేమ ప్రకృతిలో నెచటనైనను గాంచనగును. వసంత వర్ణనమున స్థాణ్వాశ్రమమునందలి ప్రాణులయన్యోన్యాశ్రయ భావశృంగార చేష్టలనుగవియిట్లు వర్ణించినాఁడు

"మధుద్విరేఫఃకుసుమైకపాత్రే పపౌప్రియాంస్వామనువర్తమానః
శృంగేణ సంస్పర్శనిమీలితాక్షీం మృగీమకండూయత కృష్ణసారః"
పర్యాప్తపుష్పస్తబకస్తనాభ్యాం స్ఫురత్ప్రవాళోష్ఠమనోహరాభ్యాం
లతావధూభ్యస్తరవోఽప్యవాపుర్వినమ్రశాఖాభుజబన్ధనాని"

స్త్రీశక్తి యెట్టిదైనను ప్రకృతిసిద్ధముగాఁ బురుషునిపై నాధారపడియుండును. స్త్రీ పురుషునిపై నాధారపడియున్నను నన్యోన్యాశ్రయములేనిదే యవి శోభింపఁజాలవు. ఈవిషయమునే కాళిదాసు మనోజ్ఞమైన యుపమలలోఁ గూర్చినారు.

పురుషుఁడు దీపమువంటి వాఁడనియు, స్త్రీ యందలి వత్తి యనియు, దీపమాఱిపోయినచో వత్తిఁ బ్రయోజన ముండదనియు, వత్తి లేనిచో దీపముండదనియు, కనుక స్త్రీ పురుషు లిరువురు దీపము వత్తివలె నన్యోన్యాశ్రయులని చెప్పెను. రతీదేవి భర్తృమృతికై విలపించుచుఁ దా నాఱిపోయిన దీపపువత్తి పొగవలెఁ బొగులుచున్నానని వసంతునితోఁ బల్కెను. పురుషుఁడు వృక్షమువంటివాఁడనియు, స్త్రీ దాని నంటియుండు లతవంటిదనియుఁ బేర్కొనెను. వృక్షము పోయినచో లతకాశ్రయముండదు, లతలేనిచో వృక్షమునకు శోభయుండదు. లతావృక్షములవలె స్త్రీపురుషు లన్యోన్యమనఁగి పెనఁగి యున్నపుడే సుందరముగా నుందురు.

ఇట్లీవిధముగఁ గవికులతిలకుఁడగు కాళిదాసు నిష్కామప్రేమతత్త్వమును, అన్యోన్యానురాగాశ్రయ విలసితమైన దాంపత్యప్రేమస్వరూపమును గుమారసంభవమునఁ బ్రతిపాదించి జగజ్జనకులగు పార్వతీపరమేశ్వరులు లోకకళ్యాణార్థమై కుమారోత్పత్తికిఁ బాటుపడి చరితార్థులైన విధముగ నయ్యాదిమ దంపతుల విషయమును గావ్యముగా లిఖించి యందుఁ దననాఁటి యార్ష సంప్రదాయములను వెలువరించి తానును జరితార్థుఁడాయెను.

# శ్రీ కాళిదాస సౌందర్య సమారాధనము—విశ్వప్రేమము

శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి

(గతసంచిక తరువాయి)

వాస్తవమున కీ నాటకములోఁ జక్కఁగసి రెండు కలయికలు కలవు. మొదటి యంకములోని నాయికానాయకుల కలయిక భౌతికమై, అస్థిరమైన సౌందర్యముతోను, శృంగారముతోను గూడియున్నది. ఇఁకఁ జివరియంకములోని కలయిక శాశ్వతానందదాయకమగు మారీచ మహర్షి దివ్యాశ్రమములో జరుగుటచే ఆధ్యాత్మికానంద దాయకమైయున్నది. ఇట్లీ నాయికానాయకుల మొదటి సమావేశము చివరి నైతిక సమ్మేళనముగా నెట్లు పరిణతమైనదో అట్టి పరిణామ క్రమమును జూపుటయే యీ నాటకలక్ష్యము.

ఒక ప్రత్యేక భావప్రబోధమునకుఁగాని లేక, ఒక ప్రత్యేక పాత్రచిత్రణమునకుఁగాని యీశాకుంతలనాటక (రచన) ముద్దేశింపఁబడలేదు. ఇఁక ఈనాటక కథావిషయమంతటిని ఒక ప్రపంచమునుండి

---

(గతసంచిక 63 పేజీలోని ఇంగ్లీషువాక్యముల తరువాయి భాగము)

We are apt to pass over this eulogy lightly as a mere poetical out burst. We are apt to consider that it only means in effect that Goethe regarded Sakuntala as fine poetry. But it is not really so His stanza breathes not the exaggeration or rapture but the deliberate judgment of a true critic. There is a special point in his words. Goethe says expressly that Sakuntala contains the history of a development—the development of flower into fruit of earth into heaven, of matter into spirit.

In truth there are two visions in Sakuntala and the motive of the play is the progress from the earlier union, in the first Act, with its earthly unstable beauty and romance, to the higher union in the heavenly hermitage of eternal bliss described in the last Act.

మఱియొక ప్రపంచములోనికిఁ బరివర్తనము సేయుటకును, భౌతిక సౌందర్యపరిమితమగు ప్రేమనుండి నైష్ఠికసౌందర్యసంయుక్తమై, శాశ్వతానందదాయకమైన దివ్యప్రణయస్వర్గమునకు భారతీయదంపతుల నుద్ధరింపఁజేయుటకును ఈనాటక ముద్దేశింపఁబడినది.

శాకుంతలమునుగూర్చి వ్రాసిన శ్రీ రవీంద్ర కవీంద్రునియొక్క పైయాశయములలోని పరమార్థమును శాకుంతలోదాహరణములతో నిఁక నిరూపించి చూపెదను. పార్వతీ సౌందర్యమునువలె శకుంతలా సౌందర్యమునుగూడ "పూర్వోత్తర"రూపముగ విభాగించి చూచి ననే యిచ్చటి విశిష్టత విశదమగును. కనుక ముందుగ శకుంతలా భౌతిక సౌందర్య వైభవము నవలోకింతము.

ఈనాటకములోని నాందీప్రారంభ వాక్యమే శకుంతలాసౌందర్య సర్వస్వమునకు నాందియగుచున్నది.

"యాసృష్టిస్స్రష్టురాద్యా..."యా=ఏ శకుంతల; స్రష్టుః=
=(కాళిదాసకవి)బ్రహ్మయొక్క; ఆద్యాసృష్టిః=మొదటిసృష్టియో;
అనఁగా "కాళిదాసకవి బ్రహ్మయొక్క సుందరవస్తుసృష్టిలో శకుంత

---

This drama was meant not for dealing with a particular passion, not for developing a particular character, but for transmiting the whole subject from one world to another-to elevate love from the sphere of physical beauty to the eternal heaven of moral beauty.

* In the first Act the poet has not concealed the gross earthliness of the fall of Sakuntala; he has clearly shown, in the conduct of the hero and heroine alike, howmuch desire contributed to that fall. He has fully painted all the blandishments, playfulness and flutpering of the intoxicating sense of youth, the struggle between deep bashfulness and strong self expression.

లయే యుత్తమోత్తమమగు మొట్టమొదటి సుందరవస్తుసృష్టి"యని యిట ధ్వనించుచున్నది. ఈ ధ్వన్యర్థమే యిట వివరింపఁబడుచున్నది.

దుష్యంతుఁడు కణ్వాశ్రమముంజేరి పాదపాంతస్థితుఁడై యచ్చటిపడుచుల విస్రంభాలాపములు వీనులవిందుగ వినుచుండఁగా నాయిక,

"అనసూయే! అదయపినద్ధేన అనేన స్తనవల్కలేన ప్రియంవదయా
బలవన్నియంత్రితాస్మి శిథిలయ తావ దేనం".

అని ప్రతి క్షణమునను సంవర్ధమానమగుచున్న తన యౌవనసంరంభంబును అప్రయత్నంబుగనే యచ్చటి విశాంపతికి నామె వినిపింపఁజేయును.

ఇందుల కామె ప్రియసఖి ప్రియంవద:—సఖిశకుంతలే! అత్ర తావత్పయో
ధరవిస్తారయితృకమాత్మనో యౌవనముపాలభస్వకిం మాముపాలభసే?

ఇట్లు ముగ్ధమోహనములైన యాముదితల మోహనాలాపములనువిని రాజు అప్పటి నాయికా యౌవనవిలాస వైభవములను జూచిచూచి తనలో "ఈశకుంతల ధరించిన వల్కలము (నారచీర)

---

This is a proof of the simplicity of Sakuntala. Dushyantas conquest of Sakuntala has been very naturally drawn. With equal ease has the poet shown the deeper purity of her character in spite of her fall-her unimpaired innate chastity. This is an other proof of her simplicity.

The flower of the forest needs no servant to brush the dust off her petals. She stands bare, dust settles on her, but in spite ef it, she easily retains her own beautiful cleanliness. Dust did settle on Sakuntata. but she was not even conscions of it like the simple wild deer; like the mountain spring, she stood forth pure in spite of mud.

ఇట్లే శకుంతలకు పతినిరాకరణరూపమైన భౌతికపతనము క్రమపరిణతితో నాధ్యాత్మికోన్నతిగ పరిణామముఁ జెందినవిధమే పై రవీంద్రుని యాంగ్లవాక్యములలోని విషయము.

ఈమె శరీరమునకుఁదగనిదే. ఇట్టి యీ వల్కలముకూడ నీ సహజ సౌందర్య శోభితకు అలంకారశోభనే యాపాదించుచున్నది. ఎట్లనఁగా-

"పద్మమునకుఁ జుట్టువారియున్న నాచు, ఆపద్మమునకు ఒక క్రొత్తయందము నాపాదించినట్లును, చంద్రునిలోని మలినకళంకము కూడ ఆచంద్రునికి కాంతి లక్ష్మినే ప్రసాదించియున్నట్లును, ఈశకుంత లకు అననురూపమైన యీ వల్కలముకూడ అధికసౌందర్యము నే గల్గించుచున్నది. స్వతఃమధురమైన యాకృతిగలవారు ఎంతటి తక్కువ వస్తువును ధరించినను, ఆవస్తువు వారికి సమధికసౌందర్యము నే సమ కూర్చుచుండును. "స్త్రీలు తాము అలంకారములు ధరించనప్పుడు కూడ ఎవరియాకృతి రమణీయముగా నుండునో అట్టి "యాకృతి" "మాధుర్యము" అనఁబడును. నిరలంకారలై వృక్షసేచనముఁ గావిం పుచున్న మునికన్యకలను జూచి రాజు తనలో "అహో! మధుర మాసాందర్యన"మ్మనుచు, వారి యపురూపపుటందమున కచ్చెరు వందును.

ఇట్టి రూప"మాధుర్యము"నే యీకవి, తనమాళవికాగ్నిమిత్ర నాటకములో మాళవికనుగూర్చి రాజుచే "అహో! సర్వావస్థాసు చారుతా శోభాంతరం పుష్యతి"అనిపించును.ఇట "సర్వావస్థాసు..." అనఁగా అలంకారములు లేనప్పుడును అని భావము ఇట్లు "మాధుర్య" లక్షణములతోఁగూడిన శకుంతలాసౌందర్యము, స్వర్గాలంకారమైన యూర్వశీసౌందర్యమునుగూడ "త్రోసిరాజు" అనుచున్నదిట అవధ రింపుఁడు.

"ఆభరణస్యాఽభరణ" ప్రసాధనవిధేః ప్రసాధనవిశేషః।
ఉపమానస్యాపిసఖే ప్రత్యుపమానం వపుస్తస్యాః॥
(విక్రమోర్వశీయనాటకము 2-3)

అగ్నిమిత్రుఁడు విదూషకునకు ఊర్వశీసౌందర్యము నిట్లు తెలుపు చున్నాఁడు.

"మిత్రమా! ఊర్వశియొక్క యుజ్జ్వలరూపము ఆభరణవస్తువు లన్నిటికిని ఉత్తమాభరణము. ఇట్లే యామెరూపము అలంకరణ విశేషముల కెల్ల నూతనాలంకరణము. వేయిమాటలేల! వయస్యా! ఈ యూర్వశియొక్క యనుత్తమరూపము ఉపమానవస్తువులకే (చంద్రారవిందాదులకే) ఏకైకమైన యుత్తమోపమానము" ఇట్లూర్వశీరూపము ఆభరణములకే యాభరణముకాఁగల్గుచుండఁగా శకుంతలారూపము ఆభరణములుకాని (తక్కువైన) వస్తువులనుగూడ నందగింపఁ జేయుచు, అట్లందగించుచున్న యా(తక్కువ) వస్తువులచేఁ దిరిగి యా శకుంతలారూప మందగింపఁజేయబడుచుండుట, యిట గమనింపఁదగిన కమనీయవిషయము • ఈమె కాళిదాసకవి బ్రహ్మయొక్క సుందర వస్తుసృష్టిలో నాద్యమైన సుందరవస్తువుగదా! ఇట్టి రూపసౌకుమార్య మునీసౌందర్య తత్త్వవేత్త "కుసుమ మివలోభనీయం యౌవన మంగేషుసన్నద్ధం" అని పుష్పసౌకుమార్యముతోఁ బోల్చినాఁడు. పై భావములోని పరమార్థమును జూఱగొన్న "గెథే" మహాకవి, శకుంతలను గూర్చి "Young years blossoms...." అనుట ప్రత్యక్షరసత్యము.

ఇఁక నీ శకుంతలారూపతత్త్వము తనకు గోచరించినరీతిని దుష్యంతుఁడు విదూషకునితో నిట్లు ముచ్చటించుచున్నాఁడు,

"చిత్రే నివేశ్య పరికల్పిత సత్వయోగా రూపోచ్చయేన విధినా మనసా కృతాను। స్త్రీరత్నసృష్టి రపరాప్రతిభాతి సామేధాతుర్విభుత్వ మనుచింత్య వపుశ్చతస్యాః॥ శాకుంతలే అంకః (2 శ్లో. 9)

---

• సౌందర్యము వస్త్వాశ్రితమైనదేకాని, ఆత్మాశ్రితము, అలంకారాశ్రితము కాదని -- మొదట నా పేర్కొన్నవిషయ మిట విస్పష్టమైనది॥

"బ్రహ్మయొక్క స్త్రీలోకసౌందర్యసృష్టి సామర్థ్యమువు. ఈ శకుంతలా సౌందర్యసృష్టిసామర్థ్యమును దులనాత్మకరీతిగఁ జూచుచున్న నాకు (దుష్యంతునకు) మిత్రమా! నా చూచిన శకుంతల ఇంకొక నూతనబ్రహ్మయొక్క లోకోత్తర స్త్రీరత్నసృష్టివలె భాసించుచున్నది. ఎందుకనఁగా ఆమెను సృజించినబ్రహ్మ ఆమెరూపమును ముందుగాఁ జిత్తరువులో దిద్దితీర్చి, యాచిత్రగత చిత్రణము తనకు నచ్చినపిమ్మటనే (బ్రహ్మ) యారూపవతికిఁ బ్రాణసంయోగము చేసి యుండవలెను. లేక చంద్రుఁడు, పద్మము మున్నగు నుపమానవస్తువు లందలి కేవల కాంతిద్రవ్యమునంతను (ఆ నూతనబ్రహ్మ) ఒక్కటఁ జేర్చి, ఆసుకుమారద్రవ్యమును జేతముట్టక, ఆశకుంతల నతఁడు, ఒక్క యాకాంతి ద్రవ్యసాధనముచేతనే (ఇది ఉపాదానకారణము) తన మనస్సుచే (ఇది నిమిత్తకారణము) నామెను ఆ బ్రహ్మ సృజించి యుండవలెను.

పై శకుంతలాసృష్టిరీతి పురాణబ్రహ్మయొక్క సృష్టిరీతికంటె విలక్షణమైయున్నది. కనుక ఈసృష్టి, పురాణ (పాత) సృష్టి కాక, మఱియొక నూతనబ్రహ్మయొక్క సృష్టియై యుండవలెను." అని విదూషకా! నాకుఁ దోఁచుచున్నది." ఇట్లు బ్రహ్మకు లభ్యముకాని యద్భుతసుందరవస్తుసృష్టి స్వాతంత్ర్యము మనకవి బ్రహ్మకు లభ్యమైన కారణముచేతనే అభిజ్ఞులు "అపారమైన కావ్యప్రపంచమునకు కవియే వకైకబ్రహ్మ యగుచున్నాఁడ"నియు నీ కవిబ్రహ్మ తన కావ్యప్రపంచమును దనకుఁ దోఁచినరీతిగ మార్చివేయఁగలఁడనియు* నిశ్చయించినారు. పురాణబ్రహ్మ యథాపురముగ శకుంతలను పాంచభౌతికరూపముతో సుఖదుఃఖసమ్మిశ్రితముగ సృజించెను. కనుక బ్రహ్మ సృష్టి యగు శకుంతలకు "కారణగుణాన్యాయము"చే+ పాంచభౌతికధర్మము

* "అపారేకావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః। యథాऽస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే॥ X "కారణగుణాః కార్యే సంక్రామంతి" (తర్కపరిభాష)

లైనను దుఃఖములు తప్పవు. కాని కాళిదాసకవి బ్రహ్మచే సృష్టమైన శకుంతలకు అట్టి పాంచభౌతికము (దుఃఖము) లేదు. కనుకనే కాళిదాస శకుంతలారూపము అనశ్వరమై, కేవల కాంతిదివ్య మయశరీరముతో శాకుంతల కవితాంబరమున ధ్రువతారయై వెలుంగుచునే యున్నది. మఱియు నూర్వశీ రంభాదుల దివ్యరూపము పురాణబ్రహ్మయొక్క సుందరవస్తుసృష్టికిఁ బరమావధియైయుండఁగా నిప్పటి శకుంతలారూపసృష్టి పై రంభాదుల రూపసృష్టినిదోఁచి రాజనుచున్నదిగాన, "రంభాదులను సృజించిన బ్రహ్మకంటె నీశకుంతలను సృజించినబ్రహ్మ మఱియొక నూతన (కాళిదాసకవి) బ్రహ్మ కావలసియుండవలెను." అను దుష్యంతునియూహ యుక్తియుక్తము, శాస్త్రసమ్మతము కూడనై యుండలేదా? పార్వతీరూపసృష్టికంటె నీకవి శకుంతలారూపసృష్టిలో సంపూర్ణముగ సిద్ధహస్తుఁడైనాఁడనుటకు ఇట ఇతని'మానస'సృష్టియే నిదర్శనము. కనుకనే ఈకవిబ్రహ్మ "అపరాస్త్రీ రత్నసృష్టిః..." అని బ్రహ్మనే యతిక్రమించఁగల్గెను.

ఈకవి బ్రహ్మయొక్క యీ విరూపసృష్టిని విలోకించియే కాబోలు శ్రీ బాణభట్టకవి తన "కాదంబరి"లో బ్రహ్మయొక్క మతంగ కన్యారూప సృష్టిని భంగ్యంతరముగా నిట్లు భావించినాఁడు.

"మన్యేచమాతంగజాతి స్పర్శదోషభయాత్ అస్పృశతా ఇయ
ముత్పాదితా ప్రజాపతినా అన్యథా కథ మియమక్లిష్టతా లావణ్యస్య?
నహికరతలస్పర్శక్లేశితానా మీదృశీ భవతికాంతిః॥ (కాదంబరి)

"అంత్యజాతియగు మాతంగజాతి కన్యను జేతముట్టినచో పాపముకల్గును" అను సంశయముతో బ్రహ్మ, ఆ మాతంగకన్యను జేత ముట్టకయే నిర్మించియుండును. (చేతితోఁ జేయునది) మనోభావనచేతనే చేయఁబడవలయునుగదా!)అని తలంచెదను (బాణకవి) చేతితోఁజేసిన వస్తువుల కింతటి సౌకుమార్యమును, సైగనిగ్యమును (నిగనిగ) కాం

తియు అనునవి యెట్లు చేకూఱఁగలవు? కనుక నీ మతంగకన్య బ్రహ్మ యొక్క మానస సృష్టియై యుండవలెను,'' ఇట్లు బాణభట్టు "మనసా'' అను కాళిదాసు ప్రయోగమును జెప్పకయే దాని భావమును భంగ్యంతరముగాఁ బ్రకాశింపఁజేసి "కవి భావనా ప్రభావము'' నిట మెఱయించినాఁడు. బాణభట్టుయొక్క పై "అక్లిష్టత'' కూడ కాళిదాసు యొక్క "అక్లిష్ట బాలతరుపల్లవలోభనీయం'' అను దానినుండి గృహీతము కానోపును. ప్రకృతమనుసరామః ప్రస్తుతమున శకుంతలారూపము నింతగా వర్ణించియుఁ దనివినొందక రాజు తద్రూపవిషయకమైన రహస్యము నిట్లు విదూషకునితో ముచ్చటించుచున్నాఁడు.

"ఇదంచ మే మనసి వర్తతే. (ఇదికూడ నామనసులోనిమాట)

"అనాఘ్రాతంపుష్పం కిసలయ మలూనంకరరుహై

రనావిద్ధంరత్నం మధునవమనాస్వాదితరసం

అఖండం పుణ్యానాం ఫలమిఁచతద్రూపమనఘం

నజానే భోక్తారంకమిహ పముపస్థాస్యతివిధిః॥ (అంక౦ 2-10)

శకుంతలారూప మింతవఱకు నేయొక్కనిచేతను నాఘ్రాణింపఁబడని పుష్పము. ఇట్లే తద్రూపము ఏయొక్కనిచేతి గోరును దాఁకని చిగురుటాకు. 2. తద్రూపము ఇంతవఱకు రంధ్రముచేయఁబడని రత్నము. 3. (వావిరివుట్టురత్నము) ఇట్లే యది చవిచూడఁబడని తేనియ. 4. అఖండపుణ్యములఫలము. 5. ఇట్టి నిరుపమ, నిర్దుష్టరూపమును అనుభవించుటకు బ్రహ్మ ఏపుణ్యాత్ముని సృజించియుంచెనో? మిత్రమా ! నాకుఁ (రాజునకు) దెలియదు.

ఇదంతయు దుష్యంతుని మనసులోనిమాటయేకదా ! నాయిక యొక్క రూపపుష్పము నూతనముగ వికసించి విలసిల్లుచున్నదిగాన, ఈ నవకుసుమము నాఘ్రాణించు నభిలాష నాయకుని మనసులో గూఢముగ నున్నట్లిట సూచితమగుచున్నది. ఇట్లె యీ మెరూపము,

నఖక్షతములులేని నవకిసలయము కనుక, నిట్టి కిసాలముపై నఖక్షతములు సేయు కోరిక లీతనిలో నిరికలెత్తుచున్న వనవలెను. ఈరీతినే ఈ నవ్యరమణీయ రత్నమును ముందుగాఁ దానే స్వీకరింపవలయు నను నాస ఈ యవనీపతికి ఆ జన్మసిద్ధమైన దే యనవలెను. "రత్నహారీతు పార్థివః" అని అభిజ్ఞు లనుచుందురుగదా! ఇదేవిధముగ క్రొంగ్రొత్త తేనియను ముందుగఁ జవిచూడవలెనను నాస లీ భూపతిలో దాగుడుమూతలాడుచున్నవనియు, నింతటి పుణ్యాలపంట నేపుణ్యాత్ముఁనకుఁ దక్కునో? యని యీతనివేదన మధికమగుచున్నదనియు నీశ్లోకమున సూచితములగుచున్నవి. ఇట్టి శ్లోకమును భావించిన కొలఁది శృంగార భావములు మొలకలెత్తుటే కాక యిద్దానినుండి యుత్తమభావములు కూడ నుదయించుచున్నవి. నవవికసితమైన యీమె రూపపుష్పము, తన వినూత్న సరస సౌరభములతో నాగంతుకులకు నిట ఆమెతలో సంగవలసియున్నది. ఐనను నీ పుష్పము ఇంతదనుక నేయొక్కనిచేతను నాఘ్రాణితము కాలేదు వికసితపుష్ప మిట్లొరులచేఁ దెలియఁబడకుండుటకు ఇట ఏదోయొక బలవత్తరకారణ ముండియుండవలెను. అట్టి కారణ మఱయఁగా నా కవగతమైన కారణమిది. మధుకరాంగనలకు పూచిన సంపెంగపొలుపు అంటరానిదై భోగబాహ్యమగుచుండును. ఇట్లే ఇట శకుంతలారూప పుష్పములోని పొలుపుకూడ, అన్యపురుష దృష్టి మధుకరాంగనలకు అంటరానిదై భోగబాహ్యమగుటలో వింత యుండదు. పై నాభావమునకుమూ కాళిదాసమహాకవి చూపిన యుపపత్తిఁజూడుడు. "శమప్రధానేషు తపోధనేషుగూఢం హిదాహాత్మక మస్తి తేజః।
స్పర్శానుకూలా ఇవసూర్యకాంతా స్తదన్య తేజోఽభి భవాద్వమంతి॥ (2-7)

అన్య తేజమునుండి పరాభవముకల్గినపుడే సూర్యకాంతపుమణులు మం

డినట్లు శాంతిప్రధానులైన తాపసజనులు పరాభవప్రాప్తి సమయము ననే తమ శాపరూపమైన దాహకశక్తిని గనంబఱచుదురు. (శకుంతల నెట్లైనఁ జేతఁజిక్కించుకొను మన్న విదూషకునితో రాజు చెప్పినసమాధాన సందర్భములోని దిది) కనుక భారతీయ సతీమతల్లుల రూపపుష్పములు వారి పతులకు దక్క, పరులదృష్టి భృంగాంగనలకు అంటరాని వేయగుచున్నవని యిట స్పష్టమైనది. ఇట నింకొకవిశేష మేమనగా పుష్పము చేతఁదాకనంతవఱకె దాని వినూత్న వికాసములు నిత్యనూతనములై, వస్తునిష్ఠములై విరాజిల్లును. ఈ విశిష్టవిషయము నే "కీట్సు" అను నాంగ్లేయకవి యిట్లు తెలిపినాడు. (ఒకచిత్రములోఁ బ్రియురాలి చెంత నిలిచియున్న ప్రియుఁడామెను దాఁకక యామెవైపు వలపులఁ జూపుచు నట్లే నిలిచియుండుట యిట సందర్భము)

"Bold lover, never never canst thou kiss thovlgh winming mear the gool yet, do mat grvieve She cannat fade, though thou hast mot thy bliss for ever wilt thon love, ond she be fair"

"ప్రియుడు ప్రేయసికి అత్యంత సన్నిహితుఁడై ప్రేమోద్రేకమును జూపగల్గినను, అతఁడు ప్రియురాలిని ముద్దిడలేడు. అంతమాత్రమున నతఁడు ఖిన్నుఁడుకారాదు మర్త్య స్పర్శలేనంతవఱకు సౌందర్యము క్షీణించదు. శృంగారానుభూతితో సౌందర్యము వస్తునిష్ఠత్వమునువిడిచి, పరిచ్ఛిన్నము, భౌతికము కాగలదు. కావున (సౌందర్యవతిని ముట్టక) ఆస్థితిలోనే అతఁడున్నచో శాశ్వతముగా నామెను ప్రేమించగలఁడు. శాశ్వతముగా నామె సుందరముగా నుండగలదు."

(చూ. శ్రీ. ప్రో. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సౌందర్యమీమాంస)

ఈ "కీట్సు"నకుఁ బదునెన్మిదివందల వత్సరములకుఁ బూర్వకాలములో నున్న మన కాళిదాస కవీంద్రుఁడు పై యాంగ్లకవి భావమును దన శాకుంతలములో—

"—ముఖమంసవివర్తి పక్ష్మలాక్ష్యాః కథమప్యున్నమితం
న చుంబితంతు" (చూ. అంకము 3 శ్లో 26)

సహజ సౌందర్య సజ్జితయగు శకుంతలా ముఖమును కాళిదాసు నాయకునిచేఁ బైకెత్తించియు, నద్దానిని రాజుచేఁ జుంబనముచేయించక తత్సౌందర్యమును వస్తు నిష్ఠముగను, శాశ్వతముగను సంరక్షించి, కీట్సున కీ సౌందర్య తత్త్వవేది మార్గదర్శకుఁడయ్యెను. మఱియు మన కవి యీ నూత్న సౌందర్య దృశ్యమును దన దృశ్య కావ్యచిత్రమునఁ జిత్రించి, తత్సౌందర్య కుసుమము, యుగాంతముల వఱకును వాడకుండునట్లును. ఇప్పుడు పాంచభౌతిక శకుంతల లేకున్నను నామె తన శాకుంతలములోఁ జిత్రింపఁబడి సజీవయై, నిత్యనూతనమగు దివ్యసౌందర్యముతో దీపించుచున్నట్లును, అట్టి సౌందర్యవతిని దుష్యంతుఁడు శాశ్వతముగఁ బరమాదరముతోఁ బ్రేమించుచు నామెను జుంబించక, తత్సౌందర్యమును వస్తునిష్ఠముగనే కాపాడినట్లును, నిత్యముగఁ జిత్రించి చూపినాఁడు. ఇట్లు చిత్రగత, లేక కావ్యగత శకుంతలాది పాత్రలు సజీవవ్యక్తుల లేక రూపములకంటె నిత్యములై నిత్యానందదాయకము లగుచున్నట్లు కీట్సు ఇట్లు తెలిపినాఁడు :

"Hoard melodies are sweet, unheard are sweeter"

గాయకుల గానములు వినినంతవఱకె (పాడినంతవఱకె) మధురములగుచుండగా, చిత్రచిత్రితములైన గాయకుల గానదృశ్యములు చిత్రమున్నంతవఱకును వీనులవిందుగ వినుపించుచునేయున్నట్లు మధురతరము లగుచుండును.

"కీట్సు" యొక్క పై భావమునకుఁగూడ మూలము భారతీయ కవుల భావమే అనుట కీక్రింది శ్లోకమే నిదర్శనము.

"ఆదిరాజ యశోబింబమాదర్శం ప్రాప్య వాఙ్మయం॥
తేషా మసన్నిధానేపి నస్వయం పశ్య నశ్యతి॥"

శ్రీరామచంద్రుండు మొదలగు మహారాజుల "కీర్తి" బింబము (సంస్కృత) వాఙ్మయము అను నద్దములోఁ బ్రతిఫలించి నేఁడా రాజులు ఎదుట లేకున్నను, దత్కీర్తి బింబము మాత్రము తద్వాఙ్మయాదర్శములో నిత్యసన్నిహితమై కనుపించుచునే యున్నది మహాకవులచేఁ దమ కావ్యాఽదర్శములో వర్ణితమైన (ప్రతిఫలింపఁజేయఁబడిన) ఉత్తమనాయకుల యుదార చరితమను బింబము, భౌతికవస్తు బింబమువలెఁ దాత్కాలికముగాఁ గాక నిత్యమై యందుఁ బ్రకాశించుచునేయుండును. అని భావము.

ఇఁక "అనాఘ్రాతం పుష్పం .." అను శ్లోకములోని పుష్ప, కిసలయ, రత్న, మధు, పుణ్యఫలములు క్రమముగ, సురభిళ, సుకుమార. సుదీప్త, సుమధుర, సుకీర్త్యమైనవై శకుంతలారూపముకంటె నభిన్నములై యున్నవి ఇట్టి విశిష్టవస్తు పంచక సాన్నిధ్యముచే నాయకునిలో నాశాఽనురాగముల నినుమడింపఁజేసి, యామె లాభమునకై నాయకునిఁ బూర్తిగఁ బ్రేరేచినాఁడు. కాని శకుంతల "అఖండపుణ్యఫలము" కలవానికే లభ్యముకాఁగలదుకదా! దీనితో తేనిచిత్తమింకను ఆమెకై యుత్తలపడి, యతని యూహ లింకను అంబర మంటినవి. దీనితో రాజు చిత్తములో రాజసము రగుల్కొన్నది. "రాజు రత్నహారికదా!" కనుక నేఁక నెట్లైనను ఈ స్త్రీరత్నమును సంపాదించుటే యాతని ముఖ్యకర్తవ్యమై యున్నది. వెంటనే రాజు విదూషకునిఁగారణాంతర కల్పనముచేఁ బంపించివేసినాఁడు. ఇట్టి రాజసమే శకుంతలను గూడ ఆవరించి, ఆమెను పతిధ్యానైక పరాయణగను, విషయలంపటగను దయారుచేసినది, ఆమె యిప్పటి యౌవనోద్దామత, ఆమె శాంతచిత్రమును గల్లోలితమొనర్చి విషయవాగురలో నామెనుజిక్కింపఁజేసినది. అహా! యౌవనవిజృంభణశక్తి యెంతటివారినైనను జీకాకుపఱచునుగదా !

"అంచితమందాక్షంబులు । సంచితదరహాసకాంతిసౌభాగ్యంబుల్ ।
వంచితసుజ్ఞానధనా ॥ భ్యంచితములు విషమదములు
యౌవనభరముల్"

ఇట్లు మన సౌందర్య తత్త్వవేత్త, శకుంతలయొక్క భౌతిక సౌందర్య సర్వస్వము నొక్కుమ్మడిగ నొలికించి, ఇట్టి యస్థిర సౌందర్య తారళ్యముచేఁ గల్గిన యీమె భావచాంచల్యాహంకారాశాంత్యాదులను భావి దూర్వాసశాపమునకు మూలకములుగఁ జిత్రించి, యుద్దీపన విభావ భావితులైన యీ నూత్న నాయికా నాయకులను ఒక్కసారి మన కవి కలిపి చూచినాఁడు. ఈయపరిణామదశలో నున్న వీరి యీ కలయిక కేవల కాముకత్వ ప్రధానమైనది. "యోహ్యేక సక్తస్స జనో జఘన్యః" అను సూక్తి ననుసరించి కేవల "కామ" పురుషార్థ సేవనము మన వైవాహిక సంప్రదాయరీత్యా నింద్యమైనది. "దాతా ధర్మార్థకామేషు, త్వయా, ఏషా, న, అతిచరితవ్యా" అని మొదటి నిబంధనము. అస్థిర యౌవనోద్వేగ మచిరమైనట్లు, అస్థిర కాముకత్వముకూడ అచిరమై ప్రేమను అస్థిరముసేయును

అస్థిరమగు నిట్టి యౌవనోద్వేగమువలన జనించిన ప్రేమ అస్థిరమగుటయే కాక,విషాదాంతముకూడఁ గాఁగలదు. మంగళాంతము కావలసిన భారతీయ సంస్కృతికిఁ బై విషాదాంతరీతి విపరీతమైనది. మన భారతీయ ప్రణయము పుత్రోదయఫలకమై పిమ్మట, ఆధ్యాత్మిక ప్రేమముతోఁ గలిసి విశ్వప్రేమముగ విస్తృతము కావలసియున్నది. ఇట్టి మన సంస్కృతికి మంగళాలంకార మనఁదగిన మన మహాకవి సమయము దొరకినప్పుడెల్లఁ బై విశిష్టవిషయమును వాచ్యముగనో+ వ్యంగ్యముగనో సూచించుచునేయున్నాఁడు పైశ్లోకములోని"అఖండం పుణ్యానాం ఫలమివచతద్రూప" మ్మనుటచేత పుణ్యాఫలము తపస్సా

+"వార్ధకేమునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజాం" రఘువంశము స౧॥

ధ్యమనియు, నీతపము చిత్తశుద్ధికిఁ గారణమై యాధ్యాత్మిక చింతనకు మార్గదర్శకమగుననియు, నిట్టి యాధ్యాత్మికతత్త్వము ప్రధానముగ, లేక చరమలక్ష్యముగాఁగల ప్రేమయే శాశ్వతానందదాయకమైన నిజమగు భారతీయప్రేమ యని యిట్లు మన మహాకవి వ్యంగ్యమర్యాద చేసూచించినాఁడు. మఱియు :-

"అనాఘ్రాతం" అను శ్లోకములోని "పుష్పం" మున్నగువస్తు పంచకము జ్ఞానేంద్రియగ్రాహ్యమై (జ్ఞానేంద్రియమైన ఘ్రాణేంద్రియమే "పుష్పము"ను గెలిసికొనఁగలదు) శకుంతలారూపమగుచున్నది. కనుక శకుంతలారూపము, అనఁగా శాకుంతలకథారూపతత్త్వము జ్ఞానముచేత గ్రాహ్యమైనది. అనఁగా "తత్త్వము జ్ఞానదృష్టికే గోచరమగును." అను ధ్వన్యర్థ మిట కవిచే నిక్షిప్తము. పై విషయము "కాళిదాసు- తత్త్వజ్ఞానవైభవము" అను వ్యాసభాగమున విస్పష్టము చేయఁబడినది. ఇహైహికవిషయములతో నాముష్మికవిషయములు మిళితములైయుండుట ఈకవి కవితలోని ప్రత్యేకత.

పై విధముగ మనకవి, శకుంతలా భౌతికసౌందర్య సర్వస్వముతో నాయకుని భౌతికవాంఛల రేకెత్తించి, తపోవనమున కకారణబాధువైన శకుంతలను దుష్యంతుని- అంతఃపుర స్త్రీరత్నసంయుక్తుని ప్రేమవాగురలో నొక్కమాఱుగఁ జిక్కునట్లు చేసినాఁడు. శాఠ్యమెఱుఁగని శకుంతల సులభముగ రాజునకుఁ జిక్కినది- ఇపుడీమె తనతొల్లిటి శాంతిపదమునుండి పతితయైనట్లుకూడ నామెకుఁ దెలియదు. కనుకనే యిప్పటి యీమె పరిస్థితిని వర్ణించుచు రవీంద్ర కవీంద్రుఁడు ఆరణ్యక పుష్పముపై "దుమ్ము" పడినను అది, ఆపుష్ప సౌందర్యమునకుఁ బ్రతిబంధకముకాలేదు" అని నుడివినాఁడు * కనుకనే యీపుష్పదళముల

* "Dust settles on the flower of the forest. But in spite of it she easily retains her own beautiful cleanliness"

నైసర్గికశోభ, మాలిన్యయుతమైనపుడుకూడ చెక్కుచెదరక అట్లే (యథాపూర్వముగ) నిలిచియున్నది.

నైర్మల్యముతో నిత్యప్రకాశమానమైన యిట్టి స్వాభావిక సౌందర్యవిశేషమును దుష్యంత ముఖమున మనకవి యిట్లు పలికించినాఁడు.

"శుద్ధాంత దుర్లభ మిదంవపురాశ్రమవాసినో యదిజనస్య ॥
దూరీకృతాః ఖలుగుణైరుద్యానలతా వనలతాభిః"(అంకము 1)

ఈ యాశ్రమవాసినుల యందు నైజముగ భాసించుచున్న రూపవైభవము, అంతఃపురస్త్రీలకుఁగూడ అలభ్యమేమైనదైనచో, నీ తపోవనలతలు తమ స్వాభావిక సుగుణగణముచే, నుద్యానవనలతలను వెనుకకు నెట్టుచున్నవి. ఇట్టి సుగుణముల చేతనే ఆశ్రమ కురంగము వలె భయసందేహము లెఱుంగని శకుంతల సులభముగనే రాజునకుఁ జిక్కినది. శ్రీ రవీంద్ర కవీంద్రుఁ డనినట్లు "సులభముగ సంప్రాప్తమైనది సులభముగనే సురిగిపోవును." కనుక ఇట శకుంతలా దుష్యంతుల భౌతిక-అస్థిర శారీరక సంసర్గమును శాశ్వతానందదాయకమగు నైతిక (మానసిక) సమ్మేళనముగా దిద్ది తీర్చవలసిన బాధ్యత యింక మన మహాకవిపై నున్నది.

ఇప్పుడు శకుంతల దుష్యంత పరిణీతయై తన స్వార్థసంయుత ప్రేమసామ్రాజ్యమునకు ఒక్క దుష్యంత సార్వభౌమునే సార్వభౌముని గఁ జేసికొన్నది. ఇప్పుడామె హృదయమున ఒక్క "దుష్యంతునకు" వినా మఱియేయొక్కరికిని- చెలికత్తెలకుగాని, తుదకుఁ బ్రాణాధికమైన "వనజ్యోత్స్న"కుఁగాని ♦ చోటులేదు. సంకుచిత హృదయముల లో "విశ్వప్రేమము"నకు విశిష్టస్థానము లభించదుగదా! నాల్గురోజులలోఁ దన యంతఃపురమునకుఁ దీసికొని వెళ్ళెదనని నమ్మించి వెళ్ళిన

♦ "అనసూయా -: త్వ యా కృతినామధేయా వనజ్యోత్స్నేతివిస్మృతాసి
శకుంతలా -: తథా యది ఆత్మానమపి విస్మరిష్యామి. (అంకము 1)

నాథునివద్దనుండి యెట్టివార్తయు రాదయ్యె. కనుక అనన్యమానసయై శకుంతల పతిధ్యాన ముద్రిత చిత్తయై యున్నది ఇట్టిసమయమున సులభకోపనుఁడైన దూర్వాసమహర్షి వచ్చి, తదేకచిత్తయై, తద్ధ్యాననిమగ్నయైయున్న యామెకు దుర్భరశాపమిచ్చి వెడలినాఁడు. ఇట్టి శాపవార్తనుగూడ నామె వినలేదయ్యె. ఈకవి తన రఘువంశ కావ్యమునఁ జెప్పినట్లు "ప్రతిబధ్నాతిహి శ్రేయః పూజ్యపూజావ్యతిక్రమః" పూజ్యులను బూజింపకుండుట తమ భావి శ్రేయస్సునకుఁ బ్రతిబంధకమేయగును. కనుక నీమె దుర్వాసముని విషయమునఁ జేసినపూజావ్యతిక్రమము, ఈమె భావిశ్రేయమునకు విఘ్నముగ మాఱినది. ఇట్టి సంఘటన మిట మన కవీంద్రునిచే బుద్ధిపూర్వకముగనే చేయఁబడినది. ఇట్టి విషమసంఘటనమునే మన మహాకవి యిట కల్పించకున్నచో, శకుంతలయొక్క పూర్వ శాంతినికేతన జీవిత గౌరవమంతయుఁ గలుషితమై యది యింకొకలాగునఁ బరిణమించి, శకుంతలను "భరతమాత" అను ప్రపంచ ప్రశస్తినుండి దూరముచేసియుండెడిది.

ఒకవేళ మన కవి కరుణించి యీ నాయికా నాయకులను దూర్వాస శాపహతి నుండి కాపాడి పండువంటి కాపురములో వెంటనే ప్రవేశపెట్టినాఁ డనుకొనుఁడు. అప్పుడు శకుంతల తన పొంగారు నిండుజవ్వనములో రాజాంతఃపురమున రాజ్ఞీపీఠ మధివసించి. నిరాఘాటమైన తన యౌవ్వనను జలాయించుచు నామె తన భావిజీవితమును బూర్తిగ రాజసమునకే యంకితము చేసియుండెడిది. యౌవనము, ధనసంపత్తి, ప్రభుత్వము, అవివేకిత్వము" అను నీ దుష్టచతుష్టయములో నేయొక్కటి యున్నను అనర్థమున కది దారిసూపుచుండగా నీ నాల్గును నొక్కచో ♦ గూడియున్నచో నచ్చట అనర్థ పరంపరలు

♦ "యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వమవివేకితా । ఏకైకమప్యనర్థాయ కిము యత్రచతుష్టయం" (హితోపదేశసూక్తి)

దమంతదామా వలచివచ్చునుగదా! ఇంతియేకాక శకుంతల, పతిగృహమున వెంటనే కాపురముసేయ సమకట్టినచో భారతీయ పవిత్రప్రణయ ప్రాభవములోని గురుత్వ, మహత్త్వ, పటుత్వ సంపదలు మనకింతగాఁ దెలిసియుండెడివికావు. కనుకనే మన సౌందర్యవిదగ్రణి (కాళిదాసు) క్రొంగ్రొత్తగాఁ గాఁపురమునకు వచ్చిన యీ సౌందర్యరాశి, శకుంతలకు రాజగృహమునఁగాని, తుదకు పతి చిత్తమునఁగాని (శాపసాధనముచే) రవంతయైనను స్థానము దొరకనీలేదు. ఇఁక నీమెకుఁ గణ్వాశ్రమములోఁ గూడ స్థానములేదు. భారతీయవనితామ తల్లులకుఁ బతిగృహమున దాస్యమైనను గౌరవప్రదమైనదే. కనుకఁ బతినిరాకృతయైన యిప్పటి శకుంతల యగతికయై "భగవతివసుధే! దేహిమేవివరమ్మ"ని దుఃఖించుచు నంతర్ధానమందినది. (ఇది పూర్వభాగము)

ఐహికాఽముష్మికములేగాక, సౌందర్యముకూడ శక్తివంతమై, చరితార్థతనందుటకు "తపస్సు" ప్రథమసాధనమైనట్లు మనము గిరిజా సౌందర్య వర్ణనాభాగమునఁ దెలిసికొనియుంటిమి. ఈతపస్సునకుఁ బవిత్రవాతావరణ మత్యవసరమైనది. కనుక గౌరికి గౌరీశంకరశిఖరము వలె నీమెకు మన కవిమహర్షి, మారీచమహర్షియొక్క దివ్యాశ్రమము తపశ్చరణానుకూలముగఁ జేసినాఁడు. అట ఆమెచేఁ గఠినాఽతికఠినమైన తపస్సుఁజేయించి, యామె సౌందర్యాఽహంకార కిల్బిషమంతటిని క్షాళితముఁజేసి, యామె నొక వినిర్మలసౌందర్య విరాజితమూర్తిగఁ బరిణమింపఁజేసినాఁడు. అట దుష్యంతుని చిత్తములో నభిజ్ఞానాంగుళీయక దర్శనముతోఁ బరితాపాఽగ్నిని బ్రజ్వరిల్లఁజేసినాఁడు. ధర్మరక్షణార్థమై ధర్మాసన మధిష్ఠించిన తాను (దుష్యంతుఁడు) ఒక పూతచరిత్రయెడ— ఒక యమాయికయెడఁ గావించిన దారుణకృత్యముఁ దలంచినకొలఁదియు నది వానియెడందను గాల్చిచ్చువలెఁ గాల్చివేయుచున్నది. తన గృహమునకు వచ్చిన తన గృహలక్ష్మిని—

తన కులాఽభ్యుదయలక్ష్మిని- సంతానసని ఇచ్చిన తన జీవితానందా
భ్యుదయలక్ష్మిని, నిరాకరించి పోయున్న తన (రాజు) యప్పటి యా
మోహప్రాబల్యము, ఆ యజ్ఞత, ఆ స్మృతి తిరోధానము తలంచిన
కొలందియుఁ దనలో (దుష్యంతునిలో) దుఃఖతరంగము లతివేలములై
పొంగి పొరలుచున్నవి. ఇట్టి పశ్చాత్తాపముచే రాజు-

"సంరోపితేఽప్యాత్మని ధర్మపత్నీ త్యక్తా మయా నామ కులప్రతిష్ఠా।
కల్పిష్యమాణా మహతే ఫలాయ వసుంధరా కాల ఇవోప్తబీజా॥

"సకాలములో విత్తనములు చల్లి ఫలవంతముగఁ జేసి, పంటసిద్ధమై
చేతికి వచ్చుసమయములో నట్టి తన పంటపొలమును దానిచేతులార
విడిచిపుచ్చిన తెలివిలేనిరైతువలె నేను (రాజు) యుక్తకాలములో *
బీజాఽవాపనము (రేతస్సునుంచుట) చేసిన కతన మహాఫలమును
(సత్పుత్రుని) బ్రసాదించుటకు సిద్ధముగనున్న-కులప్రతిష్ఠకు కారణ
మైన యీ నాగృహలక్ష్మిని చేతులారంగ విడిచిపుచ్చితిని" పైయుప
మానముచే 'వసుంధరా' శబ్దము 'క్షేత్ర' వాచకమై "క్షేత్రం కళత్రే
కేదారే" అని తనభార్యనే సూచించుచున్నది. భార్యావాచకమైన
యీ "వసుంధర" "మహాఫలప్రదాత్రి" జౌరా! ఎంతటి సారస్యము.
ఇంతటి మంచిపంట పొలమును-సిద్ధముగ ఫలమునీఁగలతనక్షేత్రమును
దనచేతులార విడిచినరైతు యెంతటి యవివేకి ? కాని ప్రబలమైనకార
ణాంతరముచేఁ దనపంటపొలమును రైతునే తన కాలఁదన్నినాఁడు.
తిరిగి స్మృతిగలిగి, తన యవివేకిత్వము తనకే తెలియఁగల సుసమయ
ము ప్రాప్తమైనది. ఐననేమి ? "గతజలసేతుబంధనమే" ఇట్టి విచిత్ర
సన్నివేశముగల పై యుపమానబలముచే రాజునకుఁ బ్రాప్తించవలసిన
రెండు ప్రధానప్రయోజనములిట (శకుంతలాత్యాగముచే) భగ్నము

* పతియే భార్యగర్భమునఁ బ్రవేశించును. పతిర్భార్యాం సంప్రవిశ్య గర్భోభూత్వే
హజాయతే (మనుస్మృతి)

లైనవి. "సిద్ధమన్నం ఫలంపక్వం నారీ ప్రథమయౌవనం। సువాసితంచ తాంబూలం సద్యోగ్రుహ్ణాతిబుద్ధిమాన్" అను సూక్తిచే శకుంతలా త్యాగకారణముగ రాజునకు ఐహికభోగరాహిత్యమేకాక, "పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్రః" అనునట్లు పుత్రోత్పత్తికి ఆది కారణమైన యామెను విడనాడుటచే, వంశవిచ్ఛేదము అను రెండవ మహానర్థముగూడఁ గలిగినది. అపుత్రకుఁడైన సార్థవాహావృత్తాంత కల్పనచేఁ గవి, రాజును మూర్ఛాపరవశునిఁజేసి, ఇట రాజుయొక్క యజ్ఞతాదురిత జాలమంతయు నంతరించుటకై తగినంత ప్రాయశ్చిత్తమును గూర్చినాఁడు. దీనితో రాజునకు "చిత్తశుద్ధి"చేకూర్చి చిత్తము వినిర్మలమై భారతీయ పవిత్రప్రణయానుభవమునకుఁ బాత్రత చేకూర్చినవి. ఈ శుభసమయములో శకుంతల-వినిర్మల ప్రణయమూర్తి-విశ్వప్రేమ విరాజితవిశుద్ధగాత్రి-ఎంతదుర్లభవస్తువో! ఎంతటియారాధ్య మూర్తియో, తనఁ(రాజు)యైహికాముష్మిక సుఖంబుల కెంతటిమూల కందమో దుష్యంతున కిప్పుడయవగతమైనది. అట గిరిజతపశ్చరణానంతరమున శివున కెంతటి సత్యసౌందర్య రూపిణియైనదో, యిట దుష్యంతునకు శకుంతల ఇప్పటి నంత సత్యసౌందర్యరూపిణిగ భాసించుచున్నది. ఇకఁ దద్విరహవినోదమునకై యామెను జిత్రించి వినోదించుటకై నను ఇప్పటి యొక్క భావములో భాసించుచున్న యామె సత్య నిత్య నిరవద్య సౌందర్యమును జిత్తరువున రాజుచిత్రింప లేకున్నాఁడు. "యద్యత్సాధున చిత్రేస్యాత్క్రియతే తత్తదన్యథా। తథాపితస్యాలావణ్యం రేఖయా కించిదన్వితం" (అంకము 6 శ్లో 13) రమ్యముకాని భాగమును దిద్ది తీర్చి మనోహరముగఁ జేయుటకుఁ జిత్రము ముఖ్య సాధనము. అట్టిచిత్రములోఁగూడ నిప్పటి శకుంతలాసౌందర్య సర్వస్వములో రేఖామాత్రమే చిత్రించుటకు సాధ్యమగుచున్నదిట. ఆహా! మనకవి యెంతటి సౌందర్యతత్త్వవేత్తయో కదా! ఈదివ్య సౌందర్య

వైభవము "యతోవాచోనివర్తంతే" అను నుపనిషత్సూక్తిని దల పించుచున్నది. ఇప్పుడీమె రాజుయొక్క పవిమలప్రణయ స్వారాజ్య మునకు ఏకైకరాజ్ఞియైనది. ఇక రాజున కేకైకధ్యేయ మీమెయే. ఇంక నీమె తనకు లభించుటెట్లు ? కనుక నీమెకై విలపనమే రాజునకింక శర ణ్యము. శ్రీరామచంద్రునకుకూడ నిండుచూలాలైన సీతాదేవిని లోకారాధనమునకై * అరణ్యములపాలుచేసి యామె ప్రణయమును దలంచుకొని యిట్లే విలపించినాఁడు. "ఇయంగేహే లక్ష్మీః ఇయ మమృత వర్తిర్నయనయోః। కిమస్యానప్రేయో యదిపున రసహ్యోన విరహః॥ ఉ. రా. చ. నాటకము సీత శ్రీరామచంద్రుని గృహలక్ష్మి ఒక్క గృహలక్ష్మియేకాదు. ఆమె రాముని నేత్రముల కమృతదీపము; ఆనందలక్ష్మి; మఱియు సీత రామునికులాభ్యుదయలక్ష్మి; భారతీయ వనితా పాతివ్రత్యకీర్తిలక్ష్మి; ఇట్టి తనయర్ధాంగలక్ష్మి సంబంధములగు చెయిదములన్నియుఁ దనకు (రామునకు) ఆనందజనకములేగాని ఒక్క యామెవిరహము మాత్రమిపుడు దుర్భరమగుచున్నది. ఇట్లే దుష్యం తునకు శకుంతలావిరహముకూడ దుర్భరమై యామెయందుఁ బూజ్య భావమతిశయింపఁ జేయుచున్నది. ఇప్పట్టున నామె తిరిగి తనకు దర్శన మిచ్చినచో నీతని శుష్కజీవితవృక్ష మొక్కమ్మడిగఁ జిగుళ్ళుదొడిగి కుసుమితమై స్తబకితమై ఫలించును. ఈసందర్భమున బృహదారణ్య కోపనిషత్సూక్తియొకటి స్మర్తమైయున్నది."

"నవా అరే! జాయాయై కామాయజాయాప్రియాభవతి।ఆత్మ నస్తుకామాయ జాయాప్రియాభవతి॥" (బృహదారణ్యకము 2-4-5) కేవలఁ భౌతిక భోగదృష్టితోనే యొక్కఁడును భార్యను నిత్య ముగ ప్రేమించలేదు. ఇఁక నామెయందలి (యంతరాత్మ) ఆధ్యాత్మి

* "...అపివా జానకీమపి। ఆరాధనాయలోకస్య ముంచతో నాస్తి మేవ్యథా॥"
(ఉ. రా. చ. నాటకము.)

కప్రేమముచేఁ బతి ఆమెను నిత్యముగఁ బ్రేమింపఁగల్గుచున్నాఁడు. “ఇది నిజమేకదా! ఇదివఱకు కీమెయందతనికిఁగల భౌతికచాంచల్య ప్రేమ యిప్పుడు స్థిరమై యాధ్యాత్మికప్రేమగను నిదియే విశ్వప్రేమగను బరిణమించినదిగదా। భారతీయుల యాదర్శదాంపత్యమునకు శారదామణిని ప్రణయదేవతగఁ బూజించిన రామకృష్ణపరమహంస యొక్క యాదర్శ దివ్యప్రేమయే ప్రబలప్రమాణము. ఇతఁడు తన భార్యను భార్యగా నిత్యముగఁ బ్రేమించలేదు.

ఇట్లు మన మహాకవి పశ్చాత్తాప తపస్సన్నివేశముతో నాయికానాయకుల కామవృత్తిని మథించి వీరిరువురకుఁ జిత్తశుద్ధిని సమకూర్చి వీరిని బవిత్ర ప్రణయ ప్రకాశిత ప్రవిమలమూర్తులుఁగ రూపొందించినాఁడు. ఇటుపైని వీరిప్రేమ వెనుకటివలె వికారవిషాదములను జనింపఁజేయునదికాక నిర్మలమై, సర్వసంఘపరివ్యాప్తమై, భారతీయ దాంపత్య ప్రభావమును బ్రకాశింపఁజేయఁజాలియున్నది. దుష్యంతుని దృష్టి కిపుడు శకుంతల మహిమాన్వితమగు నొక దివ్యప్రేమజ్యోతి. జీవనజ్యోతి.

ఇప్పటికి మన కవీంద్రుని యభిలషితమంతయు ఫలించినది. కనుక నిటుపైని నీ ప్రణయమూర్తులను ఒకయింటివారినిగఁ జేయవలసియున్నది. ఇందుకనియే నాయకునకు దేవేంద్రసహాయార్థమై నాకలోకప్రయాణము కల్పితమైనది. ఈ స్వర్లోకయాత్రతో మర్త్యత్వమునకు అమర్త్యత్వము భౌతికమునకు ఆధ్యాత్మికత్వము ప్రాప్తమైనవి. చూచుచుండఁగనే భూలోక మొక్కసారిగ స్వర్గలోకముగ పరిణతమైనది. ఇంద్రసమ్మానముచే నాయకునిలో దివ్యత్వము దీపించినది. ఇక దివ్యప్రణయలాభప్రాప్తి కావలసియున్నది. కనుకనే స్వర్గమునుండి వచ్చునపుడు మారీచమహర్షిని దర్శించుకోరిక రాజునకుఁ గలిగినది. ఈకోరిక రాజునకుఁ బుత్రసందర్శన జనితసమ్మోదమునకు, శకుంత

లాపునస్సమాగమరూప మహాఽభ్యుదయమునకు మూలమైనది. +
మహాత్ముల సందర్శనభాగ్యము మానవజీవితమునకు మహాఽభ్యుద
యసంపాదనాసమర్థమైనదికదా! ఈదివ్యాఽశ్రమములో రాజునకు
నైదేండ్ల బాలుఁడొకఁడు తల్లిపొదుగులోనున్న సింహశిశువును బలా
త్కారముగలాగి దానితో నాడుకొనుచుఁ గన్నులపండువుగఁ గాను
పించినాఁడు. ఈసన్నివేశముతో రాజుచిత్తములోని భౌతికసంజేహ
తరంగములు ఒక్కసారిగ నుచ్చలితములైనవి. తుదకా గాఢ్యాంతి
దుష్యంతునకు ఆత్మజ్ఞానము (తాను ఆత్మస్వరూపమే అను జ్ఞానము;
లేక "ఆత్మావైపుత్రనామాసి" అని ఈబాలుఁడు తన స్వరూపమే
అను నిశ్చయజ్ఞానము) కలిగించి, వానికి మానుషానందమునంతను
నొక్కసారిగఁ గలుగజేయును. ఆత్మజ్ఞానలాభముగొన్నవానికిబ్రహ్మా
నందము సులభమేకదా! ఇఁక రాజు, ముక్తుఁడైహిక బంధవిముక్తుఁడై
నట్లు పితౄణవిముక్తితో ఋణవిముక్తిని బడయును. ఈవిముక్తితో
నీరాజునకు జీవన్ముక్తునకు మోక్షలక్ష్మీప్రాప్తివలె వెన్వెంటనే శకుం
తలాసమాగమరూప మహాభ్యుదయము చేకూఱినది. ఇప్పటి శకుంతలా
రూపమిదిగో.

"వసనే పరిధూసరే వసానా నియమక్షామముఖీ ధృతైకవేణిః।
అతినిష్కరుణస్య శుద్ధశీలా మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి"(7-21)

ధూళిధూసరితములైన వస్త్రములను ధరించి, కఠిన తపోనియమము
లతోఁగృశించిన ముఖముకలదై ఒకేజడను ధరించి విశుద్ధశీలయై
యీామె యతికఠినాత్ముఁడనైన నావిరహవ్రతము నిట్లు సాగించుచు

+ "ఈసన్నివేశకల్పనముచే మన మహాకవి" "ధర్మప్రజాసంపత్త్యర్థం
స్త్రియ ముద్వహే" అని ఆదిలో వరుఁడు చేసిన వ్యాఖ్యానమును సార్థకముచేసి.గృహ్యా
సూత్రప్రకారముగ భారతీయ దివ్య సంప్రదాయమునిటుఁ బోషించినాఁడు.

న్నది. స్త్రీలకు "విశుద్ధశీలము" సత్య సౌందర్య సంపాదకమైనట్లు "తథాహి తే శీలము దారధర్మనే ! తపస్వి నామప్యుపదేశతాంగతం" అని కుమార సంభవసూక్తిసువ్యక్తము చేసిన ట్లిచ్చటగూడ "శుద్ధ శీలా" అను విశేషణము శకుంతలాసౌందర్యములో సత్య, నిత్య, నిర వద్య, నీరంధ్రనిస్తులసౌందర్యమును దోపింపఁజేయుచునేయున్నది. ఇట్టి దియు నిత్యోత్కర్షణోల్లసితమైనదై, "ప్రియేషు సౌభాగ్యఫలాహి చారుతా" అను చారుత్వ లక్షణ లక్షితమై ప్రియుని నేత్రచకోరము లకుఁ జంద్రికయే యగుచున్నది. కనుక నిప్పటి శకుంతలలో నీతని కదేదో మహత్తర ప్రభావ భాషితమైన—పవిత్ర తేజస్సందీప్తమైన— దివ్యసౌందర్య మగపడుచున్నది. కనుక నాదరభక్తి భావములతోఁ గూడిన పవిత్ర ప్రణయభావ మీమెయెడఁ జూపుచు రాజు ఆ పతి వ్రతతో "ప్రియే! క్రౌర్యమపి మేత్వయి ప్రయుక్త మనుకూలపరిణా మంసంవృత్తం" "ప్రాణేశ్వరీ ! నేను ముందుగ నీవిషయములోఁ జూపిన నాక్రౌర్యభావమిపుడు అనుకూలమైన (అభినంద్యమైన) పరిణా మము కలదైనది" అని పలుకును. ఇప్పటి శకుంతల భరతమాత యైనది. ఈమెలోని యిప్పటి "ప్రేమ" వాత్సల్యరూపమై సర్వ జీవ కోటియందును సమానమై శాశ్వతసౌజన్యముతో శోభిల్లుచున్నది. ఈమె నైష్ఠికసౌందర్య మిపుడు 'సత్య'మై లోక "శివం" కరమై నిత్యమై తేజరిల్లుచున్నది. 'గథే' మహాశయుఁడనినట్లు నవ వికాస విలసితము లగు పుష్పములు క్రమముగ తమపరిణామరూపములైన ఫలముల మధురిమలతోఁ జెందిన సరససమ్మేళనమువంటిదే శకుంతలా దుష్యం తుల కీ సుముహూర్తసమయమున జరిగిన నైతికసమ్మేళనము. ఈస మ్మేళనము ఈదివ్యభూమిలో దివ్యప్రణయస్వర్గమైనది. ఇఁక వీరి యీ పవిత్రప్రణయము ఎన్నటికిని జలించనిది; కృశించనిది; వీడనిది. ఇఁక

భూతలముకూడ కాళిదాస కమనీయ కవితా గౌరవముచే నతిసహజముగనే స్వర్గముగఁ బరిణమించినది.

"The earth and Heaven itself in one sole...name combine అన్న గథే కవీంద్రుని పద్యభావమిట్ట సార్థకమైనది.

ఇంతవఱకుఁ గల నాభావములను వివరించుచున్నట్లున్న శ్రీ రవీంద్రకవీంద్రుని భావరత్నములఁ గొన్నిటినిటఁ బొందుపఱచెదను.

The poet has shown here, as in Kumarasambhava that the beauty that goes hand in hand with moral love is eternal, that the calm, controlled, and benefient form of love is its best form, that beauty is truly charming under restraint and decays quickly when it gets wild and unfettered.

He teaches us that the love of man and woman is not, beautiful, not lasting 'not fruitful, so long as it is self- centered, so long as it does not beget goodness, so long as it does not diffuse itself into society over son and daughter, guests and neighbours.

The beauty that he adores is lit up by grace· modesty, and goodness ! in its intensity it is true to one forever; in its range it embracas the whole universe. flt is fulfilled by renunciation, gratified by sorrow, and rendered eternal by religion. In the midst of this beauty the impetuous unruly love of man and woman. has restrained itself and attained to a profound place like a wild torrent merged in the ocean of goodness, Therefore such love is higher and more wonderful than wild and untrained passion·

రవీంద్రునిపై యాఙ్గ్లమాతృకకిది శ్రీ బొ. పురుషోత్తము M. A. గారి యాంధ్రానువాదము. (చూ. కాళిదాసకవిత) "ధర్మమున కవిరుద్ధముగా ప్రేమభావముతోనడచు సౌందర్యము శాశ్వతమైనది......

నైష్ఠికసౌందర్యమే శుభప్రదమై నిత్యోత్కర్షణోల్లసితమైనది. నియమరహితమును, సంస్కృతమునగు సౌందర్యము క్షణభంగురము. కవి యిట్టి పవిత్రభావములను కుమారసంభవమునందువలె నిందును (శాకుంతలమున) కాంతాసమ్మితముగా నుపదేశించెను... దంపతుల ప్రేమ స్వార్థయుతమైనచో నెట్టి సత్ఫలితముల నొసంగదనియు, వాత్సల్యరూపమున సంఘమునందుం బరివ్యాప్తము కానంతవఱకును దాని కెట్టి సౌందర్యముకాని, శాశ్వతత్వముకాని, చరితార్థతకాని లేదనియు నీకాళిదాసమహాకవి ముక్తకంఠమున నుద్ఘోషించెను... కాళిదాసుని సౌందర్యజగత్తు జీవకళతోం గళకళలాడునది సౌజన్యముతో శోభిల్లునది. సాధుత్వమును సవదరించుకొన్నది. సువిశాల విశ్వమును సుచిరప్రేమభావముతో నాలింగన మొనర్చుకొన్నది. కాళిదాస ప్రతిపాదిత సౌందర్యము త్యాగముచే సిద్ధించును. దుఃఖముచే నూతనత్వమును బొందును. తపస్సుచే దివ్యత్వము నార్జించును. ఇట్టి దివ్యసౌందర్యార్ణవమునందు నియమరహితములైన కామోద్రిక్తతా ప్రవాహములు అనేకములు సంగమించి (భారతీయ) ప్రణయభావసిద్ధితోం బరిపూర్ణతను అనుభవించును సకలప్రపంచమును అట్టి దివ్యసౌందర్యధామము (నిలయము)గాం బరివర్తింపంబడవలయుననియే (మన) శ్రీ కాళిదాసకవీంద్రుని యాశయము."

పై రవీంద్ర కవీంద్రుని యాశయములకు మన మహాకవి శాకుంతలనాటకము పూర్తిగఁ బాత్రమైయున్నట్లు పై విషయములనుబట్టి తెలిసికొనియుంటిమి. ఇట్లీ భారతీయుల పవిత్ర ప్రణయప్రాభవమును దన మహాకావ్యములమూలమునఁ బ్రపంచమునకుం జాటి, భారతజాతిని తరతరాలవఱకుం బటిష్ఠముగను, మహోన్నతముగను దిద్దితీర్చి, ప్రపంచములో మనకొక ప్రత్యేకస్థానమును బ్రసాదింపంజేసిన కాళిదాసమహాకవికి నిజముగ మనమందఱము ఋణపడియుంటిమి. మఱియు

స్వార్థ సంకుచితప్రేమను విశ్వమానవ ప్రేమగాఁ బరిణమింపఁజేసి, భూమండలమునంతను నేకకుటుంబముగ +నాదరభావముతోఁ జూడఁ గల్గిన-ప్రకృతియంతటిలోఁ దన ప్రేమామృతము నొలికించి స్థావర జంగమరూప ప్రపంచమంతటిని సమానగౌరవముతో, సమానప్రేమ తోఁ జూడఁగల్గిన జాతీయమహాకవి కాళిదాసమహాకవి ఇట్టి జాతీయ మహాకవియొక్క- కావ్యసందేశమూలముననే భారతజాతియంతయు విశ్వమానవప్రేమతో విశ్వజనీనమై విశ్వమంతటిలో విశిష్టస్థానము నార్జించుకొనఁగల్గినది. కనుక మన జాతీయమహాకవి కవితను వివేచనా దృష్టితో నధ్యయనము చేసి యాతనికావ్యములలోని "విశ్వప్రేమ"తో విశ్వమునకు-ముఖ్యముగ చైనావంటి దురహంకారపూరిత దుష్టసంఘ ములకు-వెలుఁగుబాటను జూపుట విజ్ఞుల కర్తవ్యమై యున్నది.

"సర్వస్య సద్భావనాఽస్తు విశ్వస్య కళ్యాణమస్తు
లోకాస్సమస్తా స్సుఖినోభవంతు" ఇతిశం జగజ్జనన్యర్పణమస్తు.

'ఓం తత్సత్"

+ "ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకం."

# పంచారామములు పరమశివక్షేత్రములే

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

పాశ్చాత్యులాగవడి పెట్టిన పద్ధతిలో భారతీయసారస్వతమును చారిత్రిక నిదర్శనముల సమన్వయముతోఁ బరిశీలింప మొదలుపెట్టుసరికి, చాలవిషయములలో నేకవాక్యత కుదురుటలేదు. మన పురాణములలోఁ గానవచ్చెడి విషయములకు, ఇప్పటివిమర్శకుల సమన్వయమునకుఁ జాల అంతర మేర్పడుచున్నది. శాసనాద్యాధారములతోను పురావస్తుతత్త్వ పరిశీలనముతోను పరిశోధనము గావించుచు వచ్చుసరికి వెనుకటి సిద్ధాంతములు, అనఁగా నేఁటి కేఁబది వత్సరముల వెనుక నేర్పఱచుకొన్న సిద్ధాంతముల నీనాఁడు మార్చుకొనవలసి వచ్చుచున్నది. ఉదాహరణమున కింతకుముందు, పల్నాటి పరిసరములకుఁ బాలకులుగానుండిన ఇక్ష్వాకులు బౌద్ధమతావలంబకు లనుకొనుచు వచ్చుచుండఁగా, నాగార్జునకొండ త్రివ్వకములలో బయటఁబడిన, వారికాలమునాఁటివిగా గుర్తింపఁబడిన అశ్వమేధయాగచిహ్నములు, శివకేశవాదిమూర్తులు, దేవళములు విహారములు స్తూపములు ఈనాఁడు బయటఁబడునప్పటికి, వారిలో పురుషులు వైదికమతావలంబులనియు, స్త్రీలు బౌద్ధాదిమతానుయాయినులనియు ననుకొనవలసివచ్చినది. వారికాలములో సర్వమతసహనమే యున్నట్లు కాన్పించుచున్నది. శాతవాహనుల పాలనకాలములోనివిషయగూడ నంతటిదే.

ఈవిధముగనే త్రిలింగదేశమధ్యమునందున్న పంచారామములు పరమశివక్షేత్రములని, మనపురాణములు ఆ యా క్షేత్రములందున్న ప్రాచీనశాసనములు తెలుపుచుండ, అవి బౌద్ధసంఘారామములేయనియు, శైవమతము మనదేశములోఁ బ్రబలినది మొదలు సంఘారామములందలి ఆయకస్తంభములే శివలింగములుగాను, విహారస్తూపాదికములే ఆలయములుగా మాఱినవని, ఈమార్పు మహావ్యాప్తిమూలమున నేర్పడినదని యొకసిద్ధాంత మేర్పడినది. ఆంగ్లభాషలో త్రిలింగ

దేశమునకు సంబంధించిన చరిత్రము నిర్మింపఁబూనినవారు, తదను యాయులు నీసిద్ధాంతము బయలుదేరినది మొదలుగ నీనాఁటివఱకు నీవిషయమునే పురశ్చరణ చేయుచున్నారు. చరిత్రకారులని ప్రఖ్యాతులైనవారి రచనములందంతట నిది కానవచ్చుచున్నది. ఈ సిద్ధాంత మెంతవఱకు పరిగ్రాహ్యమో ? పరికింతము.

భారత దేశమునందలి శివక్షేత్రములలో శివలింగములనుగాని, విష్ణుక్షేత్రములలోని విష్ణు విగ్రహములనుగాని ప్రతిష్ఠచేయునప్పుడు తత్తదాగమోక్తపద్ధతిని శ్రుతిస్మృతి సదాచారానుసరణముగ నాయా పనులు నిర్వర్తించుటయే జరుగుచుండుననుట సర్వథా సత్యము. వైదికమతము నవలంబించి లింగాదులను ప్రతిష్ఠచేయువారు, వేదప్రామాణ్యము నంగీకరింపని యితరమతస్థు లుపయోగించిన వస్తువులను నుపయోగించుపరిపాటి యున్నట్లు లీ త్రిలింగదేశములో నేనాఁడును వినఁబడదు కనఁబడదు. కావున బౌద్ధసంఘారామాదులను శివాలయములుగా మార్చుటగాని, ఆయక స్తంభములను శివలింగములుగాఁ జేసి ప్రతిష్ఠచేయుటగాని జరిగియుండెననుట కాధారమేపాటియుఁ గానరాదు.

మొదట నిట్టియూహచేయుటకు మూలము, కృష్ణవేణీనదీతీరమునందుండిన అమరేశ్వరావాసమైనక్షేత్రము అమరారామమగుచు, అచటనేయున్న ధాన్యకటకము (ధరణికోట) బౌద్ధస్థూప సంఘారామ విహారాది సమన్వితమగుటవలనను, అమరేశ్వరలింగ మొకప్పుడు పెకలింపఁబడి పునఃప్రతిష్ఠితమగుటచేతను, ఆరామమునంగా బౌద్ధసంఘారామమేయనియు, అచటి ఆయక స్తంభములు తెల్లగానుండుటయు, పంచారామములలోని శివలింగములు తెల్లగానుండుటయుఁ జూచి, ఆయక స్తంభములే శివలింగములైనవనుటచే బౌద్ధశైవములు రెండును సమృద్ధముగానుండిన చోటున నూహించిన సిద్ధాంతమును, బౌద్ధచిహ్నము లేపాటియుఁ గనఁబడని మిగిలిన యారామములన్నిటికి నతికింపఁ

బడినది. కొన్ని ప్రసిద్ధక్షేత్రములలోనుండెడి శివశక్తిమూర్తులు విష్ణుమూర్తులుగా మాఱినట్లుగా వార్తలు దేశమందంతటను వ్యాప్తిలోనుండుట దీని కుపోద్బలకమైనది. కాని యిట్లూహించి సిద్ధాంతీకరించుట భావ్యముకాదని నా మనవి.

ఈనాఁడు ప్రాచీనచరిత్రమును నిర్మింపఁబూనువారికి పౌరాణికవచనములకంటె, వెనుకటికాలమునందుండెడి తామ్రశిలాశాసనవాక్యములు పరమప్రమాణములు. శాసనములు తెలిపెడి విషయములు, సారస్వత ప్రతిపాదిత విషయములు ఏకవాక్యతకు వచ్చిననాఁడు చేయు నిర్ణయము నిజమైనసిద్ధాంతమగుటలో నెవ్వరికి మతభేదముండఁబోదు. ఆ పద్ధతిని పంచారామములనుగూర్చి వెనుకటిశాసనములలోఁ దెలిపియున్నవిషయమును వివరించి యాతరువాత భీమేశ్వరపురాణవాక్యము లెట్లు సమన్వితములగునో ? నాయూహాపోహమునంతకుఁ దెలిపెదను. దక్షారామాత్యసోముఁడు శా. స. ౧౦౬౮ క్రీ శ. 1146 లో బెజవాడలోను, శా. స. ౧౦౭౧ క్రీ. శ. 1149 లో రాజమహేంద్రవరమునందును దానుచేసిన దానములకు పద్యశాసనములను శిలాస్తంభముల మీఁద నెలకొల్పెను. ఆ రెండు పద్యములను వివరించెదను.

భీమాపురము దాక్షారామ[ము] నూఁడాలు
గుడిపూఁడి యుంబాలుకొలను వీర
భద్రేశ్వరంబున భాపట్లునం దాంబ్రి
పురిం బి[ద]పురమునంబరఁగుదూబ
ఘంటశాలాపురిం గౌతమంబుననునే
లీశ్వరంబునను వేగీశ్వరమున
విజయవాటికనుండ విల్లిసివేలు పూరం
గరమొప్ప గొంటూరం గడలిపల్లి

కనకవలయములును ఘనలోహ వరదండ
ములు నఖండదీపములునుం బెట్టి
మ [ర] లం బెక్కు గుడ్లుం జెఱువులు గొంటూర
నిలిపె మం [త్రి] మ [తి] ంఘు భుజుండు.
భీమాపురము డాక రేమివాల్కొలను [దా్ర, క్ష]
చ్చారామపురి శ్రీమదమరడాలు
య [న] ను నంధ్రధరణి పంచారామములు మహా
దేవరలకు బుద్ధదేవరకుం
జేంబ్రోల నమ్మహాసేనునకునుం బిద
పురము హుంకారశంకరికిం గరము
రూఢికెక్కిన బెజవాడ మల్లేశ్వర
దేవరకు నఖండ దీపతతులు
వెట్టి గొంటూరం జెఱ్వులుం బెక్కుగుడ్లు
నిల్పి సప్తసంతతు లసంఖ్యముగంజేసె
దత్తెనామాత్యసోముండు ధర్మపరుం డు
దారభానుజుం డాచంద్రతారకముగ.

ఈ రెండు పద్యములు కీ. శే. జయంతి రామయ్యగారు సంకలనముచేసిన శాసనపద్యమంజరిలో ప్రకటితములై యున్నవి. ఇవి దక్షిణహిందుస్థాన శాసనసంపుటములందును ముద్రితములై యున్నవి. కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఈ రెండు శాసనములను మరలం జదివి ప్రతివ్రాసి 1952 సం॥లో వీనిని వివరింపుమని నాకుం బంపినారు. ఈ రెండుపద్యములలోను పంచారామములు పరమశివక్షేత్రములుగా నిరూపింపంబడియున్నవి. రెండవ పద్యములో పంచారామము లందలి మహాదేవరలకంటె బుద్ధదేవరను వేఱుగం బేర్కొనుటచేతను, తరువాత మరల శివక్షేత్రములనే నిరూపించుటచేతను పంచారామములు శివ

క్షేత్రములనుట స్పష్టము. ఈ రెండు పద్యములందును ప్రారంభములోఁ దెలిపిన పంచారామములు నొక్కటియే యనుటలో విప్రతిపత్తి యేమాత్రమును లేదు. వానిలో మొదటిది.

1. భీమాపురము—నేఁటి సామలకోట భీమవరము. దీనికి కుమారారామమనియు, స్కందారామమనియు, భీమవరము, చాళుక్య భీమవరము, చాళుక్య భీమాపురము అను నామములుండినట్లు, అచటి చాళుక్య భీమేశ్వరాలయమందున్న శాసనములనుబట్టి తెలియవచ్చు చున్నది. భీమాపురము భీమవరమనుకొని, అది పశ్చిమగోదావరిజిల్లాలో ప్రసిద్ధముగానుండిన గుణుపూఁడిభీమవరమని చాలమంది భావించుచున్నారు. ఆ భావన సరిగాదని నామనవి. కుమారస్వామిచేఁ బ్రతిష్ఠితుఁడైన భీమేశ్వరుడుండినకారణమున నది కుమారారామమైనది. చాళుక్యభీమున కది రాజధానియగుటచే భీమవరమైనది. చాళుక్యభీమున కాదేవుఁ డిష్టదేవతయగుటచే, నాలయప్రాకారాదులను నిర్మింపఁ జేయుటచే, నాయీశ్వరునకు చాళుక్య భీమేశ్వరుఁడను పేరు తరువాత వచ్చినది.

2. డాకరేమి—దాక్షారామము. దక్షారామ భీమేశ్వరాలయములోని శాసనములు 380 కి పైఁబడియున్నవి. వానిలో సంస్కృతపదముగా వాడినపుడు దక్షారామము లేక దాక్షారామము అను రూపములు గానవచ్చుచున్నవి. చాళుక్యచోళులకు సంబంధించిన శాసనములలో 'పెద్ద డాకరేమి, పెద్ద డెకరేమి, డాకరేమి' యను రూపములు గానవచ్చుచున్నవి. రాజరాజనరేంద్రుని తరువాత వేంగీదేశపాలకులుగా వచ్చిన చోళులశాసనములందే తొలుతగా నీపదము గానవచ్చుటచే నిది తమిళభాషనుండి కొనిరాఁబడినట్లే కనఁబడు చున్నది. తరువాత నిది యీసోముని శాసనములలోఁ బొడసూపు చున్నది. ఇది యిట్లుండ, డాకరేమి పదము ప్రాకృతమనియు, బౌద్ధ

వాఙ్మయము ప్రాకృతమయమనియు, ఆపదము దశారామమున కుప
యోగించుటచే తొలుత నిది బౌద్ధసంఘారామమేయైయుండి, తరువాత
దాక్షారామమైనట్లులు కొందరు ఊహించియున్నారు. అమరావతిలోఁ
గాక, మిగిలిన నాలుగారామముల పరిసరములందు బౌద్ధచిహ్నము
లేపాటియుఁ గానరాకుండుటచే నిట్టి యూహకూడ సరిపడదనిదే
నా మనవి.

3. అమూడాలు—అమరడాలు అని చదువుకొనవలెను. అమ
రడాలు అనఁగా నేఁటి అమరావతియను పేర వ్యవహరింపఁబడు అమరా
రామము. అమరారామము, ధాన్యవాటి. ధాన్యకటకము, ధరణికోట
ధరణకోట అను నీపదములు సమానార్థకములుగా అమరేశ్వరాలయ
మునందలి శాసనములలో వ్యవహరింపఁబడినవి. కృష్ణవేణీనదీతీరమున
ధాన్యకటకపురిని అమరేశ్వరునిచేఁ బ్రతిష్ఠితుఁడైన యీశ్వరుఁడు అమ
రేశ్వరుఁడు. అతఁడు నెలకొనినచోటగుటచే అమరారామమై క్రమ
ముగ అమరడాలై తరువాత అమరావతియైనట్లు కనఁబడుచున్నది.
ధాన్యవాటియే అమరావతియైనదనుటకు- "శ్రీమతు వేమసంగారు
శకవర్షంబులు ౧౧౮౩ అగు ప్లవ సంవత్సర శ్రావణ బ ౫ గు...పం
చారామంబులకుఁ బ్రథమారామంబైన అమరారామంబను ధాన్య
వాటిపురంబునకు అధీశ్వరుండైన అమరేశ్వర శ్రీమన్మహాదేవరకు"
అను అమరేశ్వరాలయశాసనమే నిదర్శనము. అక్కడి మఱికొన్ని
శాసనములలో ధాన్యవాటి నమ్రుతేశు...దన్నలకోట అమరేశలింగ
మున్.. ధాన్యకటకపురవరాధీశ్వర, అమరేశ్వర మహాదేవర...ఇత్యా
దిగాఁ గానవచ్చుటచే నవియన్నియుఁ బర్యాయపదములే యనుట నిశ్చ
యము. కృష్ణవేణీనదీతీరమున శ్రీశైల మల్లికార్జునస్వామి తరువాత
నంతటి ప్రసిద్ధశివక్షేత్రము ధాన్యకటకవాసియైన యమరేశ్వరలింగమే
యనుట నిశ్చయము.

4. పాలుకొలను—అనఁగా పశ్చిమగోదావరిజిల్లాలో నేఁడు పాలకొల్లు అని వ్యవహరింపఁబడు గ్రామము. దీనికి సంస్కృతమున క్షీరారామమని పేరు. ఈ క్షీరారామరామేశ్వరుని యాలయమున వెలసియున్న శాసనములు పెక్కింటిలో 'పాలుకొలని క్షీరారామేశ్వర (శ్రీ) మహాదేవరకు' అని గలదు. ఇచటిలింగము పీఠముమీఁద రెండఙుగుల యెత్తుమాత్రముండును. ఇచట బౌద్ధచిహ్నము లేవాటియుఁ గానరావు.

5. గుణిపూఁడి—నేఁటి పశ్చిమగోదావరిజిల్లాలోని భీమవరము నంటియున్న గుణుపూఁడి యని వ్యవహరింపఁబడుగ్రామము. దీనినే రెండవశాసనములో [ద్రా] [ద] చ్యారామపురి-అని నాఁడు. ద్రాచ్యారామపురి యనఁగా ద్రాక్షారామమని చరిత్రకారులు సూచించినారు. అది సరిపడదని నామనవి. ఇచటి యీశ్వరలింగము సోమేశ్వరలింగము. పీఠముమీఁద రెండఙుగుల యెత్తుగలిగి, ఫాలనేత్రముతోఁ గూడి, శుద్ధస్ఫటిక వర్ణముగలిగిన లింగము. ఆలయమునకుబైట చిన్న ఱాతి స్తంభముమీఁద నంది యున్నది. దీనికి సోమారామమని ప్రాచీనకాలమునందలి వ్యవహారము. కుమారారామమునందును ఆలయముబైట పెద్ద ఱాతిస్తంభముమీఁద నంది యున్నది. కనుక సోమేశ్వరాలయము దగ్గఱనే నందిపగ్రహమున్న శిలాస్తంభముండుటచే సోమారామమిది యే యనుట నిశ్చయము. చాళుక్యభీముఁడు తనపేర ప్రతిష్ఠించిన భీమేశ్వరలింగముండుటచే గుణుపూఁడిని జేరియున్న గ్రామమునకు భీమవరము అను పే రేర్పడినది. రెండేండ్లక్రిందట హిందూపత్రికలో సోమారామము 'కోటిపల్లి' అని నిర్దేశింపఁబడినది. ఈసోమారామమే దత్తినసోమునిచే పట్టినశాసనములో ద్రాచ్యారామమని పేర్కొనఁబడినది. దీనిలో నెగారు. కాటయవేముని అన్నయమాపురదానశాసనములోఁ గూడ నిది ద్రాచ్యారామమనియే వ్యవహృతమైనది. ఆ శ్లోకమిది.

శ్లో. తత్ర దాక్షామరక్షీర కుమార ద్రాక్ష్య పూర్వకాః
పఞ్చారామాః ప్రకాశన్తే క్రీడాస్థానాని ధూర్జటేః.

త్రిలింగ దేశములో—దాక్ష అమర క్షీర కుమార ద్రాక్ష్య అను పదములుపూర్వమందున్న ఆరామములు, పరమశివునకువిహారస్థానములై వెలయుచున్నవని యీ శ్లోకభావము. ద్రాక్ష్యారామమనఁగా దక్షిణ దిక్కునందుండెడి యారామమని యనుకొనవలయుననిపించుచున్నది. ఈ ద్రాక్ష్యశబ్దము గుణుపూఁడికి బదులుగ వాడఁబడినది. ఈ యర్థమును గ్రహించుటకు భీమేశ్వరపురాణమునందలి యీక్రిందివాక్యము లుపోద్బలకములు. త్రిపురాసుర సంహారానంతరము పరమశివుఁడు పంచారామములను వెలయించిన క్రమమును దెలిపిన ప్రకరణములోని దీ గద్యము.

"అనంతరంబా యంబికావల్లభుండు . . . కృతకృత్యుండై త్రిపుర దైతేయుల కులదైవతంబైన యద్దివ్యలింగంబును పంచబ్రహ్మ పంచాక్షరీ తంచతత్త్వ పంచభూతమయంబగుటంజేసి, పంచఖండంబులుగా ఖండించి, కృష్ణవేణీ మహానదీతీరంబున ధరణాలకోటయను గ్రామంబున నమరేశ్వరునిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి యమరలింగంబునాఁ బ్రసిద్ధంబైన యమరారామంబును, గౌతమీతీరంబున దక్షిణకూలంబున గుణపూఁడియను గ్రామంబున సోమునిచేతఁ బ్రతిష్ఠితంబగుటంజేసి సోమలింగంబనఁ బ్రఖ్యాతంబైన సోమారామంబును, బాలకొలనను గ్రామంబున శ్రీరామచంద్రునిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి రామలింగంబునాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబును, జాళుక్యవంశరాజధానిధానియగు చాళుక్యభీమవరనామక గ్రామంబునఁ గుమారరత్నంబైన కుమారస్వామిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి కుమారభీమలింగంబనఁ బ్రఖ్యాతినొందిన భీమారామంబును, మొదలిమామయగు దక్షప్రజాపతియునికిపట్టైన యారామంబగుట దాక్షారామంబున శివసన్నిధా

నంబై తానుండుసట్టుగా నీప్రకారంబున భోగమోక్షప్రదంబులైన పంచారామంబులఁ బ్రతిష్ఠనొందించి, తానును మున్నీటితటంబున విశుద్ధస్ఫటికసంకాశంబును దిగ్దశలోకభామినీ విలోకనచ్ఛాయా గుళుచ్ఛాచ్ఛ జ్యోత్స్నాభిషేక యుక్తాంగంబగు భీమేశ్వరలింగంబునం దధివసించె.''

భీమ. 4 అశ్వాసము.

సమకాలికమైన చారిత్రకాంశముల కేపాటియు విరోధము లేకుండ పౌరాణికవిషయములను పరమసత్యములుగా నిరూపించు శ్రీనాథుఁడు కూర్చిపెట్టిన గద్యమిది. ఈవాక్యమునుబట్టి పంచారామములకు ప్రాచీనకాలమునందుండెడి నామములు తెలియుటయేగాక, వాని కా యా నామములెట్లు వచ్చినవో స్పష్టమగుచున్నది. పంచారామములు పరమశివక్షేత్రములే యనుట దీనిచే స్పష్టము చేయఁబడినది. అఖండగౌతమీప్రవాహాయుతమైన రాజమహేంద్రవరమునకు,గోస్తనీ నదీతీరస్థమైన గుణపూఁడి దక్షిణదిశయందుండుటచే నది ద్రాక్షారామ మని యూహించుటకు వలనుపడుననిపించుచున్నది. గుణపూఁడి సోమారామమని స్పష్టముగఁ దెలిపినవాఁ డాతఁడొక్కఁడే. కుమారారామమునందలి భీమేశ్వరలింగమునకు చాళుక్య భీమేశ్వరుఁడను వ్యవహార మెట్లేర్పడెనో ? ఆవిషయమునుగూడ స్పష్టపఱచినాఁడు. దాక్షారామము పరమశివునకు ప్రధాననిలయమగుటకుఁ గారణమును తెల్లము చేసినాఁడు. శాతకాహనచక్రవర్తియగు హాలుఁడు సింహళకన్యయగు లీలావతిని దక్షారామ భీమేశ్వరసన్నిధిని వివాహము చేసికొనినట్లు, 'లీలావఈ కహా' అను ప్రాకృతకావ్యము తెలుపుచున్నది. కావున పంచారామములు పరమశివక్షేత్రములేగాని బౌద్ధసంఘారామము లెటును కాఁజాలవని నా మనవి.

భారతీయాగమసంప్రదాయములకు సరిపడునట్లు, చారిత్రకాధారములతో ప్రాచీనదేవాలయాది చరిత్రమునూహించుట భావ్యముగాని, 15 వ శతాబ్దిలోఁగాని త్రిలింగదేశములోఁ దలయెత్తిన మతవిద్వేషములను, తత్ప్రేరితమైన విధ్వంసములను వెనుకటికాలమునకుసైత మంటఁగట్టి, పురాణములన్నియుఁ బుక్కిటిపురాణములని, ప్రాచీన భారతీయసంస్కృతిని, ఆగమవిజ్ఞానమును సరిగా నెఱుఁగనీయని చారిత్రకసిద్ధాంతములన విచారితముగ నామోదించుటగాని, తదనుగుణముగ మన రచనలను మలచుటగాని న్యాయ్యముగాదని సవినయముగ నివేదించువాఁడ.

సా:

## గ్రంథ స్వీకారము సమీక్ష

**శ్రీ బండారు తమ్మయ్య,**

**(11) నీవు, నేను- క్రొనుపుటలు 58+12**

**గ్రంథకర్త:- శ్రీ గోటేటి సత్యనారాయణమూర్తిగారు.**

**(District Prohibition Officer Kakinada)**

ఇది రచయిత యప్పుడప్పుడు భగవద్భక్త్యుద్బోధకములుగ రచించిన ఖండకృతుల సంపుటి. నీవు (భగవంతుఁడు) నేను (జీవాత్మ రూపకుఁడు-కృతికర్త). భక్త్యావేదనలతో జీవుఁడు భగవంతునియెడఁ గావించు నివేదనములే యిందు మంగళాచరణము. ప్రాతరుద్బోధము, ప్రాంజలి, ప్రార్థన, ప్రియతముఁడు, దైవబలము, చిత్తశుద్ధి, సత్సాంగత్యము, తృప్తి, ఛాయాదేవత, స్థితప్రజ్ఞుఁడు, చింతనము, ఆత్మబోధ, విన్నపము, సమర్పణము, అను 15 శీర్షికలతో నీ కావ్యరూపమును దాల్చినవి. వీనిలోఁ గొన్ని కేవల మీశ్వరస్తుతులుగాక పౌరాణిక చారిత్రికములగు కథలతోఁ గల్పితమయియున్నవి. అంతటను భగవన్మహిమమును మాత్ర మంతర్వాహినిగా నుండును. కవిగారు పోలీసు శాఖలో నున్నతోద్యోగమున నుండియు నిట్టి యమూల్యకృతిని లోకమున కర్పించుట వారి సుకృతవిశేషము. కవితాశైలి గాంగఝరివలె ధారాళమై పావనతరమై, యలరారుచున్నది. హృదయంగమమయిన యీ చిన్ని ఖండకృతి యందఱు తప్పక యాదరింపఁదగియున్నది. కవివర్యులు శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారు (ప్రొద్దుటూరు) మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రీగారు (నంద్యాల) రచయిత నభినందించుచు పద్యాత్మకముగ వెలువరించిన ప్రశంసలు "ఒకమాట" అను పేరితోఁ గవిగారియొద్ద పోలీసుశాఖలోనే గుమాస్తాగాఁబనిచేయు చుండిన సారస్వతపిపాసి, శ్రీ గొల్లాపిన్ని రామకృష్ణశాస్త్రి (నంద్యాల) ప్రకటించిన సమీక్ష కృతి కలంకారములుగ నున్నవి. ఇట్టి యుత్తమ కృతినిరచించి లోకమునకు నిస్స్వార్థముగ నందించిన కవిగారి నెంతయు నభినందించుచున్నాము.

ఱు

మచ్చునకుఁ గొన్ని పద్యములు:-

(1) ఆతని మేలుచాటునటు లల్లనెపుల్గులు గెల్లుసెల్లసం
త్రాతకు సర్వమంగళవిధాతకు జే యనిపాడుఁ దియ్యనన్.
గౌతుకమొప్పఁ బ్రాక్సతిమొగంబునఁ గుంకుమ
దీర్చియద్భుతం
బైతగఁబట్టుచున్నదదె యారతిబంగరుపళ్లెరంబునన్
(ప్రాతరుద్బోధమునుండి)

(2) పరహితమొందు దక్కఁదనభావమునం దితరార్థకల్పనా
స్ఫురణయె లేని యానియతబుద్ధికిఁదోఁచుని తాంతభక్తిత,
త్పరుఁడయి పామరత్వ మెడఁబాపఁగడంగిన రామదాసు శ్రీ
చరణమునంటి భిక్షనిడిసత్కృతిఁజేసెడు వాంఛయొక్కఁడున్,
(చిత్తశుద్ధినుండి)

(3) అనవిని, యాజ్ఞవల్క్యముని యానతిఁగైకొని, తేరిపై
రయం,
బునఁజని రాజుగాంచెఁ దనముంగల దారుణమారణాగ్నికిం
ధనమయిరాజధాని మసనంబగుచుండుటఁ గాందిశీకులై
తనప్రజతల్లడిల్లుచును దల్లికిఁబిల్లకుఁ దప్పుచుంటయున్
(స్థితప్రజ్ఞుఁడునుండి)

(12) గంగాలహరి:- క్రొనుపుటలు 62 వెల రు 1-0-0

కర్త : రామచంద్రకౌండిన్యయను సాంకేతిక నామాంకితులగు డాక్టరు ఓరుగంటి రామచంద్రయ్యగారు, చరిత్రోపన్యాసకులు, ఆంధ్ర విశ్వ విద్యాలయము వాల్తేరు.

మిత్రులు శ్రీరామచంద్రయ్యగారు ఆఙ్గ్లమున నున్నశపట్టభద్రులయ్యు వంశానుగతముగ వైదికవిద్యా సంపదకు, భగవద్భక్తికి నిధానమయిన యుత్తమ విప్రకుటుంబమునకుఁ జెందినవారవుట మొద

టనుండియు నాధ్యాత్మిక సౌరభముఁబిసాళించు నుత్తమగ్రంథము లరచించుటకే యలవడిన భావుకులు. శ్రీ రమణమహర్షి యాశ్రమములోఁ గొంతకాలము తత్సన్నిధానముననుండి మహర్షి యాశీర్వాదమును బడసిన ధన్యజీవనులు. వీరి కృతులు రమణ స్మరణ, రమణలహరి, తెనుఁగు మీరా మున్నగునవి యింతకుమున్నే యీ పత్రికయందు సమీక్షగావింపఁబడి యున్నవి. వానివలననే వీరి యాధ్యాత్మిక తత్త్వము పాఠకులకుఁ గొంత కొంత గోచరమయి యుండును. ఏవంగుణ విశిష్టులగు వీరు నేఁడు పండితరాయల గంగాలహరి ననువదించి తమ వాణిని బునీతమొనరించుట ముదావహము. ఇందు మూల శ్లోకములుకూడ వీరి యనువాద పద్యముల కెదురుగా నొకవైపున ముద్రింపఁబడి యుండుట ప్రశంసనీయము. పాఠకుల కిది యెంతయు నుపయోగకరము. పండిత రాయలు మూలకృతిని జాలవఱకు మహిమ్న స్తోత్ర, శివానందలహరుల మార్గముననుసరించి శిఖరిణీవృత్తములలో రచించియుండ శ్రీ రామచంద్రయ్యగారు తమ యనువాదమునా మూలాగ్రముననుత్తమంబగు సంగ్రహీకరణప్రౌఢితోఁ జిన్న తేటగీతులందమును నాటవెలఁదులందును రచించుట వారి యసాధారణప్రతిభకాదర్శకముగ నున్నది. ఆధునికులు పలువురు గంగాలహరి కిదివఱకే వారి వారియనువాదములు ప్రకటించి యున్నారు. అవి చాలవఱకు మార్గకవితలో సంస్కృత వృత్తములలోఁ గూర్పఁబడినవి. నెల్లూరు మండలము వారగుట శ్రీ రామచంద్రయ్యగారు సహజమయిన తెలుంగుఁదనము గుబాళింప నీకృతిని హృదయంగమములగు దేశిచ్ఛందములలో సహృదయ హృదయాకర్షకముగ రచించినందుకు వారి నెంతయు నభినందించుచున్నారము. పండితవర్యులు శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రి, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మ, విశ్వనాథ సత్యనారాయణగార లొసంగిన యమూల్యాభిప్రా

యములుగూడ నిందుఁ బ్రకటితములయి యీకృతి కెనలేని శోభ నాపాదించుచున్నవి, వామనుఁడు కావ్యగుణములలో నుదాహరించిన "ప్రౌఢి"పథములలో వాక్యార్థమును సంక్షేపించి చెప్పుటకీకృతి చక్కని నిదర్శనముగా నున్నది. మూలశ్లోకమందలి భావము నొకింతయుఁ బీరువోకుండఁ జిన్నగీతములలో నిమిడ్చి తీర్చిదిద్దిన యీకృతి సూక్ష్మములో మోక్షమను నుడికి దృష్టాంతమగుచున్నది. మచ్చునకు రెండు పద్యములు వాని మూలశ్లోకములతో నుదాహరించుచున్నాము.

శ్లో॥ శ్వవృత్తివ్యాసంగో నియతమథ మిథ్యాప్రలపనం
కుతర్కేష్వభ్యాసః సతతపరపైశున్యమశనమ్,
అపిశ్రావం శ్రావంమమతు పునరేవంగుణగణా
నృతే త్వత్కోనామక్షణమపి నిరీక్షేతవదనమ్.

గీ॥ వరపుడమ్మ, కల్ల పరపాపచింతన,
కపటవాదనిరతి కలుషగుణము
లిన్నివినుచువినుచు, ఈ మొగమ్మా ముద్దు
లెవరుచూతురమ్మ, యీవుదక్క. (ప 31)

శ్లో॥ నరాన్ముగ్ధాం స్తత్తజ్జనపద సమానక్రమనసో
హసంతఃసోల్లాసం వికచకుసుమవ్రాతమిషతః
పునానాః సౌరభ్యైః సతతమలినోనిత్యమ మలినాన్
సఖాయోనః సంతు త్రిదశతటినీతీర తరవః.

గీ॥ ఊరిపేర్ముడి విడిపోని మోఁటకులకు
విరియుపూవుల నవ్వుల వెక్కిరింత
కమ్మతావుల నళికోటికప్పు విప్పు
బోలయ నీతీరతరువులు చెలులు మాకు. (ప 43)

(3) శబ్దోత్పత్తిశతకము:—క్రౌనుపుటలు 20 వెల 0-50.

కర్త;—విద్వాన్ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు రిటైర్డు తెలుగుపండితులు, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

శ్రీ మల్లికార్జునకవిగారు పాఠశాలావిద్యార్థులయునుపాధ్యాయులయు నుపయోగమునకయి వ్యాకరణవిషయములకు సంబంధించిన పలురకముల శతకములు చిరకాలమునుండి రచించుచుండుట సర్వవిదితము తత్సమ, నానార్థ, వచన, లింగ, రూపాంతరశతకము లీగణములోనివే. శబ్దోత్పత్తులగూర్చి కొన్ని భాగములుగ శతకములు రచించుచు నింతకుమున్ను 2 భాగములు ప్రకటించియున్నారు. వానిసమీక్షయీపత్రిక పూర్వసంచికలలోఁ గావించియుంటిమి. ఇది మూఁడవభాగము. వెనుకటి భాగములవలెనే యిదికూడ విద్యార్థులకు నుపాధ్యాయులకుఁ బ్రయోజనకారి కాఁగలదు. కొందఱు పండితు లొసంగిన సదభిప్రాయము లీగ్రంథమందే మునుముందు ముద్రితములైనవి. కవిగారికృషి ప్రశంసనీయము.

మచ్చునకు మూఁడు పద్యములు.

బేహారముఁగలవానిని । బేహారియని చెప్పినారు వినుతకవీంద్రుల్
బేహారముగలవానిని। బేహారియను చునొడివిరి విద్వద్వర్యుల్. (ప41)
వాహంబునకరిగావున । వాహద్విషమని పలికిరి ప్రాజ్ఞవతంసుల్
వాహములుండెడికతమున। వాహినియని చెప్పినార పారమనీషుల్ (ప51)
విజయమునొందెడువానిని।విజయుండని చెప్పుచుంద్రు విద్వద్వర్యుల్
విజిగీషంగలవానిని।విజిగీషువనుచుఁ బలికిరి విశ్రుతవిబుధుల్ (ప52)

(4) ప్రపంచపారుఁడు: కర్త:—కవిరత్న, ఆంధ్రభాషావాచస్పతి, సహస్రావధాని, శ్రీరాం వీరబ్రహ్మకవిగారు, మచిలీపట్టణము.

ప్రకాశకులు:—కవిగారి శిష్యులు, విఘ్నేశ్వర గ్రంథమాలాస్థాపకులు, భారతీసమితి కార్యదర్శి శ్రీ విద్వాన్ కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు, పామఱ్ఱు, కృష్ణాజిల్లా. క్రౌను పుటలు 70+22 వెల 1-8-0.

ఇది నేఁడు భారతరాష్ట్రపతిగానున్న శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల చరిత్ర సంగ్రహరూపకముగ రమారమి 250 పద్యములతోఁ గూర్పఁబడిన పద్యకృతి-రాధాకృష్ణపండితులు మొట్టమొదటఁ జిన్నతనముననే కళాశాలావిద్యార్థులకుఁ దత్త్వశాస్త్రమును బోధించు నధ్యాపకవృత్తిలోఁ బ్రవేశించి క్రమక్రమముగాఁ దమయసాధరణ శేముషీవిశేషమువలనఁ బ్రాచ్యపాశ్చాత్య తత్త్వశాస్త్రముల నామూలాగ్రముగ నవగాహించి ప్రపంచమందలి వివిధ విశ్వవిద్యాలయములలో గంభీరములగు తాత్త్వికోపన్యాసములమూలమున విశ్వవిఖ్యాతి గడించిన యాంధ్రమాతృ పుత్రరత్నము. ప్రపంచమంతయుఁ బర్యటించి సమస్త వైజ్ఞానిక లోకముయొక్క ప్రశంసలకుఁ దావలమయిన యీ మహాపురుషుని జీవితచరిత్రమునకు "ప్రపంచపౌరుఁడు" అనునామ మెంతయు సమంజసముగానున్నది. వయోవృద్ధులయిన శ్రీరాం వీరబ్రహ్మకవిగారు దేశచరిత్రములను, సంస్థానచరిత్రములను, ప్రఖ్యాతపురుష చరిత్రములను సేకరించి ప్రజోపయోగకరముగ గ్రంథరూపమున సంతరించుటలో సిద్ధహస్తులు. అట్టివారు శ్రీ రాధాకృష్ణ పండితుని జీవితచరిత్రమునకు సంబంధించిన ప్రధానవిషయము లెన్నెన్నియో సేకరించి సూక్ష్మములో మోక్షమనురీతి విద్వత్సమ్మతముగ నిట్టి చరిత్ర సంగ్రహము ధారావాహికమయిన లలితమధురశైలిలో రచించి దానిని రాధాకృష్ణపండితుని యామోదముతో వారి కేయంకితమొసంగుట ముదావహము. పెద్దవయస్సులోఁ గూడ ధారణాశక్తి నించుకయుఁ గోల్పోవక సహస్రావధానాదికముల నవలీలగ నిర్వహించు ధీసంపన్నులు వీరబ్రహ్మకవిధీరులు దీని కర్తలగుట పసిఁడికిఁ బరిమళమబ్బినట్లుగ నున్నది. ఇందుకయి వారి నెంతయు నభినందించుచున్నారము. రాధాకృష్ణపండితులు భారతప్రభుత్వమువారి రాయబారిగా మాస్కోలోనున్న కాలమున వారు సోవియట్ విధానములవిషయ

మున గడించినయనుభవములను జక్కగా వివరించునిందలి "రష్యాను గురించిన స్వానుభవోపన్యాసము" అను భాగము ప్రత్యేక ప్రశంసార్హముగ నున్నది. గ్రంథము మునుముందు తొలిపలుకు మున్నగువానిలో పలువురిగ్రంథములపయి నొసంగిన యభిప్రాయము లవశ్యము సఠింపఁదగియున్నవి.

మచ్చునకుఁ గొన్ని పద్యములు.

శా. ఈయాంధ్రావనిఁ బుట్టినట్టి యతులోత్కృష్టోన్నత స్థానమి
ష్టే యాంధ్రుండయినన్ గడించెనె యయారే తత్త్వధీ శ్రీనుపా
ధ్యాయుండౌటనె కాదు నిస్తులిత రాధాకృష్ణ విద్వన్మహా
మేయప్రజ్ఞయె కారణంబగునుసుమీ శ్లాఘ్యము ఆలోచింపఁగన్.(ప128)

శా. తాశశ్వద్గుణ ధీరుఁడౌట మన రాధాకృష్ణ యార్యుండహో
లేశంబేని వచింప జంకొదవు నాంగ్లేయాధికారంబునన్
దేశంబెల్లను మ్రగ్గుచున్న తఱిసే దేశాభి మానాన్వితా
వేశంబొప్పు ప్రబోధలెన్నొ సలిపెన్ విద్యార్థి లోకంబునన్(ప 67)

గీ. ముని కుచేలుని యటుకులా మోదచిత్తుఁడగుచు శ్రీకృష్ణభగవాను
డందుకొనఁడె అటులెయీనాడు చిఱుకానుకనందికొనఁగఁ
బ్రార్థితులరు రాధాకృష్ణపండితేంద్ర. (ప 241)

శా. శ్రీగంగాలహరీసముద్గత వచశ్శ్రీ సాంద్ర! భవ్యాంధ్ర కాం
తా గర్భార్ణవ పూర్ణచంద్ర! విబుధోత్తంసస్తుతాం చత్సుధీం
ద్రా! గుప్తార్థ పరీతతత్త్వ విషయజ్ఞా! ధన్యమయ్యెన్ భవ
త్సాంగల్భ్యంబునఁ జేసి యాంధ్రికడు రాధాకృష్ణ విద్వన్మణీ.(ప247)

(5) సిద్ధాంతశిఖామణి:— డెమ్మీ. పుటలు 332)

మూలసంస్కృత శ్లోకకర్త:—శివయోగి శివాచార్యులు.

ఆంధ్రతాత్పర్య రచయిత:—శ్రీ శ్రీ యానందనామాపరనామకులు శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు, శ్రీకాకొళము.

ప్రకాశకులు:—సాధనగ్రంథమండలి, తెనాలి. వెల రు3-0-0 లు.

వీరశైవ మతవిషయక విజ్ఞాన ప్రధానములగు భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్య అను షట్స్థలములయొక్కయు, వానిలో సంతర్విభాగములు అంగస్థలములు 44 లింగస్థలములు 57 మొత్త మేకోత్తరశత-101 స్థలముల ధర్మములఁగూర్చి జగద్గురు రేణుకాచార్యుఁడు అగస్త్యమహర్షికి బోధించినట్లుగా రచితమయిన యుత్తమప్రామాణిక గ్రంథము సిద్ధాంతశిఖామణి; దీని కర్త శివయోగిశివాచార్యుఁడు, రేణుకాచార్య వంశపరంపరకు సంబంధించినవాఁడు. వీరశైవ పంచాచార్యులలోఁ బ్రథముఁడగు రేణుకాచార్యునికాలము నిదమిత్థముగ నిర్ణయించుట కష్టతరము. రేణుక నామధేయులు పలువురు వేర్వేఱుకాలములోనుండుట నీ జగద్గురుని కాలనిర్ణయము మఱింత క్లిష్టమగుచున్నది. నేఁడు మైసూరురాష్ట్రమున శృంగేరికి సమీపమున రంభాపురి (బాలెహొన్నూరు)లోఁ బ్రతిష్ఠితమయియున్న రేణుకుని (రేవణసిద్ధ)వీరసింహాసనమే యీప్రథమ వీరశైవ పంచాచార్యునికి సంబంధించినది. కృతికర్తశివయోగి శివాచార్యుఁ డెప్పటివాఁడో నిర్ణయించుటకూడ సుకరము కాదు. దుర్గమములగు షట్స్థల వైజ్ఞానిక విషయముల నీతఁడు హేలగా లీలగా సుగమమగు శైలిలో రచించియుండుట ప్రశంసనీయము. ఈగ్రంథశైలి వాల్మీకిరామాయణశైలితోఁ దులఁదూఁగుచున్నదని రసజ్ఞులు కీ. శే. గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు ప్రశంసించియున్నారు. ఈ గ్రంథము మొదట 1896 సంవత్సరప్రాంతమున ఏలూరులో తెలుఁగులిపిలో శైవ పంచకము అను సంపుటమునందుఁ బ్రకటితమైనది. అందు నిరువది పరిచ్ఛేదములు మాత్రమే యున్నవి. అటుతరువాత మైసూరులో పంచాచార్య పత్రికాధిపతులు తమ గ్రంథమాలలోఁ గన్నడలిపిలోఁ బ్రకటించియున్నారు. అందులో విభీషణుని ప్రార్థనముపయి రేణుకాచార్యుఁడు లంక కేఁగి యచట నవకోటి శివలింగముల నేకముహూర్తముననే తన

యాచార్యత్వమున స్థాపించినట్లుగా వర్ణించు నేకవింశతి పరిచ్ఛేద మధికముగాఁ గానవచ్చుచున్నది. ఇది ప్రక్షిప్తమని కొందఱు తలంచుచున్నారు. కాశీనాథశాస్త్రిగారి గ్రంథమునుబట్టియే తరువాత 1940 సంవత్సరములో దీని మూలశ్లోకములను తెలుఁగు దేవనాగరిలిపులలో శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు ప్రకటించినారు. ఈసూత్నము ద్రణములను, శ్రీ కాశీనాథశాస్త్రిగారి కన్నడగ్రంథము ననుసరించియే ఆంధ్రవివరణకర్తలు శ్రీ సత్యనారాయణశర్మగారు ప్రకృతగ్రంథమును రచించినట్లున్నది. వీరు సరసకవితాశక్తిసంపన్నులు-దేవ్యుపాసకులు-ఇటీవలఁ దురీయాశ్రమస్వీకార మొనర్చినవారు. ఇట్టి గుణగణవిశిష్టులీ యాంధ్రవివరణమును గూర్చుట ముదావహము. మూలగ్రంథము, శర్మగారి యాంధ్రవివరణముతోపాటు, మొదటి 21 పుటలలోను ముద్రితమయినవారిమున్నడియు, కన్నడలిపిలో శ్రీ కాశీనాథ శాస్త్రిగారు ప్రకటించిన సిద్ధాంతశిఖామణియందలి యవతారికకు శ్రీ శర్మగారి యనువాదముగూడఁ దప్పక సావధానముగఁ బఠింపఁదగినవని మనవిచేయుచున్నాము.

వివిధమతధార్మికగ్రంథములఁ బ్రకటించుచున్న తెనాలి సాధన గ్రంథమండలివా రీవీరశైవమత గ్రంథమునుగూడఁ బ్రకటించుట ప్రశంసనీయము. కృతికర్త శివయోగి శివాచార్యుఁడు గ్రంథప్రకాశకులు తలంచినట్టులంత ప్రాచీనుఁడయి యుండఁడనియుఁ బదునాల్గవ శతాబ్దియందుఁగాకతీయ రెండవప్రతాపరుద్రనికాలముననున్న శివదేవయ్యయే యీశివయోగియై యుండుననియు భారతిపత్రికలో నీ గ్రంథముపయి సమీక్షను బ్రకటించిన శ్రీ జగన్నాధశర్మగారు వ్రాసియున్నారు. కాని యిది సరికాదని మాయభిప్రాయము. శివదేవయ్యయు నాతని యగ్రజుఁడు విశ్వేశ్వరశివదేశికుఁడు (గణపతి దేవచక్రవర్తి దీక్షాగురువు) పాశుపతశైవమునకుఁజెందిన గోళకీ మఠసంప్రదాయమునకు సంబంధించినవారు. దశవిధశైవములలో నైదవదియగు శ్రౌత శైవ మతావలంబకులేగాని కేవల వీరశైవులుగారు. శివదేవయ్యపేర వెల

సిన యొకయాంధ్రశతకములోని మకుటము "శివదేవధీమణీ" యనియే యున్నది. తుమ్మలపల్లి నాగభూషణకవి రచించిన "బసవవిజయము" అను గ్రంథమునఁ బ్రతాపరుద్రునకు శివదేవయ్య బసవేశ్వరుని చరిత్ర మును జెప్పినట్లున్నది. కావున నతఁడు బసవనికిఁ (క్రీ.శ. 1126-1168) దరువాతి వాఁడనుట విస్పష్టము. సిద్ధాంతశిఖామణి శ్లోకములు బస వేశ్వరునికిఁ బూర్వులయిన శ్రీకంఠశివాచార్యుఁడు, శ్రీపతి పండితా రాధ్యుఁడు తమ బ్రహ్మసూత్ర భాష్యములలో నుదాహరించి యుండుటచే శివయోగి వారికిఁ జాలఁ బూర్వుఁడయి యుండుననుట నిర్వివాదము. కావునఁ బదునాల్గవ శతాబ్దిలోని శివదేవయ్య యాతఁ డనుట యసంగతమని చెప్పనక్కఱలేదు మచ్చునకుఁ గొన్ని మూల శ్లోకములను వానికి సత్యనారాయణశర్మగారి యాంధ్రవివరణములను నుదాహరించుచున్నాము. ఏతాదృశ మతగ్రంథములఁ బ్రకటించు సాధనగ్రంథమండలివారిపరిశ్రమ యాంధ్రలోకమునకెల్ల నాదరణీయ మని మనవిచేయుచున్నాము.

10 వ పరిచ్ఛేదము:—19. శివాద్వైత నిరసనస్థలము నుండి,

పూజ్య పూజయోర్లింగ జీవయోర్భేద వర్జనే 37
పూజాకర్మాద్యసంపత్తేర్లింగనిష్ఠా విరోధకః.
సర్వాద్వైత విచారస్య జ్ఞానాభావో వ్యవస్థితః
భవేన్మాహేశ్వరః కర్మీ సర్వాద్వైత నిరాసకః. 38

వివరణము:—పూజింపబడు శివలింగమునకును పూజించు భక్తు నకును భేదము లేదన్నచో లింగనిష్ఠకు విరోధముగాన పూజాకర్మ ములకు స్వరూపనిష్పత్తి లేనందువలనను, సమస్తమైన యద్వైతప్రకా రముయొక్క జ్ఞానమునకు లేమియే స్థిరపడుచున్నది. అందుచే శివలింగ పూజాదికర్మములనుచేయు మాహేశ్వరుఁడు సర్వాద్వైతము.... నిర సించువాఁడు కావలయు. "క్రియాద్వైతం నకర్తవ్యం" అనెడి... ణమువలన క్రియయందద్వైతము చేయరాదని తాత్పర్యము.

19 వ పరిచ్ఛేదము:—45 మహాకాశస్థలము.

పిండాండస్థం యథాకాశం నభిన్నం తద్వదాత్మనం
అభిన్నః పరమాత్మేతి మహాకాశస్థలం విదుః.

వివరణము: బ్రహ్మాండమందును పిండాండమందును ఉన్న ఆకాశ మెట్లు భిన్నముగా లేదో అటులే శివయోగియొక్క ఆత్మకంటె పర మాత్మవేఱుగా లేదు. శివయోగి ఆత్మ, పరమాత్మ అను నీయిరువురును ఒకటే అను అభేదమునే జ్ఞానులు మహాకాశస్థలమందురు.

(6) శంకరగ్రంథ రత్నావళీ:—ఉపదేశగ్రంథములు నలువది. ప్రథమసంపుటము అనువాదకులు శ్రీ నిర్వికల్పానందస్వామి,

ద్వితీయముద్రణము:—పుటలు 296 వెల రు 4-0-0.

ప్రకాశకులు:—సాధనగ్రంథమండలి, తెనాలి.

అద్వైతమతాచార్యులగు శ్రీ ఆదిశంకరులు రచించిన మతగ్రంథములనన్నిటిని గ్రంథముగాఁ దెలుఁగువివరణములతోఁ బ్రకటించు మహోద్యమము నాలంబించి శ్రీ సాధనగ్రంథమండలి వారందు ప్రథమసంపుటముగాఁ బ్రకటించిన యుత్తమగ్రంథమిది. అద్వైతానుభూతి, అనాత్మ శ్రీవిగర్హణప్రకరణము, ఆత్మషట్కము మున్నగు కేవల వేదాంతబోధక గ్రంథములు నలువది యీసంపుటమున సంకలితము లైనవి. శివానందలహరి, సౌందర్యలహరి మున్నగు స్తోత్రగ్రంథము లేవియు నిందుఁ జేరలేదు. అట్టివిగూడఁ దరువాతి సంపుటములలోఁ బ్రకటితములు కావచ్చునని యాశింతుము. ఆంధ్రవివరణమును రచించిన శ్రీ నిర్వికల్పానందస్వాములువారు సుప్రసిద్ధులు. శ్రీరామకృష్ణ మఠమునకు జేరిన మహాపరిచారకస్వామికోటిలోనివారు. జన్మతః ఆంధ్రులు ఆంధ్రులకు సులభముగ గ్రాహ్యమగు శైలిలో మతవిషయకవ్యాసము సంములు పత్రికలలోఁ బ్రకటించిన పండితవర్యులు. వీరే రచించిన భారతీయతత్త్వశాస్త్రము ప్రథమభాగము. షడ్దర్శనములు వేదాంత

సూత్రభాష్యము సంప్రదాయములు. (క్రౌనుపుటలు 192 వెల రు2-0-0) అను గ్రంథ మింతకుముందే యీసాధన గ్రంథమండలియందే ప్రకటిత మయి విశేషవ్యాప్తిని, జనాదరణమును గాంచియున్నది. ప్రకృతగ్రంథముకూడ నట్లే యాంధ్రసోదరుల యాదరణాభిమానములఁ జూఱ గొనఁగాకయని యభిలషించుచున్నాము. శంకర గ్రంథములన్నియు శ్రీ నిర్వికల్పానందస్వాముల యాంధ్రవివరణములతో ప్రకటిత మయినచోనది యాంధ్రలోకమునకు మహోపకృతి కాఁగలదు. సాధన గ్రంథమండలి విశేషకృషితో దానిని నిర్వహించి చరితార్థత నొందుఁ గావుతమని హెచ్చరించుచున్నాము.

మచ్చునకుఁ గొన్ని మూలశ్లోకములను, వాని యాంధ్రవివరణములను నీ దిగువ నుదాహరించుచున్నాము.

(1) అద్వైతానుభూతినుండి-

శివ ఏవ సదాజీవో జీవ ఏవ సదాశివః
వేత్త్యైక్యమనయోర్యస్తు స ఆత్మజ్ఞోనచేతరః॥
క్షీరయోగాద్ యథా నీరం క్షీరవద్ దృశ్యతేమృషా
ఆత్మయోగాద నాత్మాయ మాత్మవద్దృశ్యతే తథా॥

వి॥ ఎల్లకాలముల శివుఁడే జీవుడు, జీవుఁడే శివుఁడు, ఈ యుభయులయైక్యము నెఱిఁగినవాడే ఆత్మజ్ఞుఁడు-ఇతరులుకారు. నిక్కము కాకుండినను నీరు పాలతోఁగలిసి పాలవలె గోచరించునట్లు అనాత్మ రూపమగు ఈజగత్తు ఆత్మతోఁగలిసి ఆత్మవలెఁ దోఁచుచున్నది.

(30) యోగతారావలినుండి-

చిత్తేంద్రియాణాంచిర నిగ్రహేణ।శ్వాసప్రణాశే శమితే యమీంద్రాః
నివాతదీపా ఇతి నిశ్చలాంగా। మనోన్మనీ మగ్నధియో భవంతి.

వి॥ చిత్తమును, ఇంద్రియములును మరిచలింపకుండునట్లు నిగ్రహింపఁబడినప్పుడు, శ్వాసక్రియ నిరోధింపఁబడినప్పుడు గాలిలేనిచోట నుంచఁబడిన దీపమువలె శరీరాంగములు కంపింపకుండునప్పుడు యోగులు ఈమనోన్మనీ (మనోలయ)స్థితియందునిమగ్నచిత్తులగుదురు.

# వ్యక్తి వివేకము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

ఉదా : "నిర్ఘాతోగ్రైః కుంజలీనాన్ జిఘాంసుః
జ్యానిర్ఘోషైః క్షోభయామాస సింహాన్
నూనం తేషా మభ్యసూయా పరో౽సౌ
వీర్యోదగ్రే రాజశబ్దే మృగాణామ్"

అర్థము:—పొదలలోఁ దాగుకొనిన సింహములను చంపనెంచి పిడుగువలె భయంకరములగు నారిమ్రోఁతలచే వానిని క్షోభింపఁ జేసెను. ఆమృగములయొక్క, వీర్యోదగ్రమైన, రాజశబ్దమునందు (వీర్యోదగ్రమైన, ఆమృగములయొక్క రాజశబ్దమునందు) ఆతని కసూయయున్నదనుట నిశ్చయము.

ఇచట సింహములకు, రాజశబ్దవాచ్యత్వము లేదు. (అనఁగా రాజను నర్థము సింహశబ్దమునకు లేదు) వానికి రాజశబ్దసంబంధమును లేదు. అందుచే సింహములకు, "రాజశబ్ద"సంబంధము పొసగదు సింహశబ్దమునకు, సమానార్థకమగు మృగరాజశబ్దమునకు, రాజశబ్ద సంబంధమున్నను, నామృగరాజశబ్దము ప్రక్రాన్తముకాలేదు. 'మృగాణామ్' అనుటకు బదులుగ "మృగరాజానమ్" అనియును ప్రయుక్తముకాలేదు. అందుచే నిట మృగరాజశబ్ద మనుపయుక్తమే

మఱియు సింహములకు, మృగములలో, రాజత్వము కలుగును గాని, శబ్దముగాదు. అందుచే "వీర్యోదగ్రే"యను పదమును శబ్దమునకు విశేషణముగ నుపయోగింపరాదు. వీర్యోదగ్రత్వమనునది వస్తునిష్ఠముగాని శబ్దనిష్ఠముగాదుగదా! కావున నిచట సింహములకుఁగాని, మృగములకుఁగాని, వీర్యోదగ్రత్వమునకుఁగాని "రాజశబ్ద" అను శబ్దముతో నన్వయము సంగతముకాదు. కాననిది యవాచ్యమే. అందుచే "రాజభావే" అనికాని, "మృగేషు" అనికాని వాచ్యము గావలసియుండఁగా, నట్లు లేకుండుటచే నిట నవాచ్యవచనదోషమున్నది.

ఉదా॥ తపేన వర్షాః శరదా హిమాగమో
వసన్తలక్ష్మ్యా శిశిర స్సమేత్యచ
ప్రసూనకౢప్తిం దధత స్సదర్తవః
పురేఽస్య వాస్తవ్య కుటుంబితాం యయుః.

తా॥ గ్రీష్మర్తువుతో వర్షర్తువు, శరత్తుతో హేమంతర్తువు, వసన్తలక్ష్మితో శిశిరర్తువును, కలిసి (దాంపత్యమువహించి) ఎల్లప్పుడు పుష్పసంపత్తినిగలిగి, ఋతువులు ఇతనిపట్టణమునందు వాస్తవ్యులగు (నివసించు) గృహస్థులైనవి. ఇతనిపట్టణమునందు కలిసి, కాపురము సేయుచున్నవని భావము.

వ్యాఖ్య:—ఇచట తప హిమాగమ శిశిరశబ్దములు పుమ్లింగములు. ఆలింగమహిమచే నాఋతువులకు పురుషభావమనుమితమగుచున్నది. వానికి కర్తృత్వముగూడ నున్నది. అందుచే వానికి ప్రాధాన్యమును చెప్పుట యుచితము. వర్షా, వసన్త లక్ష్మీశరత్ శబ్దములు స్త్రీలింగములు. వానికి సహభావము, అప్రాధాన్యమును నుండుట యుచితము. అనఁగా స్త్రీలతోఁగలిసి పురుషులు కాపురము సేయుచున్నారు, అని భావము రావలయును, అపుడు పురుషవాచకశబ్దములకు ప్రాధాన్యమునాధారముగఁ జేసికొని, ప్రథమావిభక్తియు, స్త్రీలింగశబ్దములకు వానియప్రాధాన్యము నాధారముగఁ జేసికొని "సహయుక్తే ఽప్రధానే" అను సూత్రముననుసరించి తృతీయావిభక్తి వచ్చుటయు నుచితము. అట్లున్నపుడే ఒక స్త్రీతో నొకపురుషుఁడు "కుటుంబి" యగుననువాక్యము పొసగును. ప్రస్తుతము "శరదా హిమాగమః" "వసన్తలక్ష్మ్యా శిశిరః" అను నుపవాక్యములయందు, శరత్ వసన్తలక్ష్మీ శబ్దములు తృతీయావిభక్తితోనే యున్నవి. హిమాగమ, శిశిరశబ్దములు, ప్రథమావిభక్తియందే యున్నవి. అట్లుండుట యుచితమే. "తపేన

వర్షాః” అనునపుడుమాత్రము పుంలింగమునందున్న తపశబ్దము తృతీయా విభక్తియందును, స్త్రీలింగమునందున్న వర్షాశబ్దము ప్రథమా విభక్తియందును నుండుట యుచితముగాదు. తపశబ్దము ప్రథమావిభక్తియందును, వర్షాశబ్దము తృతీయావిభక్తియందును నుండవలయును. అట్లు లేకుండుటచే నిట నవాచ్యవచనదోషము వచ్చినది.

శ్లో॥ కిమపేక్ష్యఫలం పయోధరాన్, ధ్వనతః ప్రార్థయతే మృగాధిపః
ప్రకృతిః ఖలుసా మహీయసః, సహతే నాన్యసమున్నతిం యయా.

తా॥ ఏఫలము నపేక్షించి, సింహము గర్జించుచున్న మేఘములకెదురుగ వెళ్లును ? (ఎదుర్కొనును ?) అది గొప్పవానియొక్క స్వభావము. ఆ స్వభావముండుటచేతనే యతఁడన్యసమున్నతిని సహింపలేఁడు.

ఇచట “మహీయసః” యనుపద మేకవచనమున నున్నది. అగుటచే నన్యసమున్నతిని సహింపలేకుండుటయనున దొకని స్వభావముమాత్రమేయని వ్యక్తమగును. గొప్పవారందఱకును నది స్వభావమేయనునర్థము రాదు. ఆ యర్థము భాసింపవలయును. అందుకై వీప్సా సమానఫలకమగు (వ్యాప్తిని తెలుపు)“మహీయసా”మను బహువచన శబ్దమును ప్రయోగింపవలయును - అటువంటి ప్రయోగమున కుదాహరణము

“యావదర్థపదాం వాచ మేవమాదాయ మాధవః
విరరామ మహీయాంసః ప్రకృత్యా మితభాషిణః”

తా॥ అర్థసమ్మితమగు నక్షరములుగలమాట నీ విధముగపల్కి, మాధవుఁడూరకుండెను. గొప్పవారు, సహజముగనే, మితభాషులు.

ఇచట నర్థాన్తరన్యాసమునందు “మహీయాంసః” అని బహువచనము ప్రయుక్తమైనది. లేదా, వీప్సా (వ్యాప్తి)ర్థమును తెలుపు “సర్వ” మొదలగు శబ్దములనైనను ప్రయోగింపవలయును.

ఉదా : ఛాయా మపాస్య మహతీ మపి వర్తమానా
మాగామినీమ్ జగృహిరే జనతా స్తరూణామ్
సర్వోహి నోపనతమ ప్యపచీయ మానమ్
వర్ధిష్ణు మాశ్రయ మనాగత మప్యుపైతి.

తా॥ జనసమూహములు, తత్కాలమునయున్న ఛాయ పెద్దదే యైనను, దానిని వదలివేసినారు. రాఁబోవునీడ నాశ్రయించినారు. లోకమునందందఱును, తమయొద్ద నేయున్నను ఆ యాశ్రయము, నశించునదిగ నున్నచో దానిని వదలి, ముందు రాఁబోవునదేయైనను, నది వృద్ధినొందు స్వభావముగలదగుచో దానినే యాశ్రయింతురుగదా! ఇచట "సర్వోహి" అనునపుడు సర్వశబ్దము ప్రయుక్తమైనది.

పైని సూచించినరీతిని, మహీయసామ్ అని బహువచనమును గాని, సర్వశబ్దమునుగాని ప్రయోగింపమేని, పై వాక్యార్థములయందు భాసింపవలసిన సాధ్యసాధకభావము బాగుగ భాసింపదు. "కిమ పేక్ష్య" అను శ్లోకమునందు ప్రకృతిమహీయస్త్వము సమర్థకమగు హేతువు. అన్యసమున్నత్యసహిష్ణుత్వము సాధ్యము. ఆ హేతువునకు సాధ్యముతోనున్న సర్వోపసంహారవ్యాప్తి భాసింపదు. అనఁగా మహాత్ములందఱును నది లక్షణమను నర్థము భాసింపదు. అందుచే "ప్రకృతిః ఖలు సా మహీయసాం న సహ న్తేఽన్య సమున్నతిం యయా" అని పాఠమును మార్చుట యుచితము. సర్వనామ పరామర్శయోగ్యమగు నర్థమును స్వశబ్దముతోఁ జెప్పుటవలన నవాచ్యవచనదోషము కల్గును. (సంగ్రహశ్లోకము 99.)

ఉదా॥ నిశి నాస్తిక స్థితామపి చక్రాహ్వః సహచరీం విలోకయతి
చక్రాహ్వోపి న సహచర మహో సుదుర్లంఘతా నియతేః"

తా॥ రాత్రిసమయమున మగచక్రవాకపక్షి, తన సమీపమున నందేయున్నను, తన సహచరిని చూడదు (చూడలేదు.) ఆడు చక్ర

బాకేముకూడ నట్లే తన సహచరమగు మగపక్షిని చూడదు. అహా ! దైవ మెంత దుర్లంఘ్యమైనది.

ఇందు రెండవ పాదమున చక్రాహ్వసహచరములు స్వశబ్ద పరామర్శవిషయములుకావు. ముందు వివరించిన న్యాయముననుస రించి, వానిని సర్వనామశబ్దములచే పరామర్శించుట యుచితము. ఆ న్యాయము నంగీకరింపనిచో, చక్రాహ్వ సహచరశబ్దములు పునరు క్తములగును. పునరుక్తిదోషము కల్గుటయేగాక, సర్వనామశబ్దములకు విషయాపహారమే జరుగును. సర్వనామశబ్దప్రయోగమున కవకాశమే యుండదు. పై పద్యమున నట్లు సర్వనామములచే వానిని పరామర్శిం పకుండుటచే అవాచ్యవచనము దోషము. అందుచే "విరహవిధురా న సాపి తమ్" అనుపాఠము నంగీకరించుట యుచితము.

ఇటులే,

"పరిపాతిస కేవలం శిశూ నితి తన్నామని మాస్మ విశ్వసీః"

తా॥ 'శిశువులను రక్షించును'-అను అర్థమునిచ్చు నతని నామ మును నమ్మకుము. కవి, శిశుపాలశబ్దమునకు వ్యుత్పత్తినిచ్చుట కిట యత్నించి, "శిశూన్ పరిపాతీతి" శిశుపాలః-అను వ్యుత్పత్తిని వివరించి నాఁడు. కాని యీవ్యుత్పత్తిననుసరించి "శిశుపరిప"యనుశబ్దమే సిద్ధిం చును. శిశుపాలశబ్దము సిద్ధింపదు. శిశుపాలుఁడను నామమే ప్రసిద్ధ మైనది. శిశుపరిపశబ్దముగాదు. కవి యిచ్చిన వ్యుత్పత్తిననుసరించి, శిశు పాలశబ్దమునకే నూర్పు వచ్చుచున్నది. అందుచే "స శిశూన్ కిల పాలయ త్యమూన్" అని పాఠమును సవరించుట మంచిది.

అవాచ్యవచనదోషము-వాచ్యావచనదోషము నిరూపితమైన ది. ఇష్టార్థవిపర్యయాత్మకమగు అవాచ్యవచనదోషముగూడ, వాచ్యా వచనదోషనిరూపణతో గతార్థమైనట్లు భావింపవచ్చును.

ఉదా॥ సరిత్సముద్రాన్, సరసీశ్చ, గత్వా
రక్షః కపీన్ద్రై రుపపాదితాని
తస్యాపతన్ మూర్ధ్ని జలాని జిష్ణోః
విన్ధ్యస్య మేఘప్రభవా ఇవాపః.

తా॥ నదులకు, సముద్రములకు, సరస్సులకును వెళ్ళి, రాక్షసులు, వానరులును తీసికొనివచ్చినజలములు, జయశీలుఁడగు రాముని శిరసునందు, మేఘమునుండి ప్రభవించిన యుదకములు, విన్ధ్యపర్వత శిరస్సునందువలెఁ బడినవి.

ఇచట విన్ధ్యపర్వతముపై మేఘోదకములుపడినవి. శ్రీరాముని శిరస్సుపై సరిత్సముద్రాదిజలములు పడినవి. ఈరెండువాక్యార్థములకును నుపమానోపమేయభావమున్నది. కాని రెండు వాక్యార్థములయందును జలమను నొకయర్థమే పర్యాయశబ్దమాత్రభేదమున నుపాత్తమైనది. ఒకచో జలశబ్దము, మఱియొకచో "అప్" (అపః) శబ్దమును నుపాత్తమైనది. పరస్పరము విభిన్నములగు నర్థములకే యుపమానోపమేయభావ ముండవలయును. కాని యిచట నట్లులేదు. అందుచే నిట "నవాచ్య వచనదోషమున్నది." "విన్ధ్యస్యమేఘ ప్రభవాని యద్వత్" అని పఠించుచో నీ దోషము పోవును. మూలపాఠమునందు అప్ శబ్దము స్త్రీలింగము. జలశబ్దము నపుంసకలింగము. అందుచే భిన్నలింగత్వమను నుపమాదోషముకూడ నందున్నది. సవరించిన యీపాఠమునందా దోషముకూడ పరిహృతమగును.

"పర్యాయమాత్రభిన్నమైన యొకేవస్తువున కుపమానోపమేయభావమును కల్పించుట యవాచ్యవచనదోషమగును." (సంగ్రహ శ్లోకార్థము 101.)

ఇయంగేహే ల      రియ మమృతవర్తి ర్నయనయోః
అసౌ వస్యాస్స్పర్శో వపుషి బహుల శ్చందనరసః
అయం కంఠేబాహుః శిశిరమసృణో మౌక్తిక సరః
కిమస్యా, నప్రేయో, యది పరమసహ్యస్తు విరహః.

తా॥ శ్రీరాముఁడు తనయొడిలో, నిదురించుచున్న సీతను, గుఱించి పలుకు వాక్యములివి—ఈమె యింటిలో లక్ష్మి. ఈమె కనుల కమృతవర్తి. ఈ యీమెయొక్క స్పర్శ నాశరీరమున నధికమగు చన్దన రసము. ఈ యీమె బాహువు, నాకంఠమున (నాకంఠమునందలి యీ బాహువు) శిశిరమును మసృణమును (చల్లని, నున్నని) ముత్యములసరము. విరహమొక్కటి సహింపరానిదికానిచో నీమెకు సంబంధించినదేది ప్రియమైనదిగాదు ?

పై పద్యమున రెండు మూఁడు నాల్గవపాదములయందు, సీతకు సంబంధించినవిషయములు వర్ణితములైనవి. వానిలో నామెకు సంబంధించిన దే యైనను విరహము ప్రియముగాదనియు విరహముతక్క, మిగిలినవన్నియు ప్రియములే యనియు వర్ణితమైనది. కాని మొదటపాదమున "ఇయంగేహేలక్ష్మీః, ఇయమమృతవర్తిర్నయనయోః" అనునపుడు, నాయికయే సాక్షాత్తుగ వర్ణితమైనది. విరహమును, తదితరములును, సీతను సంబంధించినవై యుండఁగా,సీతను సాక్షాత్తుగ వర్ణించుట దోషము. ఆమెకు సంబంధించినవానిలోనే ప్రియములు నప్రియములు నని విభాగము సేయుట కవివివక్షితము. సాక్షాన్నాయికావర్ణనముగాదు. అందుచే సాక్షాద్వర్ణనము దోషము. "ముఖం పూర్ణశ్చంద్రః" "వపుర మృతవర్తిర్నయనయోః" (నా నేత్రముల కామెముఖము పూర్ణచంద్రుఁడు ఆమెశరీర మమృతవర్తి) అని పాఠమును సవరించుచో నీదోషము తొలఁగును.

ఉదా॥ "శోకానలధూమ సంభార సంభృతాంభోదభరిత
మివ వర్షతి నయనవారి ధారావిసరం శరీరమ్"

అర్థము:—"శోకము నెడు అగ్ని యొక్క ధూమసంభారముచే నుత్పన్నమైన మేఘములచే నిండినదా యన్నట్లు, శరీరము కన్నీటిధారల సమూహమును వర్షించుచున్నది."

ఇచట శోకమున కొకానొక సాధర్మ్యము నాశ్రయించి అగ్నితో నైక్యమారోపితమైనది. అనఁగా శోకమునకును అగ్నికిని రూప్యరూపకభావమువలన రూపకాలంకారమభిహితమైనది. అది యుక్తమే. ధూమమునకు మఱి యే యుపమేయముతో నైక్యమభిహితముగా లేదు. అందుచే నిది యవాచ్యమే-"శోకానల దాహాభీతేవ నహృదయ మనతరతి" (శోకాగ్ని యొక్క దాహమునకు భయపడినదేమోయనినట్లు హృదయములోనికి దిగుటలేదు) అను వేఱొక ప్రయోగమునందువలె నిచటఁగూడ నున్నచో బాగుండెడిది. రూప్యము వేఱొకటి యున్నచో నపుడు దోషమేమియును లేదు.

ఉదా॥ "తస్యా ధౌతాంజనశ్యామా హృదయం దహతో౽
నిశమ్, శోకాగ్నేర్ధూమలేఖేవ గలత్యశ్రుకణావలిః"

అర్థము:—ఆమెయొక్క హృదయమును నిరంతరము దహించుచున్న శోకమనెడు అగ్నియొక్క ధూమరేఖయా యనునట్లు కడుగఁబడిన కాటుకచే నల్లనైన యశ్రుకణావలి స్రవించుచున్నది.

ఇచట కాటుకచే నల్లనైన కన్నీటికి సామ్యమును స్ఫురింపఁజేయుటకై ధూమలేఖాపదప్రయోగమిట నుచితముగనే యున్న కజ్జలమలినమైన యశ్రుకణావళి యనెడు రూప్య మిచట నుండుటచే, ధూమ పదప్రయోగమున దోషము లేదు.

ఆక్షేపము:—ధూమము అగ్నికి కార్యమగుటచే (అగ్నినుండి

పుట్టినదగుటచే) ధూమశబ్దము "శోకానల సంభార" యనుచోటఁ గూడ దోషముకాదు.

సమాధానము:—అనవస్థ, అతిప్రసంగము ననుదోషములకవకాశము కల్గుటచే, నచట ధూమశబ్ద మవాచ్యమే.

ఉదాహరణాన్తరము:—"తప్తే మహావిరహవహ్ని శిఖావలీభిః
ఆ పాండురం స్తనతటే హృదయే ప్రియాయాః"

అర్థము:—మహావిరహమనెడు అగ్నియొక్క శిఖావలులచేత, ప్రియురాలిహృదయము తప్తముకాఁగా. ఇచట శిఖావలీభిః అను పదము వాచ్యము.

రూపకమునకు ఉపచారసహమైనక్రియ యొకటియే యుండవలయును. ఉదాహరణమునకు-అగ్నికి దాహమనుక్రియ; ఇతరములైన వసంభవమగుటచే, కార్యాదులును పనికిరావు (సంగ్రహ శ్లోకార్థము 102.)

"దృఢతరనిబద్ధముష్టేః కోశనిషణ్ణస్య సహజమలినస్య
కృపణస్య కృపాణస్యచ కేవల మాకారతో భేదః"

అర్థము:—దృఢతరనిబద్ధముష్టేః=గట్టిపిడికిలి గలట్టియు, కోశనిషణ్ణస్య=ధనమునందే (ధనాగారమునందే)కూర్చుండినట్టియు, సహజమలినస్య=సహజముగనే మలినమైనట్టియు (మంచిస్వభావము లేనట్టియు) కృపణస్య=లోభికి, దృఢ...ముష్టేః=గట్టిపిడిగలట్టియు, కోశనిషణ్ణస్య=ఒరయందున్నట్టియు, సహజముగనే మలినమైనట్టియు (నల్లగనుండు) కృపాణస్యచ=ఖడ్గమునకును, ఆకారతః కేవలమ్ భేదః=

(1) ఆకారమను నక్షరమువలననే భేదము కనుపడును (కృపణశబ్దమునందు హ్రస్వమైన అకారమున్నది. కృపాణశబ్దమునందు దీర్ఘమైన ఆకారమున్నది.)

(2) స్వరూపములోనే భేదము.

ఇచట కృపణునకును, కృపాణమునకును ఆకారమాత్రభేదమని వ్యతిరేకాలంకార మభిహితమైనది. అది అయుక్తము.

ఆకారార్థము రెండు విధములనున్నది. ఒకటి సన్నివేశలక్షణము-అక్షరవిశేషలక్షణము రెండవది. ఇందు మొదటి యర్థమిచట ననుపాదేయమే.

సహావస్థానము లేని రెండు విషయములు, ఎప్పుడును కలిసి యుండనేయుండవు. (కృపణ కృపాణముల యాకారము లెప్పుడును భిన్నములే.) అయినపుడు, కృపణ కృపాణములకు సన్నివేశలక్షణమగు ఆకారమాత్రమున భేదమున్నదనుట సహృదయులగువారికి చమత్కారమును కలిగించువిషయముగాదు.

ఇఁక రెండవ విషయమునుపరిశీలింతము. అక్షరకృతమగు విశేషము శబ్దైకవిషయము. ఆవిశేషము మనుష్యులకుఁగూడ వర్తించు ననుట యసంభవమైన విషయము. అందుచే అక్షరకృతభేదము కృపణ కృపాణములకు వర్తించుననుటయు సమంజసముగాదు.

సందేహము:-"విషయత్వమనాపన్నైః శబ్దైర్నార్థః ప్రకాశ్యతే
సత్తయైవ తేర్థానామగృహీతాః ప్రకాశకాః"

తా॥ బుద్ధికి విషయములుకాని శబ్దములు అర్థమును ప్రకాశింపఁజేయవు. శబ్దములు శబ్దమాత్రముగ నున్నంతమాత్రమున, బుద్ధిగృహీతములు కానున్నను, అర్థమును తెలుపవు. అను ప్రమాణము ననుసరించి స్వరూపముగూడ శబ్దమునకర్థమే యగునుగదా అగుచో నిట కృపణ కృపాణశబ్దస్వరూపములలో భేదమున్నదిగదా? ఇఁక నిట దోషమేమి?

సమాధానము:—సత్యమే-అయినను, శబ్దస్వరూప పరమగు నర్థము, ఇట, తాత్పర్యముచే వివక్షితము-గాదు. అందుచే నిట 'ఆకార

శబ్దమునకు, శబ్దస్వరూపరూపమగు ఆకారమును, అర్థముగఁ జెప్పుటకు వీలులేదు. ఒకవేళ, శబ్దస్వరూపార్థము తాత్పర్యవివక్షితమేయని యంగీకరించినను, అదియును శబ్దస్వరూపమేగదా! శబ్దస్వరూపమాత్రముననే భేదమగుచో దృఢతరనిబద్ధముష్టి-ఇత్యాది విశేషణములకు సంగతి ఎట్లు కుదురును ? అందుచే నిచట కృపణ కృపాణములకు ఆకారమాత్రభేదమును దెలుపుట చమత్కారావహముకాదు.

వేఱొక యుదాహరణము:—

యేనాలంకృతముద్యానం విహారేణామునా తవ
తేనైవ నిర్వికారేణ కరికుంభ నిభౌ కుచౌ.

అర్థము:—యేన, అమునా, తవ, విహారేణ=ఏ నీయొక్క ఈ విహారముచేత, ఉద్యానమ్, అలంకృతమ్=ఉద్యానవనము అలంకరింపఁబడినదో, నిర్వికారేణ="వి" అను అక్షరము లేని ఆ "విహారముచేతనే" కరికుంభనిభౌ కుచౌ అలంకృతౌ=కరికుంభసమానములగు కుచములు అలంకరింపఁబడినవి.

విహారశబ్దములో, 'వి' తొలఁగిపోయినచో, 'హార'యను శబ్దము మిగులును. నీకుచములు హారములచే నలంకరింపఁబడినవని, కవి యిట చెప్పఁదలచినాఁడు-కాని, 'వి' అను నక్షరము లేని విహారము-శబ్దమే యగును. ఆశబ్దములచే కుచము లలంకృతములగుట పొసగదు. అందుచే ఇచటగూడ అవాచ్యవచనదోషమే యున్నది.

ఈక్రిందివిషయము మాత్రము సమంజసముగనే యున్నది.

"అక్షరాణా మకారోఽహమితియః స్వయ మభ్యధాత్
సోపి త్వయామునా స్వామిన్ ఆకారేణ లఘూకృతః"

తా॥ అక్షరములలో నేను "అకారము" అని శ్రీకృష్ణుఁడు స్వయముగఁ జెప్పినాడు. ఓ స్వామీ, ఆ అకారముగూడ, నీచేత ఈ ఆకారముచే, అల్పమైనదిగాఁ జేయఁబడినది.

త్రివిక్రముఁడవగు నీ యీ స్వరూపముచే ఆ అకారస్వరూపము అల్పముగఁ జేయబడినది. అని యొక యర్థము. ఆకారము అనఁగా ఆ అను అక్షరము. 'ఆ' యను నక్షరముచే అకారము లఘువుగాఁ జేయఁ బడినది. అనియు నిట నర్థము. అకారము ఆకారము రెండును శబ్ద స్వరూపము లేయగుటచేతను అకారము లఘువు, ఆకారము గురువు అగుటచేతను, అకారము, ఆకారముచే లఘూకృతమైనదనుట యుక్త ముగనే యున్నది. "దృఢతర నిబద్ధముష్టేః" "యేనాలంకృతమ్ ఉద్యానమ్" అను శ్లోకములలో, అక్షరవిశేషాత్మమగు ఆకారభేదమే లక్షణముగాఁగల శబ్దధర్మము అర్థమునకు విశేషణముగాఁ జెప్పఁబడి నది. అట్లు చెప్పుట కూడదు. అందుచే అవాచ్య వచనదోషము వచ్చినది.

యద్య ప్యర్థావుభౌ శబ్దః క్రమేణాభి దధాత్యయమ్
స్వరూపంచార్థరూపంచ తథాప్యస్యాభిధాక్రియా (103)
తత్పరత్వా ద్వివక్షాయా విశ్రామ్యత్యర్థ ఏవ హి
భిన్నధర్మతయా తేన భిన్న కక్ష్యతయాపిచ. (104)
నార్థాత్మనా జాతుచిదిమా శ్లిష్టమేకం విశేషణమ్
మాభూదేకాత్మతాప త్తి దోషోఽసావేతయోరితి. (105)

సంగ్రహశ్లోకములు.

తా॥ శబ్దము, స్వరూపము, అర్థరూపము, అను రెండర్థములను, క్రమముగఁ జెప్పును. కాని కవి వివక్ష అర్థమునఁనే యుండుటచే శబ్ద మునకున్న అభిధాశక్తియు, అర్థమునందే విశ్రమించును. అనఁగా అర్థ స్వరూపమగు నర్థమునేచెప్పి విరమించును. స్వరూపపరమగు నర్థ మును చెప్పదు. వానిలో ఒకటి శబ్దస్వరూపము. ఒకటి అర్థస్వరూప ము. ఆరెండును పరస్పరభిన్నధర్మములు గలవి. అందులో నొకటి కార్యకారి. వేఱొకటి కార్యకారికాదు. అందుచే నవి భిన్నకక్ష్యలకు

సంబంధించినవియు నగును. ఇట్లు భిన్నధర్మములు, భిన్నకర్తృలు కలవి యగుటచే నారెండును నెప్పుడును శ్లిష్టమై ఏకరూపముగనుండి విశేషణముగ నన్వయింపవు. అట్లన్వయించుచో శబ్దార్థము లేక రూపము కావలసివచ్చును. అట్లగుట దోషము.

ఉదా॥ "యమిందశ్రబ్దార్థ నిషూదనం హరేః
హిరణ్యపూర్వం కశిపుం ప్రచక్షతే" (శిశుపాలవధ 1-42)

అర్థము:—హరేః=ఇంద్రునియొక్క, ఇన్ద్రశబ్దార్థ నిషూదనమ్=ఇంద్రశబ్దమునకుఁగల యర్థమును నాశనముసేయు (ఇన్ద్రశబ్దమునకు పరమైశ్వర్యమని యర్థము.-ఆయర్థమును తొలగఁజేయు-అనఁగా ఇంద్రునియొక్క యైశ్వర్యము నపహరించు-అని యర్థము) యమ్=ఏ రాక్షసుని, హిరణ్యపూర్వం, కశిపుమ్=హిరణ్య అనుశబ్దము, పూర్వమందుఁగల కశిపుమ్='కశిపు' అను శబ్దముగా ప్రచక్షతే=చెప్పుదురో-హిరణ్యకశిపుఁడని యందురో అనియర్థము.

ఇచట 'హిరణ్యకశిపు'అని చెప్పుటకుబదులు "హిరణ్యపూర్వం కశిపుమ్' అని చెప్పుటవలన అవాచ్యవచనదోషము వచ్చినది.

ఇచట హిరణ్యశబ్దము కశిపుశబ్దము అభిధేయ ప్రధానములా? స్వరూపమాత్ర ప్రధానములా ?-అభిధేయప్రధానములగుచో నర్థమునకు సమన్వయముండదు. హిరణ్యశబ్దమునకు బంగారమర్థము. కశిపుశబ్దమునకు శయ్య అర్థము. ఈయర్థములు హిరణ్యకసిపుఁడను రాక్షసుని బోధింపవు. అందుచే వీనికి ప్రస్తుతార్థసమన్వయము లేదు. కావున నివి యభిధేయప్రధానములనుటకు వీలులేదు. ఇంకొక దోషముకూడ నున్నది. కశిపుశబ్దము నపుంసకలింగము. అపుడు "కశిపు" అని మాత్రమే శబ్దముండవలయును. కశిపుమ్-అని యుండఁగూడదు. అందువలనఁగూడ నీ శబ్దములు అభిధేయప్రధానములనుటకు వీలు లేదు.

స్వరూప ప్రధానములనుటకును వీలులేదు. హిరణ్యకశిపుఁడను రాక్షసుని, ఎవరును 'హిరణ్య పూర్వ కశిపుఁడు' అని పిలుచుట లేదు గదా ! అతనిపేరున కిది యనుకరణము గానేఅదుగదా !

శబ్దానుకరణము రెండు విధములు:—(1) శాబ్దము (2) ఆర్థము. ఇతి అను శబ్దముతో వ్యవచ్ఛేదమున్నచో శాబ్దమగు అనుకరణమను విషయము ప్రసిద్ధమే. (రామ ఇతి-అనునప్పుడు-రామశబ్దమున కను కరణమున్నది.)

అర్థమువలననే ఎచట వ్యవచ్ఛేదము కలుగునో అచట ఆర్థము-అనుకరణము.

ఉదా:—"మహదపి పరదుఃఖం శీతలం సమ్యగాహుః"

అర్థము:—ఇతరులదుఃఖము గొప్పదైనను, హాయిగనే యున్నది. అందురు. ఇచట అర్థమువలననే, ఇది అనుకరణమని తెలియుచుండుటచే "ఇతి" (=అని) అను శబ్దము లేదు. ప్రస్తుతము "హిరణ్య పూర్వం కశిపుమ్" అనునపుడు, ఇతిశబ్దము లేదు. అందుచే నిచట ఆర్థమగు అనుకరణమున్నది. ఇచట ఆరాక్షసుని నామమునకే యనుకరణముండవలయును. కాని యది యనుకృతముకాలేదు-అనుకృతమైన 'హిరణ్యపూర్వం కశిపుమ్' అనునది అతనికి నామముకాదు. లోకమునందతనికిహిరణ్యకశిపుఁడనియేనామముగాని,హిరణ్యపూర్వకశిపుఁడను నామము లేదు. అందుచే నిట నవాచ్యవచనదోషమున్నది.

ఉదా॥ "క్షుణ్ణమ్ యదన్తఃకరణేన వృక్షాః
ఫలన్తి కల్పోపదా స్తదేవ".

కల్పోపదాః వృక్షాః-కల్ప అను ఉపపదముగల వృక్షములు-కల్పవృక్షములనుటకు బదులుగ కల్పోపదాః వృక్షాః అని యున్నది. ఇచటఁగూడ ఇతిశబ్దములేదు. అందుచే ఆర్థానుకరణమున్నది-కల్పవృక్షములకు "కల్పోపదాః వృక్షాః" అని పేరులేదు. అందుచే అవాచ్య వచనము దోషము.

"క్షుణ్ణాం యదన్తఃకరణేన నామ తదేవ కల్పద్రుమకాః ఫలన్తి".

అని సవరించుచో ఆదోషము తొలఁగును. ఈవాక్యమునకు— "మనసున తలఁచిన వానినే కల్పవృక్షములిచ్చును."—అని యర్థము. ప్రస్తుతము స్తుతింపఁబడుచున్న రాజు, మనసున తలఁపనివానినిగూడ నిచ్చును. అందుచే రాజుయొక్క ఘనత సూచితము. మొదటి పాఠమున, అపేక్షితమైన యర్థమునే కల్పవృక్షమిచ్చుననునపుడు, కల్పవృక్షమిచ్చు "అర్థమునందు తిరస్కారభావము, అవజ్ఞ భాసించును. రెండవపాదమునందు కల్పద్రుమకాః" అనునపుడు, కల్పద్రుమశబ్దము తరువాత "క" ప్రత్యయము ఉన్నది. ఇది అవజ్ఞార్థమును సూచించును. అందుచే, ఈరెండవపాఠమున కల్పవృక్షములిచ్చు వస్తువులేగాక, కల్పవృక్షములుగూడ నీచములేయనుభావముగూడ సూచితమగుచున్నది. అందుచే ఈపాఠమునందు గుణాన్తరలాభమున్నది.

"దశపూర్వరథం యమాఖ్యయా' దశకంఠారిగురుం ప్రచక్షతే".

ఇచట దశరథుఁడనుటకు బదులు దశపూర్వరథుఁడని యున్నది. అందుచే అవాచ్యవచనము దోషము.

"యా ఘర్మభాసస్తనయాపి శీతలైః
స్వసా యమస్యాపి జనస్య జీవనైః
కృష్ణాపి శుద్ధే రధికం విధాతృభిః
విహన్తుమంహాంసి జలైః పటీయసీ".

తా॥ యమునానది, తీక్ష్ణకిరణుని తనయయైనను, యమునిసోదరియైనను, నల్లనిదైనను, (క్రమముగా) శీతలములైనట్టియు, ప్రాణమునిచ్చునట్టియు, పవిత్రముచేయునట్టియు జలములచే జనుల పాపములను పోఁగొట్టుటలో సమర్థమైనది.

తీక్ష్ణకిరణుని తనయయైనను, శీతలజలములచే పాపములను పోఁగొట్టునను వాక్యమునందు, విరోధము స్ఫురింపవలయునని కవియుద్దే

శము. తీక్ష్ణకిరణతనయత్వము శీతలత్వము అను ధర్మములు ఒకేవస్తువు నాశ్రయించియున్నపుడే ఆవిరోధము భాసించును-అధర్మములు భిన్నాశ్రయములై నపుడు విరోధకథన ముపపన్నముకాదు. ప్రస్తుతము తీక్ష్ణ కిరణతనయాత్వము మొదలగునవి యమున నాశ్రయించియున్నవి. శీతలత్వాదికములు జలము నాశ్రయించినవి. ఇట్లు భిన్నాశ్రయము లైనవానికి విరోధభాన ముపపన్నముగాదు. యమునకును, తజ్జలముల కును తాత్త్వికమగు నైక్యమున్నదనుట సత్యమే. అయినను యము నార్థప్రతిపాదకశబ్దములు కర్తలుగను, జలార్థకశబ్దము కరణముగను నిచట నిర్దిష్టములైనవి. అందుచే శాబ్దమగు భిన్నత్వముండనేయున్నది. కవికి శాబ్దమగు విధము చెప్పుటయే యిష్టము. కాని శాబ్దముగ ఆ ధర్మములకేకాశ్రయత్వము సిద్ధింపలేదు. అందుచే ఇచట అవాచ్య వచనము దోషము. పాఠము నీక్రిందివిధముగ సవరించుట మంచిది.

"యా ఘర్మభాసస్తనయాపి శీతలాస్వసా యమస్యాపిజనస్య జీవనీ
కృష్ణాపి శుద్ధేరధికం విధాయినీ విహన్తుమంహాంసి జలైః పటీయసీ"

వేఱొకయుదాహరణము:—"రురుచే హిమాచల గుహాముఖోన్ముఖః
పయసాం ప్రవాహ ఇవ సౌరసైంధవః"

తా॥ హిమాచల గుహాముఖోన్ముఖమైన, సౌరసైంధవమైన (గంగానదినుండి పుట్టిన) నీటియొక్క ప్రవాహమువలె ప్రకాశించెను.

ఇచట 'పయసాం' (నీటియొక్క అను శబ్దము "ప్రవాహ" శబ్ద మునకు విశేషణముగా నుపయుక్తమైనది. ('నీటికి సంబంధించిన' అను నర్థమునిచ్చుటచే నది ప్రవాహమునకు విశేషణము) ప్రవాహమను నది ఎప్పుడును నీటికి సంబంధించినదిగనే యుండును. అందుచే ఆవిషయ మును చెప్పుట వ్యర్థము. "సౌరసైంధవః" అనునదియు ప్రవాహము నకు విశేషణము-సురసింధోః భవః-అనునర్థమున తద్ధితప్రత్యయము ఉపయుక్తము-షష్ఠీ విభక్తినిమాత్రమే యుపయోగించినను, ఆయర్థము

గీ. తల్లి చండిక యనుపేరుఁ దాల్చి కడఁక
సమ్మహానగరంబున ననుదినంబుఁ
గాపురం బుండుఁ దనుఁ జూడఁగడఁగువారి
పాలి వేలుపుగిడ్డి నాఁ బరగుచుండి. 41

వ. ఇట్లఖిలనగరీనాయకరత్నం బై యొప్పు నప్పురవరంబున కధీశ్వ
రుండు. 42

సీ. శ్రీకతీశ్వరపాదసేవాభిహితసుధీ
భాసురుం డవితమహీసురుండు
దశదిశాముఖమహోదంచత్ప్రతాపవి
భ్రాజితుం డవనీశపూజితుండు
నిఖిలప్రజామనోనీరేజనవ్యప్ర
భాకరుండు లసద్గుణాకరుండు
కమనీయభోగభాగ్యప్రధానిర్జితా
ఖండలుండు జితారిమండలుండు

గీ. వినుతి సేయంగఁదగు జగద్వినుతకీర్తి
చంద్రికాధాళధళ్యనిస్తంద్రవిభవ
హసితకైలాసనగవృషాధ్యక్షచంద్ర
శేఖరుం డైన శృంగారశేఖరుండు. 43

సీ. సర్వజ్ఞమౌళి యీజగతీతలేశ్వరుం
డతులరాజసమాఖ్య నలరు టరుదె
కరమున శతకోటి గలమేటి యీఱేఁడు
ఘనసుధర్మాఢ్యతఁ గాంచు టరుదె
బలభద్రసహితుఁ డీపావనస్వాంతుండు
పురుషోత్తమఖ్యాతిఁ బొందు టరుదె
శ్రీసర్వమంగళాంచితదేహుఁ డీధన్యుఁ
డసమాంబకస్ఫూర్తిఁ బొసఁగు టరుదె

గీ. యనుచు జను లెంచఁదగు విపత్సావనీశ
రాజ్యలక్ష్మీకచాంతరగ్రథితకుసుమ
దామసౌరభకలితహస్తప్రశస్తుఁ
డార్యవినుతప్రభావుఁ డయ్యలఘుయశుఁడు. 44

కం. ఆరూఢరూపవిభ్రమ
తారుణ్యాదయాపతివ్రతాధర్మసదా
చారాన్విత యతనికి సుద
తీరత్న మనంగవతి నుతింపఁదగు ధరన్. 45

కం. ఖ్యాతిఁ జంద్రమతి నరుంధతి
రతి భారతి హైమవతిని బ్రకటింపు నెడం
బ్రతి సెప్ప నొప్పు నమ్మద
వతి పాతివ్రత్యవైభవంబున నెంచన్. 46

సీ. అఖిలరాజన్యకన్యామాళిరత్నసీ
రాజితాంఘ్రిద్వయప్రాభవంబు
దివిజనాయకపురంధ్రీమణీగణనీయ
భూరివైభవధుర్యభోగమహిమ
రంభోర్వశీరతిప్రముఖదివ్యాంగనా
విజయాఢ్యసౌందర్యవిభ్రమంబు
తన్మోరమాసదృశక్షమాఘనైశ్వర్యవి
భ్రాజితప్రబలసౌభాగ్యగరిమ
గీ. మొదలుగాఁ గలసద్గుణంబులఁ బొసంగి
ప్రాణవిభునకుఁ బట్టపురాణి యగుచు
వన్నెఁ గాంచియు నయ్యిందువదన దలఁకె
నంత సంతాన మెఱుఁగనిచింతఁ దగిలి. 47

కం. పతియనుమతగతి నమ్మద
వతి చతురత వంధ్యతాపవాదము మాన్పన్
మతిఁ బూని వృద్ధకాంతో
దితమహితాచారసరణి దినదిన మెలమిన్.

సీ. ప్రొద్దుప్రొద్దున లేచి పుణ్యప్రవాదంబుల
పాళితో జలకంబు లాడి యాడి
ముత్తైదువులఁ బ్రియంబునఁ బూజ గావించి
నవనవఫలవాయనము లొసంగి
క్షితిసురోత్తములకుఁ బ్రతిదినంబు నపూప
ఘృతపాయసాదులఁ దృప్తి సలిపి
గృహదైవతముల మిక్కిలిభక్తిఁ బ్రార్థించి
నానావిధాభ్యర్చనము లొసంగి
గీ. వ్రతము లొనరించి శకునసంగతులు దెలిసి
సిద్ధమునిబృందములను వీక్షించి మ్రొక్కి
సతులు గావించుయత్నముల్ సలుపుచుండె
నమ్మృగేక్షణ సంతాన మాత్మఁ గోరి.

ఉ. అంతట నొక్కనాఁడు కమలాక్షి నిజేశునితోడఁ గూడి యే
కాంతమునన్ వసింప రతికాంతరణాంతనితాంతతాంతనై
శ్రాంతములందు నిద్ర గలయం బవళించిన నొక్కవిప్రుఁ డ
య్యింతికిఁ గేతకీకుసుమ మిచ్చెఁ గలం గలకంఠి వేడుకన్.

చ. అలరుచు మేలుకాంచి హృదయప్రభుతో ననునాథ! యీయెడ
గల నొకబ్రాహ్మణుండు నవకైతకసూన మొసంగె నొనసం
దెలిసె నృపాలుఁ డంత సుదతీ విను మాతఁడు వాసవుండు మా
కులగురుఁ డొక్కకన్య గలుగుం బ్రసవంబు నొసంగెఁగావునన్,

కం. కల యిది నిక్కల కన్నియ
గలుగుం గలకంఠి నమ్మఁగాఁదగు నీనో
ములఫలము చేరె నన విని
యలరె ననంగవతి నిక్క మగునని కడఁకన్. 52

గీ. వ్రతఫలములు పచేళిమప్రభ వెలుంగు
నట్లు శుభములు ప్రత్యక్ష మైనయట్లు
నంతలోఁ గొన్నినాళ్ల కయ్యబ్జముఖికి
సన్నసన్నఁగ వేకటిచిన్న లమరె. 53

చకచకద్యుతులచే ముకురంబు లన మించు
చెక్కుల వెలిచాయటెక్కు లమరెఁ
గనకసారసకోరకముల పై నెలకొన్న
భ్రమరంబు లనఁ గుచాగ్రములు మెఱసె
సీ. నంబరస్ఫూర్తి విడంబించు నరిపేద
కౌ నంతకంతకుఁ గాననయ్యెఁ
దతజఘనద్వయోన్నతజాతరభరంబు
మందయానమునకు నంద మొసఁగె

గీ. నసమశరతంత్రములమీఁద విసుగు దోఁచె
సఖులతో ముచ్చటాడంగ సైఁచ దయ్యెఁ
బుల్లపుల్లనిరుచులపై బుద్ధి పొడమెఁ
బ్రథమగర్భోదయమున నప్పద్మముఖికి. 54

కం. క్షితి గంధవతి నిజం బని
మతిఁ దలఁచి తదీయగంధమానితరుచిచే
నతులక్షమాఖ్య యాసతి
యతిచతురతఁ గొను మృదార్జితాహారంబుల్. 55

గీ. ఉవిద బలుతొడవులు దాల్ప నోపలేక
విరులు గోసినపూఁదీవకరణిఁ దనరె
నలినలోచనజఠర మున్నతి వహించె
ముద్దరాలికి నీళ్లాటప్రొద్దు లయ్యె. 56

చ. శుభదివసంబునందుఁ బరిశుద్ధముగా గ్రహరాజు లుచ్చలం
దభిమతలీల నుండఁ దరళాయతలోచన కూఁతుఁ గాంచె నం
దిభనిభయాన లైనధవళేక్షణ లందఱు సంభ్రమంబుతో
రభసగతిం దదీయగృహరక్ష యొనర్చి రహార్యధైర్యలై. 57

వ. అప్పుడు. 58

సీ. మణిగణద్యుతికి మార్తాండులయుదీప్తుల రేయుఁ
బగలును వెలుఁగుదీపములగములు
నిరుచక్కియల దారి కెలమిఁ గాఁపుగ నుల్లి
పొట్లు గప్పినయగ్గిపొగలతెగలు
ద్వారమూలముల నందముగ నుంచినదీర్ఘ
శాకోటకుటసమిత్సముదయములు
నిది సందుదిన మిందు రోద సేయఁదగ దని
పలుకువృద్ధాంగనాపరిజనములుఁ

గీ. గలిగి తత్తత్ప్రదేశసంఘటితపూర్ణ
కుంభరంభాతరుస్తంభజృంభమాణ
సితవితానపతాకాభినుతవిభూతి
గాంచి యుప్పొంగెఁ దత్సూతికాగృహంబు. 59

సీ. తారహారములతోఁ బోరాడు వెల్లుల్లి
పూసపేరులు కంఠమునఁ జెలంగఁ
బద్మరాగంబులపగిదిఁ జొక్కపువీఁశి
యములతో నెనసి దంతములు మెఱయఁ

ధగధగ వెలుఁగు నిద్దపుఁజెక్కుటద్దము
　　లొంతఁ గాటుకయుక్కుబొట్టు వెలుఁగ
ముఖచంద్రమునిమీఁద మొనసినకార్మబ్బు
　　గతి నీలివాసెనకట్టు మెఱయ
గీ. నంత నయ్యింతి పచ్చిబాలింతసొబగు
　　భువనమోహన మగువేషమునఁ బొసంగెఁ
　　దరుణు లెల్లను వృద్ధోదితప్రకార
　　మునఁ బురిటివైభవము సేయ వెనుకవెనుక. 60

కం. వాసవువరమునఁ గలిగిన
　　యాసుదతీరత్నమునకు నవనీశుఁడు దా
　　వ్రాసెను నామం బీసతి
　　వాసవదత్త యని బుధులు వర్ణన సేయన్. 61

మ. ప్రతిపచ్చంద్రకళావిశేషరుచిఁ దద్బాలామలాభంబు తాఁ
　　బ్రతిభన్ బ్రత్యహమున్ వివృద్ధగతిచే రంజిల్లెఁ దద్భావముల్
　　మతి భావింప వచింప నెంచుకొనఁగా మాబోంట్లకున్ శక్యమే
　　రతిరంభాదిసురాంగనావితతి మీఱంజాలుఁ దద్వైఖరుల్. 62

కం. మనసిజునిమంత్రదేవత
　　యనఁగను దనరారె శైశవానంతరయా
　　వనలాభవిభవమున న
　　వ్వనితామణి దినదినప్రవర్ధితరుచులన్. 63

ఉ. కొప్పు ఘనంబు చూడ నలకొమ్మ మిడికన్ను సమున్నతప్రభన్
　　విప్పుగఁ గన్నుదోయి కచవిభ్రమలోచనరోచి కెక్కుఁడై
　　యొప్పుగఁ జన్ను లున్నతి సముజ్జ్వలకై శికదృక్కుచప్రభల్
　　గప్పఁ బృథుత్వవైభవముఁ గాంచి కటిస్థలి లేమ కెంచఁగన్. 64

సీ. మరునినీలపుఁటురుల్ మానినీమణికురుల్
గనకభవ్యవిలాస కలికినాస
శశివిభోల్లసనంబు జలజాక్షిహసనంబు
పద్మంబులోఁగోము పడఁతిమోము
వజ్రరుక్కాంతముల్ వనజాస్యదంతము
లమృతంపుబావి తన్వంగిమోవి
యసితోరగముఁ గేరు నలివేణినూగారు
విన్నుఁ గెల్వఁగఁ బూను వెలఁదికౌను
గీ. తరళతరవీచికావళు ల్దరుణివళులు
భూమిచక్రజయార్భటి భామినికటి
సరసిజశ్రీపదములు సుందరిపదములు
తారకలజోళ్ళు నవలతాతన్విగోళ్లు. 65

వ. ఇవ్విధంబున నొప్పునవ్వనితారత్నంబు రత్నసానుసానుగత ప్రభ యుంబోలె సుజాతరూపవిభ్రమమై, శరత్కాలదినాంతలక్ష్మియుం బోలె సముల్లసత్తారకాలంకృతయై, సత్సభాస్థలియుంబోలె సంస్తూయమానద్విజపంక్తివైభవయై, లావణ్యరసాయనసిద్ధియో యన, శృంగారోదయస్థానమో యన, మదనజయపతాకయో యన, సంసారభిత్తిరచితచిత్రచిత్రరేఖయో యనఁ, త్రైలోక్యసౌభాగ్యలక్ష్మీ నృత్తరంగస్థలియో యన, ననన్యసామాన్యవిలాసలీలచే నలరుచు మదనమంజరియు, వసంతసేనయుఁ, దరంగవతియుఁ, జిత్రరేఖయు, విలాసవతియు, మదనమాలినియు, రాగలేఖినియుఁ, గాంతిమతియు, యూథికయు, ననంగరేఖయు ననంగ బదుండ్రు చెలి కత్తియ లమందానందకందళితహృదయారవిందలై, యాటలం బాటల వినోదకథాప్రసంగంబులం బ్రొద్దుపుచ్చుచు నుండ నంత నొక్కనాఁడు వన్యావిహారంబుఁ గోరి యక్కన్య చందన మందార

సింధువార కందరాళ మాకంద పిచుమంద పూగ పున్నాగ నాగ వకుళ చాంపేయ పాటల భూర్జ సర్జ ఖర్జూ రార్జున మాతులుంగ లుంగ లవంగ నారంగ నింబ జంబూ దుంబర శింశు పాశ్వత్థ శిరీష పనస పిప్పల వట కుటజాది నానావిధతరుచ్ఛాయాలవాలంబును, వాచాల శుక పిక శారికానికర కలకలధ్వాన బధిరితరోదోంతరంబును, బల్లవోల్లసిత మల్లీవల్లీ వేల్లిత మంజునికుంజగుంజ న్మధువ్రతఝుంక్రియాగానమనోహరంబును నగు నుద్యానవనంబుఁ జేరంజను చున్నయవసరంబున- 66

శా. కాంతంబై సుమనోమనోజ్ఞనవమాకందద్రుకాంతారసం
క్రాంతానంతమనోజసైనికపటాగారావళీభూతకుం
జాంతస్సంతతపల్లవోదయదిదృక్షానందితస్వైరిణీ
స్వాంతంబై తనరె న్వసంతము లతాంతాలంకృతానంతమై. 67

సీ. ప్రబలకుంజవ్రజపటమందిరము లొప్ప
సుమనోరజోదితానములు మెఱయ
మలయసమీరడింభకు లూడిగము సేయ
నవ్యకాంచనభూషణములు వెలుఁగఁ
బరభృతమాధవప్రతతులు గొనియాడ
లతికాంగనలనాట్యగతులు చెలఁగఁ
దతభృంగగాయకప్రతతి గానము సేయ
శుకశారికాదిసైనికులు గొలువ

గీ. వనధరాస్థానమున మాధవప్రభుండు
నిగ్రహానుగ్రహక్రియానిపుణుఁ డగుచు
మధుపమాలిన్యజాతులమద మణంచి
యధికతరులకుఁ బచ్చడా లపుడు గప్పె. 68

సీ. సహకారసురసదృక్చలకనీనికలు వా
సంతికాలోచనచలవిస్ఫురర
కజ్జలప్రభ లనంగజ్వాలజ్వాలనధ్వ
జములు కుంజాకరస్థగితశక్ర
మణులు జాంబవసుషమావిగ్రహంబులు
చైత్రభాగ్యవిహీనజాత్యకీర్తు
లాలోలవనసరోనీలోత్పలదళంబు
లరుణప్రసూనకుంజాగ్రరుచులు

గీ. కనకకోరకదీపశిఖాకలాభి
హాతిసముద్భూతఝుంక్రియైకార్తనాద
సంచరిష్ణుకృశధ్వాంతశాబకములు
చెలఁగె షట్పదములు వనస్థలులయందు.

గీ. విరహతతిమీఁద దండెత్తు మరునివిజయ
శంఖములు పట్టి పూరించుజాడ దోఁప
నలరె నుధుపము లపుడు ప్రత్యగ్రవిచికి
లాగ్రములమీఁద మధురసం బాన నిశిచి.

కం. బత్తిగలమగఁడు చైత్రుం
డత్తఱి వన్యావధూకచాంతరసీమన్
హత్తుకొనఁ జల్లి కూర్చిన
ముత్తెము లన సిందువారములు గనుపట్టెన్.

చ. అసమశరప్రతాపదహనార్చిరుదంచితకీలలో యనం
గిసలయముల్ చెలంగ మరుకీర్తులకై వడి వాసిమీఁదటం
బ్రసవము లొప్ప మారునిప్రభావముకై వడి నున్నతప్రభా
విసరము చెంగలింప వనవీథులఁ జూతము లొప్పె వయ్యెడన్. 72

కం. మావులు కొన్ని మనోజుని
మావు లనం దనరెఁ బత్రమానితరుచిచేఁ
గ్రోవులు మదనునికపురపుఁ
గ్రోవు లనఁగ వలపుఁ దెలిపెఁ గుసుమప్రభలన్. 73

ఉ. ఆసమయంబునందు సఖు లందఱు గుంపులు గూడి కొల్వ న
వ్వాసవదత్త భాగ్యవిభవంబు దలిర్ప మనోజరాజ్యల
క్ష్మీసుకుమారలీల విహసింపుచుఁ బువ్వులు గోయఁబూని వ
న్యాసరణిన్ మనోహరవిహారము సల్పఁదొడంగె వేడుకన్. 74

కం. వనమా యిది చైత్రునిజీ
వనమా పికనికరసుకరవనమా స్వరభా
వనమా నవయువజనపా
వనమా రతిభాగ్యభాగవనమా యనుచున్. 75

ఘుమ్మఘుమ్మనఁ గమ్మదెమ్మెరల్ పుప్పొడి
దుమ్ము రేచఁగఁ దావి గ్రమ్ముచోట
నల్లిబిల్లిగ నుల్లసిల్లు సల్లలితసం
ఫుల్లమల్లీసుమవల్లులకడ
నెన్నఁ జెన్నగు చిన్నచిన్నగున్నలజాడ
నున్న ప్రసన్నసిసురపొన్నలదరిఁ
గొదమతుమ్మెదలపై మెదలుచు రొదసేయఁ
బొదలు బల్గురివిందపొదలనీడఁ

గీ. గంతుగొని యాడి పాడుచు గంతు లిడుచు
రంతు సేయుచుఁ గొలఁకులపొంతఁ జనుచు
మంతనము లాడి యివి కొన్ని వింత లనుచు
సంతసమునఁ జరించి రయ్యింతు లచట. 76

సీ. ధీరద్విరేఫఝుంకారప్రసవగుచ్ఛ
భారద్రుమవాటీవిహారములను
మారలీలోన్మత్తకేరళీకుచగంధ
సారసంయోగసత్కారములను
సారవన్మలయశైలారబ్ధచందన
శ్రీరమ్యపాదసంచారములను
సారసోదారగంభీరవాఃపూరకా
సారసేవాసదాచారములను
గీ. దృప్తుఁడై తృప్తుఁడై దీప్తి వ్యాప్తిఁ బొదలి
యలసి మెల్లన నచ్చోటి కరుగుదెంచె
నతనుకేళీరతాతనుసుతను సుతను
ఘర్మశీకరహారుఁ డైన గంధవహుఁడు.

సీ. శ్రీఖండతరుషండశేఖరాలంకృత
కిసలయకంపనాంకితరయములు
సరసలవంగకేసరజాలసంపాద
నాయత్తచతురవిద్యాస్పదములు
సలిలకేళీరతశమనకాంతాతనూ
సౌరభస్ఫూర్తివిస్తారితములు
తతరతశ్రాంతకాంతాకుచాంతరమౌక్తి
కస్ఫుటఘర్మశీకరహారములు
గీ. మలయమారుదంకురమ్ము లనూనవతుల
సతతవన్యావిహారజశ్రమము వాయ
నల్లనల్లనఁ జనుదెంచె నుల్ల మలర
ముమ్మరమ్ముగఁ బూఁదావి గ్రమ్ముకొనఁగ.

చ. వదనముఁ జూపఁ జంపకము, వావిలి మూర్కొనఁ, గ్రోవి కౌఁగిటం
బాదనఁగఁ, బాడఁ బ్రేంకణము, పొన్న హసింపఁగ,నయ్యశోకముం
బదమునఁ దన్నఁ, గేసరముపై నుమియం, బలుకంగ గోఁగుఁ, జే
గదలుప మావి, చూడఁ దిలకంబును గ్రొన్నన లిచ్చు వారికిన్.

వ. అట్టియెడ. 80

కం. ఒక రోకరిఁ జేరి కేరుచు
ముకుళంబులు విరులుఁ జూచి ముదమందుచుఁ జే
రిక నున్నచెలులఁ గని య
మ్ముకురానన మధురవాక్యముల నిటుపలికెఁ. 81

రగడ.

మదనమంజరి కంటివే యీమదనమంజరి సొగసుపెంపులు
పొదలరొద లొనరింపుచును మదిఁ బొదలుచున్నవి తేఁటిగుంపులు
కదలికలు లేకున్న వెంచఁగఁ గదలికలమొత్తమ్ము లిచ్చటఁ
బదరజమ్ములు గ్రమ్మఁ దిరుగుచుఁ బదరనేటికి నాలి యచ్చట
నాగమల్లెలు గలిగె నల మదనాగరాజ సమానయానకుఁ
బూగములపైఁ బ్రాఁకుతీఁగెలపూగములు సాధించు మానకుఁ
జిన్న లల్లవె యెన్నఁ జెన్నగుఁ జిన్నప్రాముపురీవి నలరెడుఁ
గన్నెరలకై యరుగ నేటికి గన్నె రహిఁతో నిందుఁ గొఱలెడు
వేయునేటికి విరులపై నీ వేయుపాయము సేయఁగావలె
రా యనంటులనీడలకు వలరాయనికిఁ దెరు వియ్యఁగావలె
రంగరంగశుకంబు లవె సారంగలోచన మరుబలంబులు
రంగదాకృతి నొప్పె నవె నారంగభూజములను ఫలంబులు
రాకు రాకు పరాకు కెందలిరాకు చిదుమఁగ రాదు పదరకు

కాకు గాకు ఫలంబుగను దన కాకురంగట నిల్పు బెవరకు
పొలఁతిరో ములయానిలము లోకపొలఁతి పుప్పొడి దుమ్ము రేఁచను
వెలఁది యుయ్యాలఁ బన్ను పూఁదీవెలఁ దిరంబుగ మంచు దోఁచెను
డంబుగాఁ జిగురాకుగమి పగడంబుఛాయలు గాంచి మించెను
గంబుకంఠిరో మెఱసి యీకనకంబు వలపులు గ్రుమ్మరించెను
రాఁగతనమున నొరులవిరులకు రాఁ గడంగిన నేనె రాఁగల
రేఁగఁదోలకు రేఁగులను జెలరేఁగ మూఁగిన తేనెయీఁగలఁ
గందకున్నది సిరులతో మాకందబృందము కుసుమపుంజము
మందయానరో చూడఁదగు సుషమం దనర్చె లతానికుంజము.

కం. అనుచుం జెలు లిచ్చనసల్
గొనుచున్ వనవీథిఁ గుసుమకోమలి దరియం
జనుచున్ వలరాయనికృపఁ
గనుచుండఁగ నంతఁ జైత్రుగర్వము సడలెన్. 83

వ. అన విని శారిక శుకంబు నవలోకించి ప్రశంసించి యనంతర
వృత్తాంతం బెఱింగించు మనుటయు. 84

మ. పృథివీభృద్వరధీర ధీరజనతాభిస్తుత్యవాక్సత్య స
త్పథసాంతత్యవిహార హారధరణీధ్రప్రాభవోద్యద్యశః
ప్రథమాలంకృతసార సారసముఖీప్రత్యగ్రసంభూత మ
న్మథసన్మూర్త్యవతార తారకనిధానధ్యానచిత్తాంబుజా. 85

కం. సింధురసైంధవవైభవ
బంధుర శ్రీవైష్ణవప్రబంధాంకిత చి
ద్గ్రంథరసాదరనీతియు
గంధరనిభమంత్రివర్య కల్పితకార్యా. 86

పృథ్వీవృత్తము.

ధరాచరణనూపురస్థగితరత్నరుక్పీఠికా
పురీవరణవైభవస్ఫుటనికేతనాకేతన
స్ఫురన్నిజచమూపరక్షుభితభూసురోద్యద్ధరా
పరాగపిహితాత్రిసంభరితశత్రుకాంతాననా. 87

గద్యము.

ఇది శ్రీవక్కలంక చంద్రశేఖరమహాకవి పౌత్ర భాస్కరసుకవిపుత్ర
విద్వజ్జనవిధేయ వీరభద్రనామధేయ విరచితం
బైన వాసవదత్తాపరిణయం
బను మహాప్రబంధంబు నందు
ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు

# వాసవదత్తాపరిణయము

## తృతీయాశ్వాసము




యుతవైభవ హిందూ
రాయసురత్రాణబిరుద రామానవరా
మేయనిభ పూర్ణిమాసో
మాయితరుచిగేయ రావు మాధవరాయా ! 1

వ. అవధరింపు మనంతరకథావిధానంబు శుకంబు శారికతో నిట్లనియె.

కం. వన్యావిహారమున న
కన్యామణు లలసి వేఁకన్ జలకేళీ
మాన్యమతి నుండఁగాఁ బద
విన్యాస మొనర్చె భువిని వేసవి యంతన్.

శా. ప్రచ్ఛాయస్థలపల్లవాస్తరణనిద్రాయోగ్యముల్ పాటలీ
గుచ్ఛాకల్పమరున్మనోజ్ఞతరముల్ కూలంకషాభ్యంతర
స్వచ్ఛాంభఃపరివేషణార్హములు పశ్చాద్భాగసౌభాగ్యముల్
స్వచ్ఛందస్థితి గ్రీష్మవాసరము లెంచం దెల్పి గాంచెన్ ధరన్. 4

సీ. వనముల దావపావకభూతి గనిపించెఁ
బాటలముకుళవైభవము మించెఁ
బడమటిసుడిగాలి వడివడి నడతెంచె
మదనుతూపులయేపు గొదవగాంచె

శ్రీరస్తు

# వాసవదత్తాపరిణయము

## తృతీయాశ్వాసము



యుతవైభవ హిందూ
రాయసురత్రాణబిరుద రామానవరా
మేయనిభ పూర్ణిమాసో
మాయితరుచిగేయ రావు మాధవరాయా! 1

వ. అవధరింపు మనంతరకథావిధానంబు శుకంబు శారికతో నిట్లనియె.

కం. వన్యావిహారమున న
కన్యామణు లలసి వేఁడుకన్ జలకేళీ
మాన్యమతి నుండఁగాఁ బద
విన్యాస మొనర్చె భువిని వేసవి యంతన్. 3

శా. ప్రచ్ఛాయస్థలపల్లవాస్తరణనిద్రాయోగ్యముల్ పాటలీ
గుచ్ఛాకల్పమరున్మనోజ్ఞతరముల్ కూలంకషాభ్యంతర
స్వచ్ఛాంభఃపరివేషణార్హములు పశ్చాద్భాగసౌభాగ్యముల్
స్వచ్ఛందస్థితి గ్రీష్మవాసరము లెంచం దెల్పి గాంచెన్ ధరన్. 4

సీ. వనముల దావపావకభూతి గనిపించెఁ
బాటలముకుళవైభవము మించెఁ
బడమటిసుడిగాలి వడివడి నడతెంచె
మదనుతూపులయేపు కొదవగాంచె

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

అధ్యక్షులు
విమర్శకాగ్రేసర. ఐతిహాసిక సమ్రాట్టు
శ్రీ బండారు తమ్మయ్య

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి
శ్రీ దంటు భాస్కరరావు

సహాయ
దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహకవర్గ సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ.
7. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
8. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు
9. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.
10. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, ఎమ్. ఏ. (ఆనర్సు)
11. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
12. శ్రీ కావలి శ్రీరామమూర్తి, బి. ఏ. బి ఎల్.

పత్రికా సంపాదకుడు
శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

5వ సంపుటము రు. 15—00

6వ సంపుటము 15—00

7వ సంపుటము 15—00

1—4 సంపుటములు పునర్ముద్రణములు గావింపబడుచున్నవి.

ప్రతియొక్కటికి వెల రు 15 లు

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనుకటి విషయసూచికయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణ పీఠికతో ముద్రితమైనది వెల రు 1—50.

## మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము మూల్యము రు. 2—50

ఆంధ్రసాహిత్యపరిషత్తు,

కాకినాడ.

## స్మారకసంచిక

చందాదారులకు గాక యితరులకు వెల 6—0—0.

Printed by J. Gopalam, B.A. L.T., at Republic Press, Kakinad

Edited by **K. ISWARADUTT**

Published by Andhra Sahitya Parishat, Kakinada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

Journal of the Telugu Academy

**KAKINADA.**



దేశభాషలందుఁ దెలుగులెస్స

సంపుటము ౫౨ సంచికలు 3-౪

Vol. 52 Parts III & IV

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు :

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు :

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు



# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**
**KAKINADA.**

సంవత్సరము చందా రు 3-0-0.

సంపుటము ౫౨ శోభకృత్ సంచికలు ౩-౪

Vol. 52 ఆశ్వయుజ—పుష్యములు Parts III & IV

విషయసూచిక

# స్వ వి ష య ము

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక 52 వ సంపుటము 3-4 సంచికలు ప్రకటించు పని పూర్తిచేయుచుండఁగా, ఆంధ్రసాహిత్యపరిషత్తునకు యావజ్జీవాధ్యక్షులు, ఆంధ్రభోజులు, సంస్కృతాంధ్రకవిపండితపోష కులు ఆంధ్రసాహిత్యపరిషత్సర్వస్వము అయిన శ్రీ రావు వేంకట కుమారమహీపతి సూర్యరాయప్రభువర్యులు నడుమలో కీర్తిశేషు లగుట సంభవించినది. ఆంధ్రసాహిత్యపరిషత్పక్షమున వెలువడుచు కొలఁది యక్షరములలో కొఱవడియున్న శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మా ణము శ్రీ సూర్యరాయప్రభువర్యుల యౌదార్యమునకు నిదానము. ఈవిధముగ ఆంధ్రసాహిత్యపరిషత్తు అవతరించినది మొదలు నేఁటి వఱకు నీపరిషదభ్యుదయమునకు గ్రాంథికభాష నిలిచియుండుటకుఁదమ సర్వస్వమును వెచ్చించి శాశ్వతకీర్తి నార్జించుకొని యున్న ఆ ప్రభు వర్యులయెడఁ దమకుఁ గల కృతజ్ఞతను తెలుపుకొనుటకై ఆంధ్రసాహి త్యపరిషత్కార్యనిర్వాహకవర్గము వారు ప్రత్యేకముగ నొక స్మారక సంచికను దీనితోఁగలిపి ప్రచురింపఁదలఁచియున్నారు. కాని ప్రముఖ వ్యాసకర్తలనుండి వ్యాసములు చేరుటలో మఱికొంత విలంబముకానై యుండుటచే, ఈసంపుటము నింతటితో ముగించి, తరువాతి సంచిక లను స్మారకసంచికనుగా వెలువరింపఁదలఁచి యుంటిమని పాఠకులకు నివేదనము. ప్రసిద్ధులయిన వ్యాసరచయితలు తమ కభీష్టమయిన విష యమున వ్యాసములు రచించి పంపి, పరిషత్పక్షమున వెలువడు శ్రీ సూర్యరాయ ప్రభువర్య స్మారకసంచికను సర్వాంగసంపూర్ణముఁ గావింప వేఁడికోలు.

ఇట్లు వినివేదించు విధేయుఁడు,

సంపాదకుఁడు.

## కీ. శే. శ్రీ పిఠాపురము మహారాజావారు

### (శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరుగారు)

(బండారు తమ్మయ్య, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శి (కరణము?) — బండారు తమ్మయ్య, ఆంధ్రసాహిత్యపరిషద్వ్యక్షుఁడు)

తెలుఁగు దేశమందలి జమీందారీలలో పిఠాపురము, వేంకటగిరి, బొబ్బిలి, విజయనగరము, విశ్వవిఖ్యాతిచెందినవనుట సుప్రసిద్ధము. వీనిలో పిఠాపురము జమీందారీకిఁ దండ్రి శ్రీరావు గంగాధర రామారావుగారి నిర్యాణానంతరము, మయినారిటీ వదలినతరువాత, 1906 సంవత్సర ప్రాంతమున శ్రీ సూర్యరావుగారు పట్టాభిషిక్తులయిరి. గంగాధర రామారావుగారు ప్రజారంజనమునకు వదాన్యతకుఁ బేరుమోసినవారు. తూర్పుగోదావరిజిల్లాకుఁ బ్రధాన నగరమయిన కాకినాడ యీపిఠాపురము జమీందారీలోనిదే. ఇది పిఠాపురమునకుఁ బదిమైళ్లు దూరములోనుండి పిఠాపురముతో బహువిధముల నవినాభావసంబంధము గలిగియున్నది. పిఠాపురము రాజుల వదాన్యతకు, భాషాపోషణాదిక సత్కార్యములకు, సంస్థలకుఁ దావలములయిన కట్టడములు పిఠాపురములోకన్న, కాకినాడయందే యెక్కువగ నెలకొనియుండుట గమనింపఁదగినది. వీనిలో అనాథశరణాలయము (Orphanage), బ్రహ్మోపాసనా మందిరము, పిఠాపురము రాజాకళాశాల, ముఖ్యముగాఁ బేర్కొనఁదగినవి. అనాథశరణాలయము స్థాపితమయినది శ్రీ గంగాధర రామారావుగారి కాలముననే యని తెలియుచున్నది. తరువాత శ్రీ సూర్యరావుగారు దానిని వృద్ధిపఱచిరి. కళాశాలగూడ మొదట రెండవ తరగతి కాలేజీగా నుండినపుడు గంగాధర రామారావుగారి కాలముననే స్థాపిత మయియుండెను. అనంతర మది శ్రీ సూర్యరావుగారి పాలనమున నభివృద్ధిగాంచి First Grade College గాఁ బరిణతమయి ఆంధ్రదేశమందలి కళాశాలలో నున్నతస్థాన మలంకరించినది. అన్నదానసమాజ స్థాపనమునకును వీరే కారకులు.

శ్రీ సూర్యరావు బహద్దరుగారి యందు జనకుల వదాన్యత

వంశానుగతముగ సంక్రమించి, బహువిధముల వికాసము నొంది, జగ జ్జేగీయమానమైన దనుట పలువురకుఁ దెలిసిన విషయము. శ్రీ సూర్యా రావుగారి పాలన మారంభమయిన యయిదాఱు సంవత్సరముల కే యనఁగా 1911 సంవత్సరములో దేశమున భాషావిషయకముగ గ్రాంథిక వ్యావహారిక భాషాసమరరూపమున నొకవిషమ సంఘటన మేర్పడినది. వ్యావహారిక భాష, దానికి సన్నిహితమయిన గ్రామ్యము (వ్యాకరణ విరుద్ధభాష) కేవలము జనుల వ్యవహారముననే గాక యున్నత పాఠశాలా కళాశాలా విద్యార్థులకుఁ బ్రభుత్వమువారు నిర్ణ యించు పాఠ్యగ్రంథములందుఁ గూడఁ బ్రవేశము నొంది పాటింపఁ దగుననెడి వితండవాదమును దెచ్చిపెట్టి, పర్లాకిమిడి కళాశాలలోఁ జరిత్రోపన్యాసకులుగా నుండిన శ్రీ రావుసాహెబు గిడుగు రామ మూర్తిపంతులుగారు, విజయనగరము సంస్థానము కొలువునందుండిన గురజాడ అప్పారావుగారు (కన్యాశుల్క నాటకకర్త) మున్నగు వారు, వారి యనుచరులు దేశమును గగ్గోలు పఱిచి, ప్రభుత్వాధి కారుల ప్రాపునుగూడఁ గొంత వడసి, ఆంధ్రభాషాసుస్థితికి ఘోర వ్యాఘాత మొనరింప నడుముగట్టిరి. అప్పుడు రాజధానీనగరమగు మదరాసులో దైవవశమున ఆంధ్రభాషాభిమానులు, సరసతర పాండితీ సంపన్నులు నగు శ్రీ జయంతి రామయ్యపంతులు B. A. B. L గారు Presidency Magistrate పదవియందుండిరి. వారు వ్యావహారిక భాషావాదమును బ్రతిఘటించి తమ పలుకుబడిని వినియోగించి, గ్రాంథికభాషా సంరక్షణమునకయి యొక శాశ్వతసంస్థను నెలకొలు పుట యత్యావశ్యకమని గ్రహించి, యందుకయి పిఠాపురము మహా రాజావారయిన శ్రీ సూర్యరావుగారితో సంప్రతించి వారిని బ్రోత్స హించి, వారి యండచే 1911 సంవత్సరముననే మొదట మదరాసు నందే, ఆంధ్రసాహిత్య పరిషన్నామక సంస్థను స్థాపించి దాని యాజ మాన్యమునఁ బరిషదాశయములఁ బ్రకటించి గ్రాంథికభాషా సంరక్షణ

మొనర్చుటకయి యొక పత్రికనుగూడ నెలకొలిపి బహువిధముల భాషాపోషణమునకుఁ బూనుకొనిరి, ఆనాఁడీయిరువురు మహనీయులు నొనర్చిన యీ ఘనకార్యము మూలముననే ప్రభుత్వదృష్టిలో వ్యావహారికభాషావాద మాదరణ మొందక వీఁగిపోయినది. కాఁగా నీ భాషాసంస్థకు శ్రీ పిఠాపురము మహారాజావారే ప్రధాన ప్రతిష్ఠాపకులుగా నేర్పడి యందుకయి తమ సహజవదాన్యత కనుగుణముగ విశేషవిరాళ మొసంగిరి. శ్రీ వేంకటగిరిరాజుగారు, వెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్రులవారు, బొబ్బిలి మహారాజు శ్రీ రావు వేంకటశ్వేతాచలపతిరంగారావు బహద్దరుగారు గూడ నీ సదుద్యమునకుఁ దోడ్పడి శ్రీ పిఠాపురము మహారాజుగారి ననుసరించిరి. ఈ ముగ్వురు జమీందారు లానాఁ డొసంగిన విరాళముల మొత్తమే నేఁటికిఁ బరిషత్తునకు మూలధన మయినది. అందుపైఁ బ్రభుత్వమువారి పత్రముల మీఁద వచ్చు వడ్డియే పరిషత్తు నిలుకడకుఁ బ్రధానమయిన వార్షికాదాయముగ నేర్పడినది.

పరిషత్సంస్థాపన సమయమందే ఆంధ్రభాష కొకసమగ్రమయిన నిఘంటువునుగూడ నిర్మాణమొనరించుట యవసరమని తీ[illegible]ంచిన పుడుశ్రీసూర్యరావుగారుపూనుకొని యందులకు వలయు వ్యయమెల్లఁ దామొకరే వహింపఁగలమని ప్రకటించిరి. వారియీ మహోత్తమ సంకల్ప ఫలితముగనే సూర్యరాయాంధ్రనిఘంటు వను పేరితో, 'అ' కారము మొదలు 'వ' కారము చివరవఱకుఁ గల వర్ణసమామ్నాయమందలి పదములకు సంబంధించిన 6 సంపుటములు పరిషత్పక్షమునఁ బండితవర్గముచేఁ గూర్పఁబడి వెలువడి శ్రీ మహారాజావారి కీర్తికి విజయ స్తంభముగ విరాజిల్లుచున్నవి. శ, ష, స, హ యను నాలుగక్షరములకు సంబంధించిన నిఘంటువు 7వ సంపుటమున తుదిగాఁ బ్రకటనమును నిరీక్షించుచున్నది. అది వెలువడక ముందే ఆంధ్రభోజుఁడు, దానశూరుఁడు నని ప్రఖ్యాతి నందిన శ్రీ సూర్యరావు బహద్దరువారు

శోభకృన్నామ సంవత్సర ఫాల్గుణ బహుళ అష్టమీ శుక్రవారము (ది 6—3—64) దివంగతులగుట విషాద సంఘటన మేర్పడినది. దైవ దుర్విపాకమునఁ గొన్ని సంవత్సరములనుండి శ్రీ మహారాజుగారు పక్ష వాతరోగపీడితులయి యుండుటవలనను, జమీందారీ లెల్ల రద్దయి ఆంధ్రప్రభుత్వము వారి వశమయిన కారణమునను రాబడి తగ్గిపోయి నందునఁ బరిషదాశయ నిర్వహణమునకయి మునుపటివలె మహారాజు గారు సహకరింపఁజాలకుండిరి. నిర్యాణ సమయమునకు వారించుమించుగ నెనుబది సంవత్సరముల వయస్సు కలిగి చిరకాలము జీవించిన మహాపురుషులుగనే గణింపఁదగియున్నారు. వారి నిర్యాణమువలన ముఖ్యముగా పరిషత్తునకుఁ దీఱని యపారనష్టము ఘటిల్లినదని చెప్ప నవసరములేదు. అది పరిషత్తుయొక్క దురదృష్టము.

పరిషత్తు నెలకొలిపిన కొలఁదికాలముననే మహారాజావారి సహకారముతో దేశము నలుమూలలకుఁ బండితుల బంపి పరిషత్తు వారు పరిషద్భాండారమునకయి యసంఖ్యాకములగు తాళపత్రగ్రంథములను ముద్రిత గ్రంథములను సేకరించిరి. అవి పరిషత్తున కమూల్యాలంకారములయి పరిషత్కార్యాలయమునఁ బ్రకాశించుచున్నవి. శ్రీ మహారాజావారు భాషాపోషణమునకు, కవిపండిత సన్మానములకు, కాకినాడలోని అనాథశరణాలయ, బ్రహ్మసమాజమందిరముల నిలుకడకు వెచ్చించిన ధన మపారము. గణింపరానిది. విదేశములకేఁగి యున్నత విద్యా సముపార్జన మొనరించు విద్యార్థుల కెందఱకో యార్థికసాహాయ్య మొనరించి వారి యభీష్టసిద్ధికిఁ దోడ్పడిరి. చాల వత్సరములు దసరాపండువు దినములలోఁ బిఠాపురమునఁ బండితపరిషత్తు నెలకొలిపి యేటేట వేదశాస్త్రపండితులకుఁ బరీక్షల నేర్పఱిచి వారిని సముచితముగ సన్మానించుచుండిరి. తండ్రిగారి కాలమునుండియు సంస్థానము నలంకరించిన దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, వేంకటకృష్ణశాస్త్రి కవివర్యుల నాదరించి వారివలనఁ గొన్ని కృతులఁ గూడ

గ్రహించిరి. ఆర్యసామాజికులు, పండితకవులు నగు ఆదిపూడి సోమ నాథరావు గారిని గూడ నాదరించి వారి కృతులగూడఁ గొన్నిటి స్వీక రించిరి. వైణిక శ్రేష్ఠు లయిన శ్రీ తుమురాడ సంగమేశ్వర శాస్త్రిగారిని బోషించి సాహిత్యముతోపాటు సంగీతకళనుగూడఁ బ్రోత్సహించిరి. కలకత్తాలో శాంతినికేతనము విశ్వభారతి స్థాపించిన రవీంద్రనాథ ఠాగూరు కవిసార్వభౌమునిఁ దమ సంస్థానమున కాహ్వానించి వారిని విశేషముగ సత్కరించిరి. బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నమునాయఁడు గారికి, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారికి వలయు సాహాయ్య మొసంగి పలువిధములఁ దోడ్పడుచుండిరి. వేంకటరామకృష్ణ కవులను (వేదుల రామకృష్ణశాస్త్రి, ఓలేటి వేంకటరామశాస్త్రి అను కవిద్వ యము) తమ యాస్థానకవీశ్వరులుగా గ్రహించి పోషించిరి. వారును వేంకటరామకృష్ణ గ్రంథమాలిక నెలకొలిపి దానిలోఁ గొన్ని గ్రంథ ములఁ బ్రచురించుటయేగాక "కవిత" యను మాసపత్రికనుగూడ నిర్వ హించి సముచితముగ భాషాసేవ గావించిరి. రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు రాజమహేంద్రవరములో స్థాపించినవితం తుశరణాలయమునకు, ఉన్నత పాఠశాలకు పుస్తకభాండాగారమునకుఁ గూడమహారాజుగారు విశేషముగ సాయపడుచుండిరి పంతులుగారును కృతజ్ఞతాపూర్వకముగఁ దమ యాంధ్రకవుల చరిత్ర పునర్ముద్రణము యొక్క ప్రథమ సంపుటమును మహారాజావారికే యంకిత మొసంగి వారికీర్తిని స్థిరస్థాయి గావించిరి.

మఱియు మహారాజావారు కవిపండిత సమ్మానములతోపాటు పెక్కుగ్రంథముల ప్రకాశమునకుఁ గూడ నెన్నియోవిధములఁ దమ ధనమును వినియోగించుచుండిరి. వారు బహుగ్రంథ ద్రష్టలు, సం స్కృతాంధ్రము లందును, ఆంగ్లభాషయందును నిరంతరము బహు గ్రంథ పఠన మొనర్చుచుఁ గాలక్షేపము చేయుచుండెడివారు. ఆంగ్ల మున ధారాళముగ నుపన్యసించు వక్తృత్వశక్తినిగూడఁ గలిగియుం

డిరి. ఇట్లు కేవలగ్రంథపఠన, పరిశోధనములతోఁ దృప్తినొందక పండిత ప్రకాండులచే నుత్తమగ్రంథముల వ్రాయించియుఁ బరిష్కరింపించియు వానినిఁ బ్రకాశమునకుఁ దెచ్చుచుండిరి. కొన్ని దృష్టాంతములఁ జేర్కొనుచున్నాను.

శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారిచే పింగళిసూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమునకు లఘుటీక వ్రాయించుటయేగాక, శంకరాచార్యుని బ్రహ్మసూత్రభాష్యమునకు వారిచే నాంధ్రానువాదమును జేయించి ప్రకటించిరి. ఈదరపల్లి భవానీశంకరకవి విరచిత ధర్మఖండమును నడకుదుటి వీరరాజుగారిచేఁ బరిష్కరింపించి ప్రకటించిరి. పింగళి సూరనామాత్యుని కళాపూర్ణోదయ మహాకావ్యమునకు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, వేకుమళ్ల అచ్యుతరావుగారు తమతమ పరిష్కరణములతోఁ బాఠభేదములతో వెలువరించిన ప్రతులను ముద్రింపించి ప్రకటించిరి. రావు సర్వజ్ఞసింగభూపాలుఁడు సంస్కృతమున రచించిన రత్నపాంచాలికానామక నాటకము యొక్క మూలమును బ్రకటించుటయే గాక దానికి మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, గిడుగు సీతాపతిగారు గావించిన యాంధ్రానువాదములఁగూడ ముద్రింపించి ప్రకటించిరి. ఇట్టులనన్యసామాన్యమయిన భాషాసేవ గావించిన ప్రముఖులు నేఁటి రాజమండలిలో మఱెవరును గానరారు.

దేశమం దంతట, ఆంధ్రభోజుఁ డని వినుతి కెక్కిన యీ దానశూరుఁడు, భాషాపోషకుఁడు, కృతిభర్త, ఆంధ్రసూర్యుఁడు అస్తమించుటవలన, ఆంధ్రదేశ మంతయు నంధతమసావృతమయిన దనుట యతిశయోక్తి కానేరదు. ఏవంవిధగుణవిశిష్టుఁ డయిన యీ మహోత్కృష్ట మహాపురుషుని యాత్మకు శాశ్వతానంద సౌఖ్యములఁ బ్రసాదించుఁ గావుతమని పరమేశ్వరునిఁ బ్రార్థించుచున్నాను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# శ్రీ కాళిదాస మహాకవి - శ్రౌతపజ్ఞానము

శ్రీ విద్వాన్ ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రి

శ్రీ కాళిదాస మహాకవి కావ్యతపోవనము పుణ్యతపోవనము వలె దర్శపౌర్ణమాసేష్ట్యాదుల పవిత్రాజ్యధూమములచేనావృతమై, పురోడాశాజ్యాద్యాహుతుల యామోదములచే నాశ్రమోన్ముఖులైన యతిథుల యంతరంగముల నలరింపఁజేయుచు, వారిని బవిత్రీకరింపఁ జేయుచుండును. ♦ కనుక నొక్కసారి మన మా మహాకవి కావ్యతపోవనములోఁ బ్రవేశించి, యచటి* శ్రౌతక్రియల నవలోకించుటచే మన మనశ్శరీరములను మహితామోదభరితములఁ గావించుకొనుచు నట ముఖ్యములైన కొన్ని శ్రౌతసంప్రదాయ దివ్యసౌరభముల నాఘ్రాణింతము.

ఈ మహాకవి సమయము దొరకినప్పుడెల్లఁ దన శ్రౌతపాండిత్యిని ఒక చిన్నవిశేషణముచేతనో, లేక యొక యుపమానముచేతనో తెలుపుచునే యుండును.

దిలీప మహారాజు సుదక్షిణాదేవితోఁ గూడి తన కులగురుఁడైన వసిష్ఠమహర్షి యాశ్రమముఁ జేరుసమయమునకు అత్తపోవన మారాజేంద్రున కిట్లగపడుచున్నది

"వనాంతరా దుపావృత్తై స్సమిత్కుశఫలాహరైః
పూర్యమాణమదృశ్యాగ్ని ప్రత్యుద్యాతై స్తపస్విభిః॥

(రఘువంశము సర్గ. 1 శ్లో. 49)

వసిష్ఠాశ్రమములోని మునులు ఇంకొక వనములోనికి వెళ్ళి తిరిగి తమ గృహములను జేరునపుడు వారు వారి యజ్ఞపురుషునకు సమిధలను, దర్భలను, ఫలములను దెచ్చుచున్నారు.

♦ "అభ్యుత్థితాగ్నిపిశునైరతిథీనాశ్రమోన్ముఖాన్
పునానం పవనోద్ధూతైర్ధూమైరాహుతిగంధిభిః"॥

(రఘువంశము. శ్లో 53 సర్గ 1)

* శ్రుతిసంబంధమైనవే శ్రౌతక్రియలు.

ఇట్లు సమిత్కుశఫలపాణులై వచ్చిన యచ్చటి తాపసులకు (యజమానులకు) వారి యగ్నులు అదృశ్యరూపములో వచ్చి, వచ్చిన యజమానుల కెదురుగ వచ్చుచున్నవి. ఇట్టి మునులచే నాయాశ్రమము నిండియున్నది.

ఇట "అదృశ్యాఽగ్నిప్రత్యుద్యాతైః .." అను శ్లోక విశేషణప్రయోగముచే మన కాళిదాసస్వామి ఇట నొకయద్భుత శ్రౌతసంప్రదాయమును దెలుపనెంచినాఁడు. తిలకింపుఁడు. "ఆహితాగ్నులు ప్రవాసమునుండి తిరిగి తమ యగ్నుల సన్నిధిఁ జేరునపుడు సమిధలను దేవలెను." అను సంప్రదాయసందర్భములో

"సమిధః కృత్వా ప్రత్యేతి"

అను శ్రౌతసూత్రమునకు సద్దాని వ్యాఖ్యలో నిట్లున్నది.

"యథాహవా ఇతం* పితరం ప్రోషివాసం పుత్రాః ప్రత్యాధావంతి, వాహరన్నేతి య దైవతత్పుత్రేభ్య ఆహరన్నేతి తాహృక్తదితి విజ్ఞాయతే॥" (చూ. ఆపస్తంబ శ్రౌతసూత్రము. 6వ ప్రశ్న 7వ పటలము 4-13-1400).

"గ్రామాంతరమునుండి తండ్రి యింటికి వచ్చినపుడు అతని పుత్రులు తమకుఁ దన తండ్రి భక్ష్యములను దెచ్చియుండుననునాసతో తండ్రి కెదురుగ పర్వెత్తి వచ్చెదరు. ఈవిధముగనే ప్రవాసమునుండి తిరిగివచ్చిన మునులకు పుత్రస్థానీయములైన వారి యగ్నులు, యజమానులు తమకు భక్ష్యస్థానీయములైన సమిధలను దెచ్చియుందురని యదృశ్యరూపములో నెదురువచ్చుచుండును. కనుక ప్రవాసాగతులైన యాహితాగ్నులు తమ యగ్నులకొఱకు సమిధలను దేవలెను." మన శ్రౌతకవి పైశ్రౌతసూత్రములోని సముజ్జ్వల సంప్రదాయమును బాగుగ నెఱింగినవాడు కనుకనే ప్రవాసాగతు

* ఇతం = తిరిగివచ్చిన

లైన వసిష్ఠాశ్రమ వాసులైన మునులచేత "సమిత్కుశ ఫలాహరైః" అని సమిధలనే మొట్టమొదట చేతఁ బట్టించి, తన శ్రౌతసాహితిని జాటినాఁడు. శ్రీ మల్లినాథ సూరి పైశ్లోక (సర్గ 1 శ్లో 49) వ్యాఖ్యలో పై శ్రౌతవిషయమును "ప్రోష్య ఆగచ్ఛతా మా హితాగ్నీనామగ్ని పరిత్యుద్యానం శ్రుతిప్రసిద్ధ మేవ" అని ప్రవాసాగతులైన మును లకు వారి యగ్నులు ఎదురేఁగుట శ్రుతి• (శ్రౌత) ప్రసిద్ధమైనదే యని తెలిపినాఁడు. శ్రీ కాళిదాస కవీంద్రుని భవ్యభావరత్నముల కాంతులను బ్రపంచమున కగఁబఱచిన పున్నె మీసూరి సుజనునిదే కదా !♦

ఇట పై శ్రౌతసంప్రదాయము కొంత వివరముగఁ దెలియఁ నగినది.

ఆహితాగ్ని తన యింటినుండి మఱియొక గ్రామమునకు వెళ్ళు నపుడు తన అగ్నిసన్నిధిఁ జేరి అతఁడు ప్రవాసోపస్థానమంత్రములను బఠింపవలెను * వెళ్ళునపుడు యజమాని తన ఊరి పొలిమేరవఱకు నెవ్వరితోడను మాట్లాడక వాచంయముండై యుండవలెను. తిరిగి వచ్చునపుడు సమిధలను దేవలెను. (సమిధః కృత్వా ప్రత్యేతి) వచ్చు నపుడు కూడ ఊరి పొలిమేరనుండి యగ్నిగృహముఁ జేరి, సమిధల నగ్నియందుంచి, ఆగతోపస్థాన మంత్రములను బఠింపనిదే మఱెవ్వరి

♦ శ్రుతివిహితమైనదే శ్రౌతతంత్రము. "భారతీ కాళిదాసస్యతు వ్యాఖ్యా విష మూర్ఛితా! ఏషా సంజీవినీ టీకా తామద్య జీవయిష్యతి"॥

* ప్రవాసమునకు వెళ్ళుచున్న ఆహితాగ్నులు ప్రవాసోపస్థానమంత్రములను అగ్ని సన్నిధిలోఁ బఠింపవలెను. అందలి "మమ నాను ప్రథమం......" అను మం త్రార్థమునుబట్టి, అగ్ని. ఆహితాగ్ని యొక్క పేరును, ఆహితాగ్ని అగ్ని పేరును ధరించెదరు. దీనిచే అగ్నిశరణములో ఆహితాగ్ని యున్నట్లగును. యజమానపత్ని అగ్నిని భద్రపఱుపవలెను.

(చూ. శ్రౌతసూత్రము. 6వ ప్రశ్న. 24 ఖండిక 7 వ సూత్రము.)

తోడను మాట్లాడరాదు. ఇట్లు ప్రవాసమునుండి వచ్చిన యజమాను లకుఁ బూర్వోక్త రీతిని అగ్నులు అదృశ్యరూపములో నెదురు వచ్చును. ఇట్లగ్ను లెదురువచ్చుచున్న కారణముచేతనే యజమానులు తదాహారస్థానీయము లైన సమిధలను దేవలెనని శ్రౌతసూత్రము నిర్దేశించినది. ఇట్టి శ్రౌతసూత్రార్థములను బరిపూర్ణముగ దెలిసి యున్నవాఁడు కనుకనే మన మహాకవి "......సమిత్కుశ ఫలాహార్తైః......" అనియు "......అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః ....." అనియు నొక్కొక్క విశేషణముచేతనే పై శ్రౌతసంప్రదాయ రహస్యములను జక్కగ సూచింపఁగల్గినాఁడు. ఇట్టివే మఱికొన్ని విశిష్టవిషయముల నిట స్థాలీపులాకన్యాయముగ గన్గొందము. ఈకవి "ఆహితాగ్ని" శబ్దార్థమును గూర్చి దిలీప మహారాజుచే "......గురోరపీదం ధన మాహితాగ్నేర్నశ్యత్పురస్తాదనుపేక్షణీయం."(చూ. రఘువంశము. సర్గ 2 శ్లో 44).

ఇట "ఆహితాగ్ని" శబ్దార్థము తెలియుటకై తత్పూర్వవిషయము కొంత తెలియఁదగియున్నది.

"ఆహితాగ్ని" యగుటకు ముందు "ఆధానము" చేయవలెను. ఈ "ఆధానము"లో అగ్నులు స్థాపించుచోట ముందుగా జమ్మి (శమి) మోదుగ(పలాశము) రావి(అశ్వత్థము) వైకంకతము(ముళ్ళ చెట్టు) మొదలగు చెట్లయొక్క సప్త(7)శాఖల నుంచెదరు. ఈశాఖలు అగ్నికిఁ బ్రియస్థానములై యున్నట్లు శ్రుతిప్రమాణము లిట్లగఁబడుచున్నవి.

శమి:— శమీగర్భాదగ్నిం మంథతి। ఏషావా అగ్నేర్యజ్ఞియా తనూః॥ (తైత్తిరీయ బ్రాహ్మణము 1-8-65.)

జమ్మి యజ్ఞసంబంధమగు నగ్నికి యజ్ఞాంగములలో ముఖ్యమైన శరీరస్థానీయము. ఈశ్రుత్యర్థమునే మన కాళిదాస కవిసోమ

యాజి తన శాకుంతల నాటకమున, శకుంతల గర్భము ధరించినదని ఆకాశవాణి కణ్వర్షికిఁ దెలుపు సందర్భమున—

"దుష్యంతేనా హితం తేజో ధాధానాం భూతయే భువః
అవేహి తనయాం బ్రహ్మన్నగ్ని గర్భాం శమీ మివ॥"

ఇవి ఆకాశవాణి భాషితములు. ఓ బ్రహ్మర్షీ! దుష్యంత నిషిక్తమైన తేజమును లోకకల్యాణార్థమై ధరించిన నీపుత్రికను అగ్ని గర్భమున ధరించిన జమ్మివంటి దానినిగాఁ దెలిసికొనుము. ఇట ఒక విశేషము కలదు. జమ్మిచెట్టులో మొలిచిన రావిచెట్టు కఱ్ఱనుండియే అగ్నిని మథించెదరు. ఇందుకు కృష్ణయజుర్వేదమంత్రము లివి.

"......అశ్వత్థాద్ధవ్యవాహాద్ధిజాతాం। అగ్నే స్తనూం యజ్ఞియాం సంభరామి। శాంతయోనిగ్ం శమీగర్భం। అగ్నయే ప్రజనయితవే। యో అశ్వత్థశ్శమీగర్భః......"

రావిలో అగ్ని యున్నదనుటకు శ్రుతిప్రమాణము లివి.

"అశ్వో రూపం కృత్వా సాశ్వత్థే సంవత్సరమతిష్ఠత్ తదశ్వత్థ స్యాశ్వత్థత్వం......" తైత్తిరీయ బ్రాహ్మణము (1-22).

అగ్ని అశ్వరూపముతో నొకసంవత్సరకాలము అశ్వత్థవృక్షములో నుండెను. కనుక రావికి "అశ్వత్థ" నామము (అశ్వరూపేణ తిష్ఠతి) సార్థకమైనది. కాఁగా పైశ్లోకములోని "......అగ్నిగర్భాం శమీం..." అనునప్పుడు "అశ్వత్థము గర్భమందు కల శమి" అనినచో సరిపడును.

"...అగ్ని గర్భాం .." అనుటచేత శకుంతలా గర్భమందున్నవాఁడు పురుషుఁడనియు, అతఁడు అగ్నివంటి పవిత్ర చరిత్రుఁడనియు, "అగ్ని రవమో దేవతానాం..." అను శ్రుతిప్రమాణముచే దేవతలలో అగ్ని మొట్టమొదటి వాఁడైన ట్లీ గర్భస్థపురుషుఁడు మహారాజులలో నగ్రగణ్యుఁడు కాఁగలఁడనియు, "భూతయే భువః"

అనుదానినిబట్టి భూమండలమున కంతకు నీ మహాపురుషుఁడు ఐశ్వర్య కారకుఁ డనియు (భరతుని పేరిట భరతభూమి ప్రపంచమునకే ఐశ్వర్యకారకమై యుండుట ఈశ్రుతి మహాకవియొక్క వాక్ప్రభావము చేతనే అనునట్లీ కవీశుని శాకుంతల కవిత కమనీయతఁ గాంచుచున్నది) ఇట్లెన్నియో ప్రయోజనము లిట సిద్ధించుచున్నవి.

"అగ్నిగర్భాం శమీం..." అనుటచే "శమి"వంటిది శకుంతలయైనచో నామె గర్భమందలి దుష్యంతుని తేజస్సు (రేతస్సు) అగ్ని వంటిదే కదా!

ఇందుకుఁ గూడ శ్రుతి యిట్లున్నది. "...సరేతా అగ్ని రాధేయ ఇత్యాహుః" "...సరేతసమేవాగ్ని మాధత్తే...." (తైత్తిరీయ బ్రాహ్మణము). ఈ కవీశుని భరతోత్పత్తి ప్రకారమును భావించినచో భారతజాతికి మూలకందమైన మన భరతుని (శాకుంతలుండు) యొక్క ఆజన్మవిశుద్ధత, పవిత్రత భారతజాతియం గూడ ప్రతిబింబితమైయుండకపోదని తెలియఁగలదు. ఇందు కనియేకాఁబోలు భరత జాతికి ప్రపంచమంతయు జోహార్లు చేయుచుండుటయు, ఈజాతి కేతుది విజయము కలుగుచుండుటయుఁ దటస్థించుచున్నది. దీనికి మూలకారణము, మనకు ఏకైకజాతీయ మహాకవియైన శ్రీ కాళిదాస కవీంద్రుని కవితా ప్రాభవము పెట్టిన స్వప్రతిభాభిక్షయే యని చెప్పవచ్చును. ఈవిషయములోని "సత్యత"ను ఈ కవీశుని రఘువంశకావ్యములోని "సోహమాజన్మ శుద్ధానాం... రఘూణామన్వయవక్ష్యే"అను నాద్యసర్గ గత శ్లోకము రుజువుచేయుచున్నది. ఇట్లు అగ్నికి శమియు, అశ్వత్థమును, బ్రియమైనట్లే మోదుగ (పలాశము) కూడ గాయత్రీ స్వరూపమగుటచేఁ బవిత్రస్థానీయమైనట్లు "గాయత్రో వైపర్ణః..." అను కృష్ణయజుర్వేదవాక్యము తెలుపుచున్నది. ఈ "పలాశము"నకు

పర్ణముA అను నామాంతరము కల్గుటకు ఒక చిన్నికథను ఈశ్రుతి వాక్య మిట్లు తెలుపుచున్నది. దాని భావ మిది.

"స్వర్గములో "సోమలత" అనునది కలదు. అద్దానిని గాయత్రీ దేవి స్వర్గమునుండి కొనివచ్చుచుండెను. ఆసమయమున ఆ లతయొక్క పత్రము తెగి క్రిందఁబడెను. ఆ పర్ణము (పత్రము) పలాశమయినది.♦ ఇట్టి పవిత్రపలాశదారువుతోఁ జేసిన యాహుతి సాధనములు♦ ఇష్టు లలో నుపయోగించిన యజమానికిఁ బాపశబ్దశ్రవణము తటస్థింపదని కూడ శ్రుతి* యిట్లు తేటతెల్లము సేయుచున్నది.

" .. యస్య పర్ణమయీ జుహూర్భవతి న పాపగ్గ్ శ్లోకగ్గ్ం శృణోతి॥" (బ్రాహ్మణము).

పైవిధముగ అగ్నికి ప్రియస్థానములైన శమ్యాది సప్తశాఖ లపై (వైకంకతము. మొ.) అగ్నిని ఆహితము (శ్రౌతతంత్రరీతిచే నగ్నిని ఉంచుట) చేయుటచేతనే, శ్రౌతసంప్రదాయోక్తరీతి నిట్లు చేసిన పురుషుఁడు "ఆహితాగ్ని" అనిపించుకొనును. (ఆహితాః అగ్న యః యాసు యేన) ఈ ఆహితాగ్ని దర్శేష్టిలో సాయందోహము, ప్రాతర్దోహము అనఁబడు హోమములను ఆవుపాలు ఆవుపెరుగు కలి పిన ద్రవ్యముతో (దీనినే "సాన్నాయ్యము" అందురు.) చేయవలెను. ఈవిధముగా గోపయస్సు ఆహితాగ్నికి ఇష్టులలో నతి ముఖ్యమైన ద్రవ్యము గాన ఇట్టి ముఖ్యద్రవ్యమునకు మూలాధారమైన గోవును

---

A "సోమం పర్ణస్సోమపర్ణాద్ధిజాతః ... " (బ్రాహ్మణములో

♦ "తృతీయస్యా మితో దివి సోమ ఆసీత్ తం గాయత్ర్యా హరత్ తస్య పర్ణమచ్ఛి ద్యత తత్పర్ణోఽభవత్ తత్పర్ణస్య పర్ణత్వం॥"

(చూ. కృష్ణయజుర్బ్రాహ్మణము)

♦ హోమసాధనముల పేర్లు కొన్ని "జుహూ" 1 "ఉపభృత్తు" 2 "ధ్రువ"

♦ యజ్ఞయాగాదుల నిర్వహణము చిత్తశుద్ధికరమై మోక్షమునకు మార్గదర్శకమగును.

(నందినీధేనువును) గూర్చిB ప్రస్తుతమున గోసేవాసంసక్తుఁ డైన దిలీప మహారాజుచే మన శ్రౌతకవి "...గురో రపీందం ధన మాహి తాగ్నే ర్నశ్యత్పురస్తాదనుపేక్షణీయం" అనిపించుట కాళిదాసుని శ్రౌతపాండితికి నిదర్శనము కాకమానునా? పైశ్లోకపాదములోని యేకైక విశేషణమే పైని పేర్కొనిన శ్రౌతరహస్యముల నన్నిటిని క్రోడీకరింపజాలియుండుట ఇట గమనార్హము. ఇక త్రేతాగ్నుల స్వరూప స్వభావాదులను గూర్చి కాళిదాస కవీంద్రుఁడు శాకుంతల ములో జూపిన రీతి అద్భుతమైనది.

కణ్వర్షి శకుంతలను అత్తవారింటికిఁ బంపుటకు ముందు ఆమెను, దన త్రేతాగ్ని గృహముAలోఁ దేత్రాగ్నుల సన్నిధిని ఆశీర్వదించు సందర్భమున, మన కాళిదాసర్షి కణ్వర్షి ముఖమున ఋక్ఛందస్సుతో శకుంతల ని ట్లాశీర్వదించును.

"అమీ వేదిం పరితః క్లుప్తధిష్ణ్యాః సమిద్వంతః ప్రాంతసం స్తీర్ణదర్భాః అపఘ్నంతో దురితం హవ్య గంధై ర్వైతానాస్త్వాం వహ్నయః పావయంతు॥ (చూ. శాకుంతల నాటకము 4 అంకము 9 శ్లో.)

పైశ్లోకములోని "వేది" "ప్రాంతసం స్తీర్ణదర్భలు" "ధిష్ణ్య" "హవ్యగంధములు" "వైతానాగ్నులు" వీనిని గుఱించి యిట ముఖ్యముగఁ దెలియదగియున్నది ఇందలి "వైతానాగ్నులు" అన్నదానికి యజ్ఞసంబంధము లైన యగ్నులు అని యర్థమున్నను ప్రకరణమును బట్టి "శ్రౌతాగ్నులు" అని యర్థము. వీనిని "త్రేతాగ్నులు" అందురు. ఈవిషయమే యీకవి తన రఘువంశములో రఘుమహారాజు

---

A "సత్వం ప్రశస్తే మహితే మదీయే వసన్ చతుర్థోగ్ని రివాగ్న్యగారే."
(చూ. రఘువంశము 5 సర్గ. 25 శ్లో)

B "తాం దేవతాపిత్రతిథిక్రియార్థా మన్వగ్య యౌ మధ్యమ లోకపాలః".
(చూ. రఘువంశము. సర్గ 2. శ్లో. 16.

కౌత్సమహర్షితోఁ బలుకు సందర్భములో "నా త్రేతాగ్ని గృహములో నీవు (కౌత్సుఁడు) నాల్గవయగ్నివలె రెండు మూఁడు రోజు లుండుము. నీగురుదక్షిణను సాధించి యిచ్చెద'' ననును. "సత్వం ప్రశస్తే మహితే మదీయే వసన్ చతుర్థోగ్ని రివాగ్న్యగారే ద్విత్రాణ్యహాన్యర్హసి సోఢు మర్హన్ యావద్యతే సాధయితుం త్వదర్థం.'' (సర్గ 5 శ్లో 25) ఇట్టి త్రేతాగ్నుల యాకృతి యిట్లుండును.

ఇందు 1, 2, 3 అంకెలు గల స్థానములలో త్రేతాగ్నులుండును. ఈ స్థానములను "అగ్న్యాయతనములు'' అందురు. 1 స్థానములో అగ్ని నిత్యముగా (విచ్ఛిన్నము కాకుండ) నుండవలెను. ఇక్కడ నుండియే 2, 3 లలోనికి అగ్నిని తీసికొనివెళ్ళి యుంచెదరు. 1, 2, 3ల క్రమమును గూర్చి ఈక్రింది యగ్నిస్తవము ఇట్లున్నది.

"నమస్తే గార్హపత్యాయ (1) నమస్తే దక్షిణాగ్నయే (2) నమ ఆహవనీయాయ (3) మహావేద్యై నమోనమః. స్వర్గాపవర్గరూపాయ కర్మ బహ్మస్వరూపిణే.......... యజ్ఞేశాయ నమోనమః.'' మూఁడవదియగు "ఆహవనీయ'' స్థానములో పురోడాశాదిహవిస్సులను హోమము చేయుటచే ఈ 3వదే దేవతలకు హవిస్సు లనందించునది. కనుకనే ఈస్థానమును గూర్చి శ్రుతి యిట్లు తెలుపుచున్నది.

"ఆహవనీయ, (3) స్సౌనసువర్గోలోకః...... ఈస్థానము* కూడ అగ్నియొక్క శరీరస్థానీయమగుటచేతనే పై స్తుతిశ్లోకములో "స్వర్గాపవర్గ+రూపాయ'' అనిస్వర్గప్రాప్తికి మోక్షప్రాప్తికి కారకుఁడైనట్లు వర్ణింపఁబడుటలో నెంతేని సత్యము కలదు.

ఇట్లు త్రేతాగ్నులు "వేది''కి మూఁడువైపులను నియమిత స్థానములలో నుండును. ఈ"వేది'' యాకారమును బాలకుల కందఱను బ్రత్యక్షీకరింపనెంచి యీ శ్రౌతకవి తన కుమారసంభవ

* మోక్షము.

కావ్యములో పార్వతీదేవియొక్క సన్నని నడుమును 'వేది'తోఁ బోల్చి యిట్లు చూపినాఁడు. "మధ్యేన సా వేదివిలగ్నమధ్యా .................." స్త్రీల నడుము ఇట్లు వేదియొక్క యాకారమును దాల్చియుండును. ఇట్టి "వేది"కి ప్రాగ్దక్షిణ ప్రతీచీ భాగములలో (3 నైపులను) అగ్నులుండుట ప్రత్యక్షమే. ఈ విషయమునే యీకవి ఋక్ఛందస్సులో "వేదిం పరితః క్లృప్తధిష్ణ్యాః A" అని సూచించినాఁడు. అనఁగా త్రేతాగ్నులు (కర్త) వేది కంతటఁ గల్పితస్థానములు కలవని యర్థము. B ఇఁక అగ్నిలో సమంత్రకముగ పలాశాది సమిధల నుంచెదరు. ఈవిషయమే యిట "సమిద్వంతః" అని చూపఁబడినది. ఇఁక 3 అగ్నులకు (చతురస్రాకారముగ) చుట్టును దర్భలను (వేదిలోకూడ) పఱచెదరు. ఈవిషయమే "ప్రాంతసంస్తీర్ణ దర్భాః" అని యిట పేర్కొనఁబడినది. వేదిలో నంతట దర్భలు పఱచి వానిమీఁదనే 'జుహూ' మున్నగు ఆహుతి సాధనము లుంచెదరు. ఇక హోమము చేసిన పురోడాశాది ద్రవ్యములు అర్ధహుతములైన సమయమున మంచి పరిమళముల నవి విరజిమ్ముచుండును. ఈ హవ్యగంధముల నాఘ్రాణించువారు పాపరహితు లగుదురు. ఇట ఈవిషయము "అపఘ్నంతో దురితం హవ్యగంధైః" అని కవిచేఁ జెప్పఁబడినది. ఇట్టి శ్రౌతాగ్నులు "ఓ శకుంతలా! నిన్నుఁ బవిత్రీకరించుఁ గాక C" అని కాళిదాసకవియొక్క ఋక్ఛందాశీస్సు. ఈయాశిషము ఈకవియొక్క శ్రౌతవిజ్ఞానమును విస్పష్టము చేయుటలేదా! ఇట్లే మఱి

A "ధిష్ణ్య" అనగా అగ్నియుండు స్థానము. ఇదే "అగ్న్యాయతనము" అనఁబడును.

B వేది కంతట అగ్ను లుండుటనుగూర్చి యీకవి "సాయంతనే సవన కర్మణి సంప్రవృత్తే వేదీం హుతాశనవతీం పరితః ప్రకీర్ణాః" అని నుడివినాఁడు.

(మా. శాకుంతల నాటకము.)

C వహ్నయః పావయంతు "పాలయంతు" అనికూడ పాఠాంతరము కలదు.

కొన్ని విశేషములు. దిలీప మహారాజునకు సుదక్షిణ అను భార్య కలదు. అను కథాకథన సందర్భమున నీకవి "పత్నీ సుదక్షిణేత్యాసీద ధ్వరస్యేవ దక్షిణా" (చూ. రఘువంశము 1-31) ఇట యజ్ఞపురుషునకు 'దక్షిణ' అను భార్యవలె దిలీపునకు సుదక్షిణ అను పత్ని కలదు. అను నిచ్చటి యుపమానము.

"యజ్ఞో గంధర్వ స్తస్య దక్షిణాప్సరసః .....(3-4-19) అను కృష్ణయజుర్వేద సంహితలోని వాక్యార్థమును బ్రకాశింపఁజేయుచున్నది. అనఁగా యజ్ఞపురుషుఁడు అనఁబడెడు గంధర్వునకు దక్షిణ అను నప్సరస కలదు. దీనిచేత సూచితమైన విషయ మేదనఁగా "అర్ధాంగి లేని భర్తవంటి దనియు నిట వ్యక్తమగుచున్నది. కనుకనే దక్షిణలేని యజ్ఞము మృతప్రాయము. 'మృతో యజ్ఞస్త్వదక్షిణః' అను సూక్తి బయలు దేరినది. ప్రాణతుల్యమైన (యజ్ఞమునకు) ఇట్టి పూర్తిదక్షిణను స్వీకరించిన పిమ్మటనే ఋత్విజులు యజ్ఞతంత్రి నిర్వాహణలో సమర్థు లగుదురను విషయము నీశ్రుతి యిట్లు తెలుపుచున్నది.

'తే దక్షం తే దక్షిణాం ప్రతిగృహ్య' (చూ. కృష్ణయజుర్వేదము) పై యుపమానము నుపయోగించుటలో నీకవియొక్క శ్రుత్యర్థవిజ్ఞానవైభవము విస్పష్టము. ఇంకను నిట్టి శ్రౌతిసంప్రదాయ దివ్య సౌరభములు, ఈ శ్రౌతకవి కావ్యోద్యానము నెట్లు పరిమళింపఁ జేయుచున్నవో సంగ్రహముగఁ గన్గొందము.

దిలీపమహారాజు తన కులగురువునొద్ద కేఁగి తన సంతానరాహిత్యమునుగూర్చి చెప్పెడి సందర్భములో 'అసహ్యా పీడం భగవన్ నృణమంత్య మవేహి మే' (చూ. రఘు. 1-71) ఇట "సంతానము లేకపోవుట" అనుటకుబదులు 'ఋణం అత్యం' అని మనకవి ప్రయోగించినాడు. "అంత్యఋణము" అనగా పిత్ర్యాణము. ఇది సత్సంతానలాభము చేతనే తీఱును. మానవుఁడు పుట్టుకతోనే 3 ఋణములతోఁగూడి

పుట్టును. (1) ఋషిఋణము (2) దేవఋణము (3) పితృఋణము. అనఁగా అంత్యఋణము ('నృణామంత్యమవేహి మే' అని) మనకవి పై శ్లోకములో నన్న ఋణమిదియే. ఈఋణత్రయము (3 బాకీలు) తీఱిపోవురీతి యెట్లనఁగా శాస్త్రోక్తముగ ద్విజుఁడు బ్రహ్మచర్యవ్రతము తీరవలెనన్నచో ఋషిఋణము (మొదటిది) తీఱిపోవును. దేవఋణము నాచరించినచో ద్విజుఁడు యజ్ఞయాగాదులను నిర్వర్తించి దేవతలను తృప్తిఁబొందింపవలెను. అప్పుడే దేవఋణము తీఱును. చివరిదగు పితృఋణము తీఱుటకు గృహస్థుఁడు (గేస్తు) తన ధర్మపత్నియందు సత్సంతానమును బడయవలెను. సత్సంతానావాప్తియే తపిృణ విముక్తికి ముఖ్యసాధనము. పై విశిష్టవిషయకదంబము నంతటిని యీక్రింది యజుర్వేద వాక్యములు విస్పష్టము సేయుచున్నవి. వినుఁడు.

"....త్రిభిర్ ఋణవా జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్య ఏష వా అనృణో యః పుత్రీ యజ్వా బ్రహ్మచారి వాసీ (కృష్ణయజుర్వేదము) పై శ్రుత్యర్థమును బాగుగ నెఱింగని కవి 'ఋణమంత్యం' అని అనఁగలఁడా? ఈవిషయమునే యీకవి యింకొకచోట మంగళాంతముగ నిట్లు చమత్కరించి నాఁడు. ఆ శ్లోకభావ మిది. దిలీపునకు (నందినీ ధేను సపర్యాకారణముచే) పుత్రుఁ డుదయించినాఁడు. పుత్రోత్సవసమయమున రాజు కారాగార బద్ధులను విడుదల చేయవలెను. కాని రఘుకులసంజాతుఁడైన యీ ధర్మప్రభువు దిలీపుని రాజ్యము రామరాజ్య మగుటచేఁ గారాగారము లన్నియు కాళీగానే యుండిపోయినవి. కనుక నేయొక బందీయుఁ గనఁబడలేదు. ఆలోచింపగా నింతవఱకు (పుత్రోదయాత్పూర్వ) తానే పితృఋణ రూపమైన బంధములో బందీయై యున్నాఁడు. ఏయొక బందీనైన నీయుత్సవసమయమున విడుదల జేయవలెనుగదా! కనుక నపుడు తానే (దిలీపుఁడే) (పితృఋణ) బంధమునుండి విడుదల

యయ్యెనఁట. అనఁగా సత్పుత్రోదయము అంత్యఋణరూపమైన తృణముండి తండ్రిని విముక్తునిఁ జేయునని భావము. ఈభవ్య భావభాసురమైన శ్లోకము "నసంయతస్తస్య బభూవ రక్షితుర్విసర్జయేద్యం సుతజన్మహర్షితః ఋణాభిధానాత్స్వయమేవ కేవలం తదా పితౄణాం ముముచే సబంధనాత్" (రఘువంశము 3 సర్గ 20 శ్లోకము).

ఇచ్చట పుత్రోదయానంతర కర్తవ్యకృత్యములనుగూర్చి కొంత తెలిసికొనుట మంచిది. పుత్రుఁడు కలిగినవెంటనే తండ్రి కట్టుబట్టతోనే స్నానము చేయవలెను. ('పుత్రే జాతే పితుస్స్నానం సచేలంతు విధీయతే') దీనినే సచేలస్నాన మందురు. ఈ స్నానసమయమునఁ బైకిఁ జెదరిన జలబిందువులు పితృదేవతా ప్రీతికరము లని పెద్దలానుడి కలదు. స్నానానంతరము శిశువునకు బొడ్డు కొయ్యకపూర్వమే ▲ తండ్రి పురిటిగది గుమ్మమునొద్ద అగ్నినుంచి అందుఁదవుఁడు, ఆవాలు కలిపిన ద్రవ్యముతో హోమములు చేయవలెను. దీనినే 'ఫలీకరణ హోమములు' అందురు. ఈ హోమములు చేయుటచే పుట్టిన బిడ్డకు బాలారిష్టాది జన్మకాలికదోషములు నశించును.

ఈవిషయమే జాతకర్మ సంస్కారఫలశ్రుతి శ్లోకములో

జాతస్యారిష్టనాశాయ దీర్ఘాయుష్యాయ .........సర్వసంపత్సమృద్ధయే జన్మన్య శుభయోగానాం వినాశాయ విశేషతః॥" పుట్టినవెంటనే చేయఁదగిన సంస్కారము 'జాతకర్మ' అనఁబడును ♦ ఈసంస్కారము చేయుటచేతఁ బుట్టినప్పటి అరిష్టాదిదోషనాశనము

---

▲ బొడ్డుకోసిన పిమ్మటనే జాతాశౌచము (పురుడు పట్టుట) ప్రారంభమగును. "...యావన్నచ్ఛిద్యతే నాళం తా వన్నాప్నోతి సూతకం" కనుక బొడ్డు (శిశువునకు) కొయ్యనంతవఱకు సూతకము రాదు.

♦ జాతమాత్రే సతి కర్తవ్యం కర్మ జాతకర్మ"

మఱియు శిశువునకు దీర్ఘాయుర్దాయము (100 ఏండ్లు) తజ్జన్మకాలికము లగు అశుభయోగము లడంగుట మున్నగు నుత్తమలాభములు కని పించుచున్నవి. సూతకదినములలో 'ఏన్నెమ్మ' అనఁబడు రాక్షసపీడ (ఈ జాతకర్మసంస్కార నిర్వహణముచేతనే) శిశువునకు శమిల్లును. ఈ విషయమంతయు నారచితమైన (సంస్కృతభాషలో 45 సం॥లో) 'ఉపనయన మంత్రార్థదర్పణము' అను జాతకర్మాది మేధాజననాంత సంస్కారగత మంత్రతాత్పర్యవివరణ రూపమగు పొత్తములో వ్రాయఁబడినది. (అముద్రితము.) ఇట్లు జాతకర్మసంస్కారానంతర మందు నాళచ్ఛేదనాద్యనంతరము పుత్రముఖదర్శనముతో తండ్రి పితౄణ విముక్తికి సాక్ష్యము సమకూరినట్లగును. యిట్లే మఱికొన్ని శ్రౌత విశేషములు.

కణ్వర్షి, శకుంతలా ప్రతికూల దైవశమనార్థమై సోమతీర్థము నకు వెళ్ళి తిరిగి వచ్చి యాశ్రమముఁ జేరిననాఁటి రాత్రి. రాత్రి యెంత మిగులియున్నదో చూచి రమ్మని శిష్యునిఁ బంపఁగా నతఁడు వచ్చి యాకసము వైపు చూచుసరికి ప్రతీచివైపున చంద్రుఁ డస్తమింపు చుండఁగా ప్రాగ్దిశయందదేసమయమున సూర్యోదయ మగుచు న్నది.* ఇట్లొకేసమయమున సూర్యచంద్రుల యుదయాస్తమయ ములు సంభవించుట కారాత్రి పౌర్ణమినాఁటి రాత్రియై యుండఁ దగును. యజమాని (ఆహితాగ్ని) పున్నమినాఁటికిని అమవసనాఁటి కిని ఇష్టులు (పౌర్ణమాసేష్టి, దర్శేష్టి) చేసికొనుటకై తనయింటికి తప్పక రావలసియున్నది కణ్వ శిష్యుఁడు తెల్లవాఱుటను జూచి 'యావదుపస్థితాం హోమవేళాం గురవే నివేదయామి' అనుచు సూర్యోదయానంతర కాలకర్తవ్యమైన పౌర్ణమాసేష్టికిఁ దగినసమ యము సంప్రాప్తమైనట్లు కణ్వర్షికిఁ దెలుప నేఁగెద నని వెళ్ళును.

---

*"యాత్యేకతోఽస్తశిఖరం పతిరోషధీనా మావిష్కృతోఽరుణపురస్సర ఏకతోర్కః....." (మా. శాకుంతల నాటకము 4 అంక. 1 శ్లో.)

"ప్రాగుదయా దమావాస్యా యాః తంత్రం ప్రక్రమయతి"

"దర్శేష్టి సూర్యోదయమునకు ముందుగనే ప్రారంభింపవలెను" అను శ్రౌతసంప్రదాయమునుబట్టి పౌర్ణమాసేష్టి, సూర్యోదయానంతరకాలికమే యగును కదా! ఈ శ్రౌత రహస్యమును, ఈ విశిష్టవిషయమును బాగుగఁ దెలిసినవాఁడు కనుకనే మన శ్రౌతవిజ్ఞానచణుఁడు కణ్వశిష్యముఖమున హోమవేళ సమీపించిన విషయమును నివేదించుటకుఁ బంపించినాఁడు.

ఇఁక ఒండు రెండు విషయములు వినిపించి విరమించెదను.

"ఇత్థం ద్విజేన ద్విజరాజకాంతి రావేదితో వేదవిదాం వరేణ
ఏనో నివృత్తేంద్రియ వృత్తి రేనం జగాదభూయో జగదేకనాథః."

(చూ. రఘువంశము 5-23)

"కౌత్సుఁడు రఘు మహారాజుతో (నేదియో) పలుకఁగాఁ దిరిగి మహారాజు వానికిట్లనెను" అనియే యిందలి ప్రస్తుతకథాంశము. ఇట రాజునకు "ద్విజరాజకాంతిః" అని యొక విశేషణమును మన కవి ప్రయోగించినాఁడు. చంద్రుని కాంతివంటి కాంతికలవాఁడు అని యర్థము. "తస్మాత్సోమ రాజానో బ్రాహ్మణాః సోమోఽస్మాకం బ్రాహ్మణాగ్ం రాజా" అను శ్రుత్యర్థము పైవిశేషణముచేఁ బ్రకటితమైనది. మఱియు మానవుల మనోనైర్మల్యము, బుద్ధిప్రసాదము, మాతృచింత అనునివి బలవత్తరముగ నుండవలెనన్నచో చంద్రగ్రహముయొక్క బలము ముఖ్యము. ఈవిషయమే గ్రహము లకారకత్వమును వర్ణించెడు ముహూర్తదీపికలో "మనోబుద్ధిః ప్రసాదం చ మాతృచింతా చ చంద్రమాః" అని కలదు. విప్రులకు మనోబుద్ధుల నైర్మల్యము ముఖ్యాతిముఖ్యము. కనుక బ్రాహ్మణులకు చంద్రుఁడు రాజు అని మన మహాకవి సందర్భముచేసికొని చెప్పిన "ద్విజరాజ కాంతిః" అను విశేషణములో నెంతేని శ్రుత్యర్థజ్యోతిర్విజ్ఞానము

లిమిడియున్నవి. ఇట్టిదే "ఏనో నివృత్తేంద్రియ వృత్తిః" అను నింకొక విశేషణము కలదు. ఇందును నెంతేని శ్రౌతసంప్రదాయ రహస్యములు గర్భీకృతములై యున్నవి. పాపవ్యాపారరహితమైన యింద్రియ వ్యాపారము కలవాఁడు అని యీ విశేషణమున కర్థము.

"మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః" అను సూక్తినిబట్టి[A] పంచమహాయజ్ఞములు నిర్వర్తించినవాఁడు బ్రహ్మజ్ఞానమునకుఁ దగిన యింద్రియవ్యాపారము కలవాఁ డగుచున్నాఁడు. కనుకనే మన శ్రౌతకవి రఘు మహారాజుచే విశ్వజిద్యాగము[♦] స్వయముగాఁ జేయించినాఁడు. కనుక పైశ్లోకములోని "ఏనో నివృత్తేంద్రియ వృత్తిః" అను విశేషణము శ్రుతి స్మృత్యర్థసమ్మతమై యీకవి శ్రౌతపాండితినిఁ జిక్కఁగఁ జాటుచున్నది. దీనిచే "సత్కర్మాచరణము మానవుని చిత్తశుద్ధికిని, తన్మూలకముగ వాని విముక్తికిని సాధనమగుచున్నది." అను నుత్కృష్టవిషయ మిచ్చట మనకవిచే నుపదిష్టమగుచున్నది. కనకనే భర్తృహరి మహాకవి తన సుభాషితత్రిశతిలో "మానవుఁడు స్వస్వవిహితకర్మను ఆచరించుటచే సులభముగ గంతవ్యమును జేరఁగలఁడనియు నిట్టి కర్మ నాచరింపక యుపాయాంతరముచేఁ దన గంతవ్యమును (జీవిత సాఫల్యమును) పొందఁగోరువాఁడు తెలిక పిండికూరకై వైడూర్యమయపాత్రను సంపాదించి మంచిగంధపు చెక్కలతో నాకూర వండునంతటి మూర్ఖుఁ డనియుఁ దెలిపినాఁడు.[*]

A పంచమహాయజ్ఞములు. 1. దేవయజ్ఞము 2. పితృయజ్ఞము 3. భూతయజ్ఞము 4. మనుష్యయజ్ఞము 5. బ్రహ్మయజ్ఞము.

♦ రఘువంశ కావ్యము 5వ సర్గ. 1వ శ్లోకము.

* "స్థాల్యాం వైడూర్యమయ్యాం పచతి తిలఖలం చాందనైరింధనౌఘైః
ప్రాప్యేమాం కర్మభూమిం న భజతి మనుజో యస్తపో మందభాగ్యః."

ఇట్లే ఈశ్వరుఁడు సప్తర్షులను రావించి వారిని, తనకు పార్వతీ పరిణయ సందర్భములో మహాకవీశ్వరుఁడు ఈశ్వరుని ముఖమున-

"అతఆహర్తు మిచ్ఛామి పార్వతీ మాత్మ జన్మనే
ఉత్పత్తయే హావిర్భోక్తుః యజమాన ఇవారణిం.

(కుమా. కు. సం. సర్గ 6 శ్లో 28)

"యజమాని యజ్ఞాగ్నిని పుట్టించుటకై "అరణి"ని సంపాదించి నట్లు మహర్షులారా! నేను కుమారోత్పత్తికై పార్వతీదేవిని పరిగ్రహింపఁదలచితిని." ఇచ్చట "అరణి" "యజమాని" అను పదములు ఒక్క యజ్ఞముఖమునుండియే వెల్వడఁదగియున్న వనుటలో సందేహము లేదు. "యజమాన ఇవారణిం" అను పై యుపమానముచే గిరిజ పవిత్ర తేజస్సు నుద్భవింపఁజేయు "అరణి" వంటిదనియు నామె కుద్భవింపఁబోవువాఁడు అరణ్యుద్భవమైన అగ్నివంటివాఁ డనియు నీ యగ్నికి సోమయాజి "సోమయాజీచే త్యష్టమూర్తయః" అను సూక్తి ననుసరించి యిట సోమయాజీ రూపుడైన సాక్షాదీశ్వరుఁడే యనియు, నీ యీశ్వరోద్భవమైన తేజస్సు (అగ్ని)లోఁ దారకాసురుఁ డింధన ప్రాయుఁడు కాఁగలఁ డనియుఁ గనుక దేవతలకే (సత్యపక్షమునకే) జయము చేకూరఁగలదనియు నిట్టి యుపమాన బలముచే నెన్నియేని ప్రయోజనము లిట సిద్ధములైన, నాటకీకరణ పద్ధతిచే ముందుగనే (సూచ్యార్థ సూచనారూపమున) మనకవిచే సూచింపఁబడుచున్నవి.

పైవిధముగా మన కాళిదాస మహాకవి వైదికకర్మాచరణము మానవునికి పాపభంజకమై చిత్తశుద్ధిద్వారా ఆముష్మికానందదాయక మగుచుండు నని సూచించినాఁడు. కర్మభూమియైన మన భారత భూమిలోఁ బుట్టిన ప్రతిమనుజుఁడును స్వస్వవిహితకర్మాచరణము చేతనే సులభముగ జీవిత సాఫల్యము నందఁగలిగి, యిహపరములలో సౌఖ్యమును పొందఁగల్గు రీతిని మనకవిఁ జూపినాఁడు.

ఇట్టి శ్రౌతక్రియలు మానవజాతి కంతటికిని సర్వాభ్యుదయములను గలిగించఁ జాలియుండుటచేతనే యీ క్రియలు భారతీయులకు ప్రాణతుల్యములును ప్రాణాధికములునై భరతదేశమంతటను వ్యాప్తిఁ జెందగల్గినవి. భారతజాతియం దేదేని యద్భుతశక్తి యనితరలభ్యమైనది యున్నదన్నచో నట్టిది శ్రౌతక్రియానిర్వహణమే యనవలసియున్నది. ఇట్టి భారతీయుల మూలధనము లనఁదగిన పుణ్యశ్రౌతక్రియలకును భారతీయ సంస్కృతీసర్వస్వమునకును నాలవాలములై భారతీయ ధర్మసంరక్షణమునకు రత్నపేటిక లనఁదగిన కాళిదాస కావ్యములు ప్రతిభారతీయునికిని దప్పక సాదరముగ నధ్యయనము చేయఁదగియున్నవి. ఈజాతీయ మహాకవి మహాకావ్యములను ఆ యా ప్రత్యేక దృక్పథములతో (ఆనాఁటి సాంఘికాచారములు, సంస్కృతి) నధ్యయనముచేసినచో భారతీయులు తమ ధర్మమును నిర్వర్తించినవారై శ్రీ కాళిదాస కవీంద్రునిఋణమునుండి కొంత విముక్తులు కాఁగలుదురు. కర్మ బ్రహ్మస్వరూపము గాన నిష్కామకర్మాచరణము మోక్షప్రదమనియు కామ్యముగఁ జేసినచో నైహికాభ్యుదయ సంపాదకమనియు నీ శ్రౌతక్రియాచరణము మొత్తముపై నిహపరసాధకమని భారతీయులకుఁ దెలిపి విశ్వశ్రేయమునకుఁ దన కావ్యముల నీకవీంద్రుఁడు మంగళతోరణముల గావించి విశ్వప్రేమునకుఁ బాత్రుఁడైనాఁడు.

# శబ్దశాసనుని శారదరాత్రులు

## ఒక సమీక్ష

రచయిత : చింతలపూడి సన్యాసిరావు.

శ్రీమదాంధ్రమహాభారతరచనా బంధురుఁడైన నన్నపార్యుఁడు ఆరణ్యపర్వమునఁ జతుర్థాశ్వాసమందలి 142 సంఖ్యగల పద్యమును రచించిన పిదప నమ్మహనీయుని లేఖిని శాశ్వతవిశ్రాంతిఁ గొనెనని జనశ్రుతి కలదు. శ్రీ వావిళ్ళవారి 1928 సంవత్సరపు భారతారణ్యపర్వమం దాపద్య మిట్లున్నది.

శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహారపంక్తులం
జారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూర పరాగపాండురుచిపూరములం బరపూరితంబులై.

'వికీర్యమాణకర్పూర పరాగ పాండురుచి పూరములం బరపూరితంబులై' అను వాక్యమునకు 'విసార్యమాణ కర్పూర పరాగపాండురుచి పూరిత సర్వదిగంతరంబులై' అను పాఠాంతర మొసఁగఁబడియున్నది. 'పూరములం బరిపూరితంబులై' అని రెండవ పాఠాంతరము కూడ నొసఁగఁబడియున్నది. ఉదాహృతపద్యాంతమున నధోరేఖచే సూచితమైన 'బరపూరితంబులై అను పదము పరుషాదియై శ్లేషించి యమంగళార్థప్రదమై సిద్ధవాక్కగు నమ్మహాకవికి క్షితివియోగము సిద్ధింపఁజేసిన దని యొక జనశ్రుతి కలదు. అందువలననే యమ్మహాగ్రంథము పరపూరితము కావలసినదయ్యెనని కొందఱు వాకొందురు. ఆపద మాపద్యమున నెంతవర కర్థస్ఫోరకమై యన్వయించినదను విషయమె యిచటఁ జర్చనీయాంశము.

ఈ పద్యము రెండు కర్తలుగల రెండు వాక్యముల నలరారుచున్నదా లేక యొకకర్తయే గల యొకవాక్యమై యొప్పుచున్నదా? యను విషయము ముందు నిర్ణయము కావలయును.

'శారద రాత్రులుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం జారుతరంబులయ్యె' ననునంతవఱకు నొక వాక్యము చేసినయెడల 'చారుతరంబులయ్యె' నను సమాపకక్రియకు 'శారదరాత్రులు' కర్తయై వాక్యపరిసమాప్తి గావించును. మిగిలిన భాగమున 'కర్పూరపరాగపాండురుచిపూరములు' కర్తయై 'అంబరపపూరితంబులై' యను నసమాపకక్రియతో నన్వయించవలసి యుండును. అట్లగుచో నాపద్యమునకు ముందరిపద్యమం దాకర్తకు సంబంధించిన సమాపకక్రియను నిలుపవలసి యుండును. కాని ప్రబంధ పరమేశ్వరుని-

స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవజృంభణముల్లసిల్ల ను
ద్ధురతర హంస సారసమధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్.

అను పద్యము ప్రారంభమైనది. ఇందు 'వాసరముఖంబులు' కర్తయై 'వెలింగె' నను సమాపకక్రియలతో నన్వయించి పద్యభావమును పరిసమాప్తము గావించెను. ఇందు నన్నపార్యుని పద్యద్వితీయ వాక్యమునకు సమాపక క్రియ గోచరింపదు. ఆ పద్యభావముతో నీపద్యభావమున కెట్టిసంబంధమును లేదు. అందు రాత్రులు వర్ణింపఁబడినవి. 'పూరితంబులై' అను పదముసమాపకక్రియగ నంగీకరింపఁబడఁదగదు. పూరితంబులుకాఁగా నను నర్థమేని సాధ్యముకాదు. కాఁబట్టి రెండవ వాక్యమున కసమగ్రతాదోషము సిద్ధించును. వాగనుశాసనుని వాక్కునం దిట్టి దోసఁగు పొసఁగనేరదు. ఈయనన్వయదోషమును బరిహరింపఁబూనియె యెవరో ప్రబుద్ధు లావాక్యమున 'వికీర్యమాణ'పదమును దొలఁగించి 'విసార్యమాణ'మును, 'పూరములం బరపూరితంబులై' ఖండవాక్యః ు దొలఁగించి 'పూరితసర్వదిగంతరంబులై'యని యు ఖండవాక్యమును బ్రవేసపెట్టిరి.వికీర్యమాణ

కర్పూరపరాగము' లనుట వలన వెదచల్లఁబడిన కర్పూరపరాగములని సుస్పష్టార్థ పరిశోభితమై 'వికీర్యమాణ' శబ్దమలరారుచుండ 'విసార్య మాణ' యను నతకని పదముంచఁబూనుట సమంజసము కాదు. ఇఁక 'పూరములంబరపూరితంబులై' యను ఖండవాక్యమును బూర్తిగ మార్చుట తగవు గాదు. ఏకవాక్యముగనె యాపద్యము నన్వయించు కొందమనిన యెడల 'శారదరాత్రులు అంబరపూరితంబులై చారుతరంబు లయ్యె' ననవలసియుండును. రాత్రులంబరపూరితంబులయ్యె ననుట అర్థ రహితమై హాస్యాస్పదమగును. అప్పుడు 'వికీర్యమాణకర్పూర పరాగ పాండురుచిపూరములు' ప్రథమాంతములై పద్యమం దనన్వితముగ నిలిచిపోవును. 'చారుతరంబులయ్యె' నను సమాపకక్రియనె రెండు వాక్యములందును బ్రత్యేకముగ ననుసందించుకొనవలయునేమొ యని యొకరు సూచించిరి. కాని ప్రథమవాక్యాంతములో విడిచిపెట్టఁబడిన 'చారుతరంబులయ్యె' నను క్రియను ద్వితీయవాక్యప్రారంభమునఁదిరుగ నెత్తిపలుకుట కాని వాక్యాంతమునకు లాగి వాక్యాఖరిసమాప్తికి వాడుకొనుట గాని యుచితము కాదు. అట్టికొదుకులు నన్నపార్యునికవితలో నుండఁదగనివి. 'అంబర' శబ్దమున్నంతవఱకు నిట్టి ప్రత్యవాయము లని వార్యములగును. కాబట్టి ఆపద్యచతుర్థ పాదాంతము "పూరములం బరిపూరితంబులై' యని వావిళ్ళవారు సూచించిన రెండవ పాఠాంతర ముతోడనె పరిశోభితము కానగును. కవిహృదయ మదియెకానోపును. అప్పుడు

"శారదరాత్రులు వికసన్నవకైరవగంధ బంధురోదార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ కర్పూర పరాగ పాండురుచి పూరములం బరిపూరితంబులై (పూరములతో బరిపూరి తంబులై) ఉజ్జ్వలలసత్తర తారకహారపంక్తులం జారుతరంబులయ్యె' నని యొకమహావాక్యమేర్పడియర్థాన్వయభాసురమై యలరారఁగలదు.

అట్టియెడ నమంగళశబ్దస్ఫురణకుఁ దావే యుండదు తత్త్యాగణమున నీపద్య మా యాంధ్రకవికులతిలకుని కమంగళము నాపాదించె ననుటకుఁగాని యాతని నస్తమింపఁ జేసెననుటకుఁగాని వలనుపడదు.

కాని, ప్రామాణికులైన పండితులచేఁ బాఠాంతరములను బరిశోధింపఁ జేయుటలోఁ బ్రసిద్ధిఁగాంచిన వావిళ్ళవా రేలనో గ్రంథభాగమున నీ యపపాఠము నె ముద్రింపఁ జేసిరి. జనశ్రుతియందుఁగల విశ్వాసముచేతను, భిన్నార్థ ప్రతిపాదకమగుటయందుఁగల మక్కువచేతను నర్థాన్వయములను విస్మరించి 'అంబర' శబ్దము నె గ్రహించి యుందురు. అభిజ్ఞు లీవిషయము నవలోకన మొనరించెదరు గాక.

# ఆంధ్రకావ్యములు-అవతారికలు

అయ్యగారి నరసింహమూర్తి
నై. వి. కె ఎస్. జి. కృష్ణారావు

ఒక జాతి నాగరికతా సంస్కృతులను దెలిసికొనుటకు నాజాతి దేశము చరిత్రలతావశ్యకములు. అందును సాంఘికచరిత్ర మత్యంతోప యోగకారి ఆంధ్రుల నాకరికతా సంస్కృతులను దెలిసికొనుటకు వారి దేశచరిత్రమవసరము కాని వీరికి సమగ్రమైన నిర్దుష్టమైన దేశచరిత్ర యే లేదు. శాత వాహనులనుండి యాంగ్లేయుల పరిపాలనవఱకు నుండిన రాజుల విషయములన్నియు వివాదగ్రస్తములై యుండుటకు, అసమగ్ర మైన ఆధారములే కారణములు. ఇంక నేడాంధ్రుల చరిత్రను దెలిసికొను ట కుపలబ్ధములగు వస్తువులు (1)శాసనములు (2)గ్రంథావతారికలు

ఈయవతారికలు కేవలదేశచరిత్ర రచనమునకేగాక సాంఘిక చరిత్రకు,వాఙ్మయచరిత్రకుంగూడ నుపయోగపడును. గ్రంథావతారిక లందలి పరిణతినాధారముగాఁ గొని యాకాలపు ప్రజాభిరుచులు మున్న గునవి యెఱుఁగనగును. కనుక ప్రస్తుతమాంధ్ర కావ్యములయందలి యవ తారికలను బరిశీలించి యందేయే విషయములు చెప్పఁబడి నవో సూచించుటయే ప్రస్తుతవ్యాసకర్తృ వ్యాంశము.

అవతారిక లనునవి కావ్యారంభమునందు కవి తన యిష్టదేవతా ప్రార్థనామగోత్రాదికథనము, కృతిపతిప్రశంస, కవితాసిద్ధాంతములు, తత్కావ్యరచనలోఁదనయుద్దేశము

ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాపి తన్ముఖమ్ "అను నియమ మొ కటి సంస్కృతమునఁ గలదు. ఆంధ్రకవులును సంస్కృతసాహిత్యానుసా రులగుటచే నానియమములనే యనుసరించిరి. ఒకకవి స్వయముగాఁదా నొక కావ్యమును రచించితినని వ్రాసినను,కావ్యమునకుఁగర్తలొకవులు కారని నిరూపించుటయే పత్రిభగాఁదలఁచు విమర్శకాగ్రేసరులుగల నేఁటి కాలమునకు వారల్లాయవతారికలను వ్రాయుట సమంజసము,నావశ్య

కమునని అనిపించుచున్నది. నాటకములందు జెప్పఁబడు నాందీప్రస్తావన లిట్టివియే.

గ్రంథారంభమున దేవతాస్తుతి మంగళకర మగు శ్రీకారము తోఁ జేసినయెడల దోషపుంజములనడంచి శుభంబొదవించునను నభిప్రాయముతో సంస్కృతభాషా సుశిక్షితులగు నాంధ్రకవులు తమ గ్రంథములందు సంస్కృతమున దేవతాస్తుతి చేయుచుండిరని తెలియు చున్నది. పంచమ వేదమగు భారతము నాంధ్రీకరించుచు నాదికవియగు నన్నయ

"శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహన్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషాస్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పువుషోత్తమాంబుజభవశ్రీకన్ధరాశ్శ్రేయసే!"

అను త్రిమూర్త్యాత్మకస్తుతి రూపకమైన మంగళశ్లోకముతో నారంభించిన ఈ యాశీస్సూచకమైన స్తుతి వివిధరూపములను దాల్చుచు నేఁటి యాధునిక కావ్యముల వఱకుఁగూడఁ బయనించినది. ఉభయ కవిమిత్రుఁడగు తిక్కన తన ప్రథమకృతియగు నిర్వచనోత్తర రామాయణమునందు నన్నయమార్గానుయాయియై

"శ్రీరాస్తాంమనుమక్షితీశ్వర భుజాస్తమ్భేజగన్మణ్డల
ప్రాసాదస్థిరభారభాజి దధతీ సాసాలభఞ్జశ్రియం
శుణ్ణాలోత్తమ గణ్డభిత్తిఘుమ దవ్యాసజ్జవశ్యాత్మనాం
యాముత్తేజయతేతరాం మధులిహాంచూర్ణస్య సాన్ద్రస్థితిః"

అని సంస్కృత శ్లోకములోనే యాశీస్సు చేసియు భారతరచనా కాలమునాఁటికి కవిబ్రహ్మ తెలుఁగు గ్రంథములందుఁ దెనుఁగు గ్రంథ మునందుఁ దెనుఁగుననే దేవతాస్తుతియొనర్చుట మేలని తలంచి

"శ్రీయన గౌరినాఁ బరగు చెల్వకుఁ జిత్తము పల్లవింపభ
ద్రాయితమూర్తియై హరిహరంబగురూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడి భక్తజనంబు వైదిక
ధ్యాయితఁ జెచ్చ మెచ్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్"

అని హరిహరాభేదస్వరూపంబగు పరతత్త్వమును గొల్చినాఁడు. ఇష్టదేవతాప్రార్థనము శ్రీనాథుని కాలమునకుఁ "శ్రీరామాకుచ మండలీమృగమదశ్రీగంధసంవాసిత స్ఫారోదార భుజాంతరుండ"ని శృంగారభావనావిలసితమై క్షీణయుగము నాఁటికి

"సిరుల మొఱుంగుబోఁడి తన చెక్కులు సిబ్బెపుగబ్బిగుబ్బలన్
బరువడి నాల్గుచేతులను బట్టఁగ నల్వదలంచి కేలుఁ దా
మరఁగు శికన్నుమాయుటకు మాటికి నవ్వెడు వెన్నుఁడు"

డని పూర్తిగా శృంగారమయమైనది. దీనికిఁ గారణమానాఁటి ప్రజాభిరుచులేయని యూహింపవచ్చును

కవులు తమ కులగోత్రములతోఁ పాటు తమకవితాసామర్థ్యములనుగూడ వాక్రుచ్చుచుండిరి. దీనికిఁగూడ నన్నయయే యాద్యుఁడు. తనకులబ్రాహ్మణు....................
మత్యమరాధిపు నన్నపార్యుఁజూచి "అను పద్యమునందు మత్యమరాధిపుఁడనుట కొంత యత్యుక్తిగాఁగాన్పించినను మొత్తముమీఁద నాతఁడు తాను విశిష్టగుణరత్నాకరుఁడనుట యతిశయోక్తి కానేరదు.

ఇఁక నన్నెచోడుఁడు తాను సూర్యవంశపురాజులగు బగీరథరాఘవులతో సమానుఁడనని "కుతలంబు నడుకొన......" అను పద్యమునందుఁ జెప్పుకొనినాఁడే. తిక్కనతన నిర్వచనోత్తరరామాయణమునందు అమలోదాత్త మనీష నే నుభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమునన్ బారగుఁడన్ కళాకవిదుఁడ" నని చెప్పుకొనినాఁడు. ఈ గ్రంథరచనా కాలమునాఁటికి తనకుఁగల కవితా ప్రాగల్భ్యమునందు ఆసక్తి పో లేదని

యు, భారత రచనకుఁగావలసిన సత్యనిష్ఠ రా లేదనియుఁ దెల్లియుచున్నది. భారతమునందిట్టి ప్రగల్భములు పలుకక పొంగారిన పా లనినట్లు పరమ శాంతి వినయాది సంపన్నుండై "నానేర్చినభంగి చెప్పెదవరణీయుఁడన య్యేద భక్త కోటికిన్ "అనినుడివి, ఆంధ్రావళి మోదముం బొరయు నట్లుగ సాత్త్వవతేయ సంస్కృతి శ్రీ విభవాస్వదమును గావించుకొని నాఁడు భారతరచనమునకుఁ బూర్వమాయన మంత్రిమాణిక్యమై రాజు లయనురాగవీక్షణమునర్థించినాఁడు. భారతరచనకాలము నాఁటికి బుద్ధి పరిపక్వమై యజ్ఞము చేసినాఁడు. అనంతరమాయన యర్థించునది తన యిష్టమగు హరిహరనాథుత యపాంగ వీక్షణయొక్కటియే. ఇంతటి యుదాత్తమైన పరిణామము తిక్కనలోఁగలుగుట కాలప్రభావము చేత నే. నన్నచోడునినుండి యారభించిన యీయతిశయోక్తులు శ్రీనాథుని బ్రాహ్మదత్తవరప్రసాదుఁడ వురుప్రజ్ఞావిశేషోదయా......కళానిధాన మవు నీభాగ్యంబు సామాన్యమే "అనుటలోఁబుష్టిని బొంది నేఁటివఱకుఁ బెంపొందినవియే గాని తగ్గలేదు.

అలనన్నయ్యకు లేదు తిక్కనకు లేదాభోగ మస్మాదృశుం
డలఘుస్వాదురసావతారధిషణాహంకార సంభారదో
హలబ్రాహ్మీమయ మూర్తి శిష్యుఁడు నాఁడట్టిధీయోగ్యమ పే
శలచాంద్రీమృదుకీర్తి చెళ్లపిళవంశస్వామి కున్నట్లుగాన్.

సమర్థులగు కవులు కొంద ఱట్లుచెప్పుకొనినను మఱి కొందఱు కలము పట్టుట కది ప్రథమమేయయ్యును నన్నయ తిక్కనలను గూడఁ గ్రిందొనరింతు మని వ్రాసికొనుట గమనించుచు నేయున్నాము.

కవి తనకుఁగల కవితాసిద్ధాంతములను ఈయవతారికలందు సూచించును. మఱియు నీయవతారికలను జాగరూకతతోఁ బరి చినచో ఒకకవిచే నాతని ప్రథమగ్రంథమునందుంపఁబడిన కవి ప్రతిపాది

పంబడిన కవితాసిద్ధాంతము లాతని రెండవకృతినాఁటికి మార్పునొందు చుండుననియుఁ దెలియఁగలదు.

నన్నయ తాను "నానారుచిరార్థసూక్తినిధనని"యు తనరచన యందు"అక్షరరమ్యత ప్రసన్నకథాకలితార్థయుక్తి" యుండుననియు వాకొనినాఁడు నన్నెచోడుఁడు కావ్యమీవిధముగా నుండవలయునని శాసించినాఁడు.

సరళముగాఁగ భావములు జానుఁదెనుంగుననింపువెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్.

తిక్కన

క. లలితపదహృద్య పద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతియలఁతి తునియలఁ గా
హాళి సంధించినవిధంబు నమరఁగ వలయున్.

తిక్కన కవిత్వమును దిలకించినచో నిర్వచనోత్తరరామాయణ మునందుఁ జెప్పఁబడిన సిద్ధాంతము లాతని కవితా స్వరూపమును బూర్తిగాఁదెల్లంబుగావింపఁజాలవని తెలియును. పింగళి సూరన కృతు లను బరిశీలించినచోఁ గళాపూర్ణోదయము "నాఁటికాతనికిఁగవితలపైఁ గలయభిప్రాయములు" ప్రభావతీప్రద్యుమ్న రచన నాఁటికిమాఱినవని తెలియును.

కవులు తను కవితాప్రతిభనుగూర్చి యెవ్విధములుగఁ జెప్పి కొనినను వారి తరువాతికవులు వారినిగూర్చి పలికినపలుకుల నత్యం తప్రమాణవాక్యములుగా గ్రహింపవచ్చును.

తిక్కనచే విద్యాదయితుఁడని "ప్రశంసింపఁబడిన"వాగనుశాస నుఁడు" "శంభుదాసునిచే" భద్రకుంజరముతోఁ బోల్పఁబడినాఁడు.

శ్రీనాథుఁడు నన్నయ యుభయభాషా వాక్ప్రౌఢిమకు మెచ్చి తానును తద్రీతినివచియింతునని పల్కినాఁడు. వచియింతు వేములవాడ భీమనభంగి ..."అని శ్రీనాథుఁడు చెప్పిన సీసమున నాయాకవుల కవిత్వములందలి ప్రధానగుణములు వ్యక్తములగుచున్నవి. కవి బ్రహ్మనుగూర్చి శంభుదాసుఁడు చెప్పిన "తనుగావించిన సృష్టితక్కొరులచేతంగాదు నానాముఖంబున తాఁబల్కిన పల్కు లాగమములై పొల్పొందు... నని చెప్పిన పద్యము స్వభావోక్తికిఁదావలమైయున్నది. శ్రీనాథునిగూర్చి దగ్గుపల్లి దుగ్గన చెప్పిన పద్యము శ్రీ విశ్వనాథ నన్నయాది కవులను గూర్చి చెప్పిన పద్యములు స్వాభావికములై యున్నవి.

సంస్కృత ప్రాకృత శౌరసేనీముఖ్య
  భాషాపరిజ్ఞానపాటవంబు.........
పూర్వకవి ముఖ్య విరచితా పూర్వ కావ్య
భావరససుధాచర్వణప్రౌఢతయును (దుగ్గన)
ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి
తిక్కన్న శిల్పంపు తెనుఁగు తోట......
ఒకఁడు నాచన సోమన యుక్కివుండు
చెఱిపి పదిసార్లు తిరుగవ్రాసినను మొక్కవోని ఈ యాంధ్ర
కవిలోకమూర్ధన్య మణుల మద్దురు స్థానములుగ నమస్కరించి (శ్రీ విశ్వనాథ)

అవతారికలోని కొన్ని పద్యములెట్లు వాఙ్మయ చరిత్రకు దోహదమొసంగుచున్నవో యట్లే మఱి కొన్ని పద్యము లాయా కవుల కాల నిర్ణయ గ్రంథకర్తృత్వాది విషయములందు వివాదములను గల్పించుచున్నవి.

" ఆదిన్ బ్రతాపుఁడిచ్చిన
ఆదోకి పురంబునడుమ సంకిలి వడినన్

మోదమున పౌఢ రాయను
హృదయితుసచేత తెచ్చె నిండఱు నెఱుఁగన్"

ఈ పద్యము పాల్కురికి సోమనకాల నిర్ణయమున కెట్లు దోహదమొ సంగుచున్నదో యట్లే వివాదమునకును హేతుభూతమగుచున్నది. అట్లే

" ఆతతకృతి పేర నతిపుణ్యు పేర
మాతండ్రి విఠలత్స్మాపాలు పేర "

అను బుద్ధారెడ్డి వాక్యమతని రామాయణ కర్తృత్వమును దెలియఁజే యుచున్నది.

" ఉరుతరగద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జాను తెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుట
కూర్చెద ద్విపదలు కోర్కెదైవార "

ఈవాక్యములనుబట్టి నన్నయ యనంతరము మార్గకవితకు వ్యతిరేకమై నదియు, భాషాచ్ఛందో విషయకమైనదియునగు విప్లవమును శివకవులు లేవదీసి యితివృత్తము, దేశీయమైయుండవలెననియు, దేశీయమగు ద్విపదఛందమునే వాడవలెననియు, జానుదెనుంగునే వాడవలెననియు శాసించిరని తెలియుచున్నది.

కవులు తమగ్రంథావతారికలలోఁగృతిపతివంశావతారవర్ణనము, దిగ్విజయయాత్రావర్ణనలు చేయుదురు. ఇంచుమించుగాఁగృతిభర్తలం దఱు సూర్య చంద్రవంశములలో నొకదానికిఁ జెందినవారే. మఱి సర్వంసహా వలయమునకంతకు నేకచ్ఛత్రాధిపత్యము వహించినవారే. వీనిలోఁగొన్ని స్తోత్రములు, లేకపోలేదు. మనుచరిత్ర, పారిజాతాపహ రణములందు వర్ణింపఁబడిన కృష్ణరాయవర్ణనలు సత్యములే.

అవతారికలందు కొందఱు కవులు తా మా గ్రంథములను

వ్రాయుటకు నా యాకృతి భర్తల కంకితమిచ్చుటకును గల కారణములను జెప్పియున్నారు. తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమును కృతిపతియైన మనుమసిద్ధి "ఏ నిన్ను మామ యనియెడు దానికిఁ దగనిమ్ము భారతీ కన్యక" అని యర్థించి యంకితమును గొనినట్లు తన కృతిలోఁ జెప్పికొనినాఁడు. కాని భారతరచన గావించుతరి హరిహరనాథుఁడు దనకు స్వప్నమునందుఁ గాన్పించి కృతిపతిత్వ మర్థించినట్లు భారతాదిని దెల్పినాఁడు. మాననీయుఁడగు కవిబ్రహ్మకుఁ గలలో హరిహరనాథుండు గాన్పించి కృతిపతిత్వ మర్థించినను నర్థింప వచ్చును. అందులకుఁ దిక్కన యోగ్యుఁడు కూడ. ఈతనికిఁ దరువాత కృతులను దైవాంకితము చేయదలఁచిన కవి వర్యులకు దేవదర్శనమగుట అపరిహార్యమైనది.

ఈస్వప్నకథావృత్తాంతతమువలె గ్రంథమున కుకవినింద షష్ఠ్యంతాదు లాచార్యప్రోక్తమువలె సంప్రదాయము లైనవి. ఇవి రెండును లేని కావ్యము లేకుండుట నేటికిని అరుదైనది. స్వప్నకథా వృత్తాంతముల కాచార్యుండు సోమయాజివలె వీనికి నన్నెచోడుఁడు గురువు

"పలుకులబొందులేక రసభంగము జేయుచుఁ బ్రాత వడ్డమా
టల దమనేర్పుమాపి యొకటన్ హృదయంబలరింపలేక యే
పొలమునుగాని యట్టిక్రియముం దమమెచ్చుగఁ గోకమెల్ల న
వ్వులపాలయం జరించుకుకవుల్ ధర దుర్విటు లట్లు నుండఁగాన్"

తిక్కన సోమయాజి యిట్లు కుకవి నిందకుఁ బాల్పడుటకు శివకవుల భాషా విప్లవమే కారణమైయుండవచ్చును

" పనివడి నారికేళ పరిపాకమునం జనియైనభట్టహ
ర్షుని కవితానుగుంఫములు సోమరిపోతులు కొందఱయ్యతా
ననికొనియాడనేర రదియట్టిద లేజవరాలు చెక్కు గీ
టిన వసతల్పు బాలకుఁడు డెందమునన్ గలుగంగనేర్చునే"

విద్వద్దోషధమైన శ్రీనాథుని నైషధాంధ్రీకరణ కావ్యమునుగూర్చి యానాఁటి పండితలోకమునఁ గల భేదాభిప్రాయముల నీ పద్యము సూచించుచున్నదనవచ్చును. అట్లే భీమఖండమును కృతినిచ్చు సంగర్భమున రాజమహేంద్రవర పండితులకును, శ్రీనాథునకును జరిగిన వాగ్వివాదమును సూచించుచు నాతఁడు

"బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిష్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములువోలె గొంచెమెఱిఁగి
పండితమ్మన్యులైనవె తండికులకు."
నికటముననుండి శ్రుతి పుటనిష్ఠురముగ
నడరి కాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుడిగి రాయంచ యూరక యుంటలెస్స
సైపరాకున్న నెందేని జనుటయొప్పు." అని వ్రాసెనని యొక ప్రవాదము లోకమునఁగలదు.

నన్నయభట్టు తిక్కకవినాయకులన్న హుళక్కి భాస్కరుం
డన్నను జిమ్మపూడి యమరేశ్వరుఁ డన్నను సత్కవీశ్వరుల్
వెన్నుదుటం గరాంజలులు నింతురు జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాడ తగునా యిటు దోసపుమాటలాడఁగన్.

ఇట్లు క్రీడాభిరామకర్త వ్రాయుటకు ప్రేమాభిరామకర్త నెవరో కవులు నిందలు పల్కియుండుటనిమిత్తమై యుండనోపు. కొందఱు కవు లిట్లు తమ కృతులందు సందర్భోచితముగ కుకవినిందచేసినను చాల మంది కవుల కది సాంప్రదాయసిద్ధం బాయెను. ఆంధ్రకవితాపితామహుండగు నల్లసాని పెద్దన—

భరమైతోఁచు కుటుంబరక్షణకుగాఁ బ్రాల్మాలి చింతన్ నిరం
తరతాళీదళసంపుటప్రకరకాంతారంబునం దర్థపున్

దెరువాటుల్ దెగఁగొట్టి తద్జ్ఞపరిషద్విజ్ఞాతచౌర్యక్రియా
విరసుండై కొఱఁతన్ బడున్ గుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్."

అని కుకవికి కొఱఁతశిక్షనువిధించెను. ధూర్తుఁడని పేరువడసి నగు తెనాలి రామకృష్ణకవియే యిటఁగొంత సరసముగా సంచరించెనని చెప్పవచ్చును. ఆతఁడు సుకవులను దెలియుటకుఁ గుకవులుకూడ నవసరమేయని తెలిపి వారి మనుగడను గొంతవఱకు రక్షించెను.

"కాన దోషాత్ములయిన దుష్కవుల కతన
గరిమ వహియించుఁ గవిరాజు కావ్యమహిమ
బహుళపక్షంబు చీకటి బహుళమగుటఁ
జాయ వెన్నెల తరితీపు సేయుకరణి"

ఆధునికయుగమునందు స్వప్నగాథలు కుకవినిందాది సాంప్రదాయబద్ధములగు రచనలు కొంతవఱకు వెనుకఁబడుచున్నవియనియే చెప్పవచ్చును కవులు కొంతవఱకుఁ దమ విశాల హృదయములను, సహృదయతలను జాటుచున్నారు. శ్రీ విశ్వనాథవారు తమ రామాయణ రచనకు జీవునివేదన మొదలగునవి కారణమని వ్రాసిరిగాని శ్రీరాముఁడు కలలో సాక్షాత్కరించి తమ్ము రామాయణ రచనకు ప్రేరేపించెనని వ్రాసికొనలేదు.

వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితినంచనిపించుకో వృథా
యాసముగాక కట్టుకత లైహికమా? పరమా? యటంచుఁదా
చేసిన తండ్రియాజ్ఞయును జీవునివేదన రెండునేకమై
నాసకలోహవైభవసనాథము నాథకథన్ రచించెదన్."

ఒక్క వాల్మీకికాక వేఱొక్కఁ డెవఁడు
సుకవిశబ్దవాచ్యుండిఁకఁ గుకవినింద
యప్రశస్తపథంబుగా నవుట తెలిసి
మునిఋణముదీర్ప నీ కావ్యమును రచింతు"

నని యింతటితో కుకవినిందకు స్వస్తివచనము పలికిరి.

ఈ విధముగ నవతారికలపరిణతిని బరిశీలించినచో నాయా కాలములందలి రాజకీయసాంఘికమతపరిస్థితులనుబట్టి యవి యెట్లు మార్పు చెందుచు వచ్చినవో దెలియుననుట సుస్పష్టము. నన్నయతో నారంభించిన యీ యవతారికలు నేటివఱకుఁ గల సాంఘికపద్ధతుల నెఱుఁగుట కుపయోగపడుననుట నిస్సంశయము.

ఇట్లీవిధముగ కావ్యము లనేకవిషయములను దెల్పుటచేత నే యాలంకారికులు కావ్యోపయోగమును గూర్చి పలికిన

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే"

యీ పలుకులు దబ్బరలు మాత్రము కావు.

కనుక నేటివఱకు లభించిన యాంధ్రకావ్యములందలి యవతారికలను బరిశీలించి యందలి విశేషములనన్నిటిని ఆయా రూపములుగ విభజించి గ్రంథరూపమున లోకమున వెలయించుటయే నేఁటి సమర్థుల కరణీయవ్యాపారమైయున్నది

# రేచన భీమనల కాలము

## టేకుమళ్ల కామేశ్వరరావు

తెలుఁగులో వ్రాయఁబడిన ఛందోగ్రంథములలో ఇప్పటికి దొరికిన వానిలో మొదటిది కవిజనాశ్రయము.[1] ఇది క్రీ.శ. 517 ప్రాంత మందలి విష్ణుకుండిన వంశపురాజైన మాధవవర్మ (జనాశ్రయి) రచించిన జనాశ్రయ ఛందము ననుసరించి వ్రాయఁబడినది. తెలుఁగులో కవిజనాశ్రయముకంటె పూర్వపు రచనలు లేకపోలేదు. దానిలోనె యట్టి రచనలు రెండు పేర్కొనఁబడినవి—

క. ఇప్పాటఁ దొల్లి పింగళు
చెప్పిన క్రియఁ దప్పకుండఁ జెలువలరంగాఁ
బెప్పఁబడె వళ్లు ప్రాసలు
తప్పక యర్ధసమవృత్తతతి విదితముగాన్. (వా. క. పుట 38)

క. జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియ రేచన సుకవిజనా
శ్రయుఁ డీఛందంబుఁ జెప్పె జనులకుఁ దెలియన్.

(వా. క. పుట 64)

పింగళజయదేవులను గుఱించియు రేచనను గుఱించియు బాడడవ శతాబ్దికి ముందుదైన యాప్పిరంగలమ్‌కారికై యను తమిళ గ్రంథములోఁ బేర్కొనఁబడినదని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు[2]

---

1. కవిజనాశ్రయము ఆంధ్రసాహిత్యపరిషత్తు కాకినాడ వారిచే క్రీ. శ. 1917 లో ముద్రింపఁబడినది. వావిళ్ల రామస్వామిశాస్త్రులవారిచేత 1950 లో అచ్చు వేయఁబడినది.

ఆ. క. అను పొడి యక్షరములకు ఆంధ్రసాహిత్యపరిషత్తువారి ప్రతి యనియు వా. క. అనఁగా వావిళ్లవారి ప్రతి యనియు అర్థము.

2. రాజరాజనరేంద్రపట్టాభిషేక సంచికలోని నన్నయ పూర్వపు ఛందస్సులు అను వ్యాసము.

పోలుతఁ దెలియఁజేసిరి. తెలుగులోనికిఁ బ్రత్యేకముగాఁ బింగళుని ఛందస్సు అనువదింపఁబడినదియో లేదో తెలియదు. కాని జయదేవుఁ డనువాఁడు వ్రాసిన ఛందస్సులోనివని తెలుఁగు పద్యములు ఇతర ఛందస్సులలోఁగూడ నుదాహరింపఁబడినవి. అతఁడే ఈతఁడైన పక్షమున నీ తెలుఁగు ఛందస్సు రేచనకుఁ బూర్వమె రచింపఁబడినదని చెప్పవచ్చును. కాలము సరిగాఁ దెలియదు.

కవిజనాశ్రయ కర్త యెవఁడు అనునది పెద్దసమస్య? ఆంధ్రగ్రంథమును వేములవాడ భీమకవి రచించెనని కొందఱును, కాదు రేచన కృతమని కొందఱును వాదోపవాదములు చేయుచున్నారు. ఒకే గ్రంథమునకు నిద్దరి కర్తృత్వము పొసగదుకదా! గ్రంథకర్తృత్వమును నిర్ణయించు సూక్ష్మోపాయము లేవియైన నున్నవా ?

రేచన సామాన్యుఁడుగాఁడు. కవిజనాశ్రయములోని యతని ప్రబోధనలను గమనించితిమేని అతఁడు మహాప్రతిభాశాలియని యర్థమగును. అతఁడు 'ఉరుకావ్యరచనావిలసన్మతి' (వా. క. పుట 39) అంతటి మహాకవి వ్రాసిన ఇతర ఘనకావ్యము లెవ్వియో మనకుఁ దెలియరాకున్నవి.

రేచన జైనుఁడు. జైనమత మాంధ్రదేశములో నశింపఁగా గ్రంథములు మిగులుట యరుదు. కవిజనాశ్రయము వేములవాడ భీమకవి కృతమను భావముతో నీగ్రంథము మిగిలినది. లేకున్న నెప్పుడో అంతరించియుండును.

భీమకవి సామాన్యుఁడు కాదన్నవిషయ మెల్లరెఱిఁగినదే. అతనిఁ కవిత్వపు జీవితమే వేఱు. ముఖ్యముగాఁ దిట్టుకవిగాఁ బ్రసిద్ధిఁజెందినాఁడు.

రేచన కవిజనాశ్రయమును, భీమన వేఱొక ఛందస్సును రచించియుందురా అను విషయముగూడ నాలోచింపవలసియున్నది.

కవిజనాశ్రయములో యతులు నాలుగని తొలుత నిట్లు చెప్పఁ బడినది—

వ.........స్వరవళ్లి, ప్రాసవళ్లి, సరసవళ్లి, ఎకరూటివళ్లి నాఁజతు
ర్విధంబులయ్యె (వా. క. పుట 6)

ఆ కవియే మఱియొక చోట యతులు పదియని చెప్పెనా? ఈక్రింది పద్యమును జూడుఁడు

క. స్వరవర్గాఖండప్రా
ద్యరుబిందుప్లుతములున్ బ్రయుక్తాక్షరముల్
బరగఁగ నెకరూటి పోలిక
సరసలు నాఁబదివిధములఁ జను వళ్లి మహిన్.

(ఆ. క. పుట 19)

ఒకే కవి యతు లొకచోట నాలుగనియు మఱియొక చోటఁ బదియనియు వ్రాయఁడుకదా! కాఁబట్టి యవి రెండు వేర్వేఱు గ్రంథము లలోనివని రుజువగుచున్నది. కవిజనాశ్రయములోఁ దన కాలమునాఁటి యతులు నాలుగని రేచన చెప్పఁగా, వేఱొక కాలములో యతులు పదియని చెప్పిన మహాకవి యెవరు?

కాకునూరి యప్పకవి తన ఛందోగ్రంథమైన యప్పకవీయ ములో నిట్లు స్పష్టముగాఁ జెప్పినాఁడు—

క. భీమన పదిచెప్పె ననం
తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువది నా
ల్గామీఁదఁ గొందఱు కవి
గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్.

(అప్ప. ద్వి. ప. 7)

కాఁబట్టి యతులు నాలుగని తెలుపునది రేచన రచనకాఁగా, నాలుగింటికి మఱియాఱు చేర్చి యతులు పదియని చెప్పిన రచన

భీమన దనువిషయము స్పష్టమగుచున్నది. కావున కవిజనాశ్రయము రేచన భీమన ఛందస్సు వేఱని తెలియఁదగును.

ఛందోగ్రంథములలో నొక సామాన్యలక్షణ మేమనఁగా-గ్రంథ ప్రారంభ భాగమందె గణాక్షరమహిమ వివరీకరింపఁబడియుండును. కాని యాధ్యాత్మికశక్తిలోఁ బూర్వపువారు కట్టి నమ్మకముండెడిది. రేచన జైనమతస్థుఁడు గదా! కాని కవిజనాశ్రయములోఁ జెప్పఁబడిన గణాక్షరమహిమ హిందూదేవతలను నమ్మకములకు సంబంధించినది. కాఁబట్టి యీమహిమ గల భాగమునకు రేచనకు సంబంధములేదని స్పష్టమగుచున్నది. రేచన తన గ్రంథములో జైనదేవతలకు సంబంధించిన గణాక్షరమహిమను జెప్పియుండవచ్చును. కాని మతభేదముచే నది దొరకలేదు. సరే! ఇప్పుడు హిందూమతసంబంధమైన ఈభాగ మెవరిది?

భీమకవి త్రిపురకవిగాఁ బేరుపొందినాఁడు. కాఁబట్టి యక్షరమహిమకును నాతనికి విశేషసంబంధమున్నది. దానిని గుఱించి కొందఱికెంతనమ్మకమనఁగా కేవలము దానినె ఛందోగ్రంథముగా వ్రాసినారు. భైరవకవి వ్రాసిన కవిగజాంకుశముగాని తిక్కన సోమయాజి పేరఁ జెప్పఁబడెడు కవివాగ్బంధముగాని యట్టివె. వానిలో దానికి మించిన యంశమేమో కాదు.

మనము కొన్ని ఛందోగ్రంథములఁ జూచినచో నవి సంకలన గ్రంథము లనునిర్ణయమునకు వత్తుము. అట్లే కవిజనాశ్రయములో మనకు నవసరములేని జైనవిషయముల నెత్తివేసి భీమకవి వ్రాసిన భాగమును జేర్చియుందురు. అట్లే కవిజనాశ్రయములోఁ జేరిన ఛందః ప్రశంసాపద్యములు గూడ భీమనవియే యని తెలిసికొనవచ్చును. అంతియెగాక ఇప్పటి ముద్రితగ్రంథములలోఁ బ్రక్షిప్తముల క్రిందఁ జేర్చఁబడినవానిలోఁ బెక్కు భీమన ఛందస్సులోనివని గ్రహింప

వచ్చును. అట్లు కవిజనాశ్రయము భీమన ఛందస్సు గలిసిపోయినపి పైనఁ జెప్పిన విధముగా వానిని వేఱుచేయవచ్చును.

పూర్వలాక్షణికులు లింగమగుంట తిమ్మనవంటివారు భీమన ఛందము భీమన మతము అని పేరుపెట్టి స్పష్టముగాఁ జెప్పిరి గాని రేచన పేరితోఁగాని కవిజనాశ్రయమను పేరితోఁగాని కలుపలేదు. కాని యిట్టి కలగలుపు అప్పకవి కాలమునకు ముందే జరిగినదని చెప్ప వచ్చును. అందుచేతనే యప్పకవి కవిజనాశ్రయములోని యసందర్భ ములను జూచి యిట్లు వగచినాఁడు—

ఆ.వె. వికటకవులుఁ గొన్ని వింతలు గల్పించి
కవిజనాశ్రయమునఁ గలిపినారు
వానిఁ గైకొనంగవలఁ దప్రయుక్తంబు
లేల సెప్పు భీముఁ డెఱిఁగి యెఱిఁగి.

(అప్ప. ద్వి. ప. 260)

ఆయా భాగములను వేఱుసేయు మార్గమెఱుఁగక కడపటికి నాతఁడు— కవిజనాశ్రయమందలి 'శ్రీకాంతా' అను పైన స్తుతిపద్యము భీమనదే యని నిర్ణయించుకొన్నాఁడు. ఇది తప్పుకదా !

అయినచో రేచన భీమనల కాల మెద్ది ? రేచన యను పేరు మనకాలమున వ్యవహారములోఁ గనఁబడదు. కాని పూర్వకాలమున నుండెడిది యనుటకు నుదాహరణములు ? గలవు. కన్నడభాషలో ప్రశస్తకవియైన రన్నఁడు క్రీ. శ. 993 ప్రాంతపువాఁడు. ఆతఁడు వైశ్య కుల జుఁడు. అజితపురాణము సాహసభీమ విజయము(గదాయుద్ధము), రన్నకందము అను నిఘంటువును రచించెను. రన్నఁడు వేంగీదేశ నివాసి పిమ్మట కన్నడదేశమునకుఁబోయి యాస్థానకవియై కావ్యరచనఁ గావిం చెను. ఆతని తండ్రిపేరు జినవల్లభేంద్రుఁడు. సోదరులపేర్లు — దృఢ

సాహు రేచన[4] నూరయ్య కళింగదేశమును పాలించిన అనంతవర్మ చోడగంగుని (క్రీ. శ. 1076–1147) సంధి విగ్రహికుని పేరు [5]సొమ్ముల రేచన. కాఁబట్టి రేచన యను నామములు పూర్వమందుఁ గలవు.

రేచన తా నొక్కఁడె కవిజనాశ్రయమును రచింపలేదు. ఆతనికి వాచకాభరణుఁ డను మఱియొకఁడు సహాయపడెను. ఆసహాయుని గుఱించి మనకు వేఱేమియుఁ దెలియదు.

పూర్వకాలము హిందూమతము ముఖ్యమైనను, జైనమతము గూడ ఆంధ్రదేశమంతట నక్కడక్కడ నుండెడిది. కాఁబట్టి రేచన యేప్రాంతపువాఁడో స్పష్టముగాఁ జెప్ప లేము. కాని యటు తర్వాతఁ జెప్పఁబడిన విషయములనుబట్టి యాతఁడు రేనాటి (కడపజిల్లా) సీమ యందుండిన నుండవచ్చును.

కవిజనాశ్రయమును గుఱించి యాప్పిరంగులమ్‌కారిక్లైలోఁ దడుమఁ బడియుండుటచే, రేచన పండ్రెండవ శతాబ్దికిఁ బూర్వమువాఁడని నిశ్చ యమగుచున్నది. అటులైన నింకను సూక్ష్మముగా నిర్ణయించుటకు సాధనము లున్నవా ?

నన్నయ మహాకవి ఆంధ్రమహాభారతములో[6] ఆఱు యతులను మాత్రమే వాడినాఁడు. కవిజనాశ్రయములో యతులు నాలుగని తెలియఁబఱచుటచే నాగ్రంథము నన్నయకుఁ బూర్వపుది యని తేలు చున్నది.

నన్నయభట్టు రగడలను వ్రాయలేదు. ఆతని కాలమున కింకను రగడలకు రాజాస్థాన కవిత్వములో స్థాన మేర్పడలేదు. రగడల

4. ఆంధ్రపత్రిక, ప్రమోదూత సంవత్సరాది సుచికలో పెనుమత్ర్తి వేంకట రత్నముగారి 'కన్నడ వాఙ్మయములో ఆంధ్రకవులు' అను వ్యాసము. పుట 83.

5. రాళ్లబండి సుబ్బారావుగారి కళింగదేశ చరిత్ర. పుట 158.

6. నిడదవోలు వేంకటరావుగారి తెనుఁగుకవుల చరిత్ర. పుట 131.

లను జూచి, ఆతఁడు క్రీ.శ. 828–882 వఱకు నున్న వాఁడని నిర్ణయిం చితిని. కుమారసంభవము క్రీ.శ. 853 ప్రాంతపు రచన కావచ్చును. కుమారసంభవ కవిజనాశ్రయములలో నొండు రెండు సమానరచనలు గలవు. కవిజనాశ్రయములోని యంశములనె కుమారసంభవ కర్త గ్రహించి యుండును. కాఁబట్టి కవిజనాశ్రయమె తొలుతటి గ్రంథము. దీని రచన క్రీ.శ. 840–50 మధ్య కావచ్చును.

మల్లికార్జున మునియు, జైనుఁడైన వాదీంద్రచూడామణియు దగ్గరలో నున్నవారు గాకున్న వాదోపవాదములకు నవకాశ మీలుం డదు. కాఁబట్టి వాదీంద్రుఁడు గూడ మల్లికార్జునమునివలె నేనాటివాఁడు గావచ్చును.

క్రీ.శ. 840 ప్రాంతపువాఁడును, రాష్ట్రకూట మహారాజునైన నృపతుంగుఁడు కవిరాజమార్గమను లక్షణగ్రంథమును సృష్టించినాఁడు గదా! దానికిని, కవిజనాశ్రయమునకుఁ గల సమానలక్షణములను గూడ బైటపెట్టవచ్చును.

వేములవాడ భీమకవి విషయమేమి? ఇప్పటి కాలములో వేములవాడయను పేరుగల గ్రామములు రెండు చోట్లఁగలవు– కరీం నగరుజిల్లాలో నొకటియు, తూర్పుగోదావరిజిల్లాలో నొకటియు. వీనిలో మొదటి దాని పూర్వపుపేరు. లేములవాడ కాని వేములవాడ కాదు.[9] ఇది శాసనాధారము. దానికి తరువాతివా రెవరో వేములవాడ అని పేరుపెట్టి భీమకవి యిచ్చటివాఁడె యను నైతిహ్యమును సృష్టించిరి. కాఁబట్టి భీమకవి తూర్పుగోదావరిజిల్లాలోని దాక్షారామము సమీప మునసున్న వేములవాడ గ్రామస్థుఁడై యుండవలెను. రాజమహేంద్రవర మున కింతసమీపమున నుండఁబట్టియె నన్నయ భారతమునకును, భీమ

9. నన్నెచోడదేవ దేశకవి - కిన్నెర పత్రిక 1954 ఏప్రిల్, మే నెలలు.

నకును సంబంధించిన కొన్నిపుక్కిటి పురాణములు బయలుదేరినవి. ఆ విషయ మట్లుండనిండు. ఈతఁడు దాక్షారామ భీమేశ్వరదేవునియొక్క నందనుఁడ నని ప్రకటించుకొన్నాఁడు. దాని నిజమెట్లున్నను కవిజనాశ్రయములో-

క. పరగిన విమలయశోభా
సురచరితుఁడు, భీమనాగ్రసుతుఁ డఖిలకళా
పరిణతుఁ డయ్యును, భూసుర
వరప్రసాదితోదితధ్రువశ్రీయుతుఁడై. (కవిజ. పుట 1)

క. జననుత భీమతనూజా !
సునయార్జితవిభవతేజ ! సుభగమనోజా !
వినుతవిశిష్టసమాజా !
యన నంత్యప్రాసమగు నహర్పతి తేజా ! (ఆ.క. పుట 25

అనిచెప్పఁబడిన పద్యములు భీమన తన్నుఁగూర్చి చెప్పుకొన్నవియె. భీమకవి కాలనిర్ణయములో నిప్పుడు బాధలేదు. నిడదవోలు వేంకటరావుగారు పూసపాటి రాచరాజు రచించిన మాలికనుబట్టి వారి తెనుఁగు కవుల చరిత్రలో భీమన క్రీ. శ. 1100–1180 మధ్యవాఁడనియు, ఆతని చాటువులలోఁ జెప్పఁబడిన రాజరాజ చోడగంగు, చాళుక్య నాథుఁడు, మైలను భీముఁడు మొదలైనవారి కాలముగూడ నదేయనియు స్థిరపఱచి యున్నారు. భీమకవి శాపానుగ్రహశక్తి యుక్తుఁడుగాఁ బేరుగాంచియున్నాఁడనువిషయ మెల్ల రెఱిఁగినదే ! ఆతని శీఘ్రశక్తిని శ్రీనాథుఁడే-

సీ. వచియించె వేములవాడ భీమనభంగి
నుద్దండ లీల నొక్కొక్కమాటు

10. ఇమ్మడి అరికేసరిభూపాలుని వే(రే)మ్బులవాడ శిలాశాసనము - భావరాజు వేంకటకృష్ణారావు రచితము - భారతి పరిజోత్పత్తి శ్రావణమాసము.

అని ప్రశంసించియున్నాఁడు. భీమకవి వ్రాసిన యితర గ్రంథములు నేటివఱకు బైటఁబడకుండుట మన దురదృష్టము.

నేను పైన వివరించిన ప్రకారమును, కవిజనాశ్రయమునుండి భీమన ఛందస్సును వేఱుచేసి రెండు గ్రంథములను విడివిడిగాఁ బ్రకటించుకొనవచ్చును.

# మేఘసందేశసమీక్ష - పూర్వార్థము.

పుచ్చా వాసుదేవపరబ్రహ్మశాస్త్రి.

'నాటకాంతం కవిత్వ' మనునట్లు కాళిదాసమహాకవి యభిజ్ఞానశాకుంతలమునే తనయుత్కృష్టతమరచనగా రూపొందించియుండు నని పలువురువిమర్శకులసమ్మతి యైయున్నది. కాని సావధానముగఁ బరిశీలించుచో శాకుంతలమం దతిప్రసిద్ధముగాఁ గొనియాడఁబడుశ్లోకచతుష్టయమును మించుశతాధికశ్లోకములు మేఘసందేశమునం దామహాకవియొక్క ప్రతిభావిశేషమునకుఁ బరమావధిగా కానవచ్చును. వర్షాగమమునందు నీలగిరిప్రాంతమువంటి యొకపర్వతరమణీయసన్నివేశముచేఁ బ్రేరితుఁడైన మహాకవి తనకు పొంగిపొరలినభావములనందు స్వల్పవ్యవధిలోనే మార్చినట్లు తోఁచును. ఇతరరచనలలో కథానుగుణముగాఁ బాత్రలను స్వీకరించి సందర్భోచితముగాఁ దనప్రతిభావిశేషమును వ్యక్తముచేసెను. ఈపాటిపారతంత్ర్యముగూడ గిట్టక ఆ పర్వతమధ్యమున తొలకరిమబ్బు తటస్థపడఁగనే కవి తనస్వేచ్ఛాభావములను విశృంఖలముగా వ్యక్తముచేసిన స్వతంత్ర్యకావ్య మిది. అందుచే నీకావ్యమున "కాంతాసమ్మితతయోపదేశయుజే" యనెడి కావ్యోద్దేశము మఱుగుపడినది. కవి తనకవితాతృష్ణను రసపిపాసను తీర్చుకొనుటయే యిందలి పరమార్థము. ప్రకృతిరమణీయతను ప్రధానమైనకథావస్తువుగ గ్రహించి యక్షదంపతులను చిత్రకారునిభిత్తివలెను గాయకునిశ్రుతివలెను వినియోగించుకొనెను. దీనికంతకు మేఘుఁడే ప్రేరకుఁడు.

> "తస్య స్థిత్వా కథమపి పురః కౌతుకాధానహేతో
> రన్తర్బాష్పశ్చిరమనుచరో రాజరాజస్య దధ్యౌ
> మేఘాలోకే భవతి ... ... ... ..." ప్ర. 3.

అని తనయావేగమునకు మేఘాలోకనమును హేతువుగా సూచించును. తనస్వేచ్ఛాసృష్టిని సహృదయులు మన్నింపవలెనన్నట్లు,

"ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యకస్తం యయాచే
కామార్తాహి ప్రకృతికృపణాశ్చేతనాచేతనేషు." ప్ర.5.

అని ముందుగనే యక్షునిద్వారా సర్దుబాటుచేయుచు కావ్యవైలక్షణ్యమును వ్యక్తముచేసెను.

ధూమజ్యోతిస్సలిలమరుద్రూపమై జడమైనను నైరృతిఋతుపవనముల (South west monsoons) లో అతివేగముగా పరుగిడుచుఁబోవుచున్న ఆమేఘుఁడే తనయార్తి నాలించి ప్రేయసికి వార్తను శీఘ్రముగా నందఁజేయఁగలఁ డని యక్షునకాశ కలిగినది. ఇట్టి ప్రియవార్తలను జేరవేయుట కొకవిధముగా జడులే యోగ్యులని చెప్పుట కూడ నిచట గమ్యమానమగుచున్నది. లేకున్నచో శాకుంతలమందు దుష్యంతుఁడు తనశకుంతలానురాగమునుగూర్చి

శ్లో. 'పరిహాసవిజల్పితం సఖే పరమార్థేన నగృహ్యతాం వచః'
శా. 2-18

అని విదూషకునితో సర్దుబాటుచేయవలసివచ్చినట్లగును. అయినను శకుంతలాపునస్సమాగమసందర్భములో ఆమెనుగూర్చి తనకేల గుర్తుచేయలేదన్నట్లు దుష్యంతుఁడు ప్రశ్నింపఁగా విదూషకుఁడు తానాసన్నివేశమును పరిహాసముగనే గ్రహించినట్లు చెప్పి తనజడత్వమును ప్రదర్శించెను. ఇంతవఱకు బాగుగనే అనుకొనినాఁడుయక్షుఁడు. కాని ఆమేఘము హడావడిచూచుసరికి తనమనస్సుకూడ దానితోపాటు పరుగెత్తవలసివచ్చినది. ఆతొందఱలో తనయార్తినిగాని పంపఁదలఁచిన సందేశమునుగాని పూర్తిగా వ్యక్తముచేయలేక అతిసంక్షిప్తముగా,

"సందేశం మే హర ధనపతిక్రోధవిశ్లేషితస్య
గన్తవ్యా తే వసతిరలకానామ యక్షేశ్వరాణాం
బాహ్యోద్యానస్థితహరశిరశ్చన్ద్రికాధౌతహర్మ్యా." ప్ర-7

అని తనకు మేఘుఁడు చేయవలసినసాహాయ్యము, వెళ్లవలసినచోటు

తొందఱలో దానిని తెలిసికొనుగుఱ్ఱు వీనిమాత్రము బస్సులోపోయే మిత్రునకు మనమేదైన ముఖ్యవార్తను చేయెత్తి కేకవేసి చెప్పినట్లు, చెప్పుకొనెను. కాని యింతటితోనే కవికిఁ గలతృష్ణ తీఱునా ? అందులకై

"ఆపృచ్ఛస్వ ప్రియసఖమముం తుఙ్గమాలిఙ్గ్య శైలం
వన్ద్యైః పుంసాం రఘుపతిపదై రఙ్కితం మేఖలాసు,
కాలేకాలే భవతి భవతా యస్య సంయోగమేత్య
స్నేహవ్యక్తి శ్చిరవిరహజం ముఞ్చతో బాష్పముష్ణమ్" ప్ర.12

మనము సాధారణముగా తొందఱగాఁబోవు మిత్రుని 'ఆగుమయ్యా కొంచెము' అనుచు చేయిపట్టుకొని కూర్చుండఁబెట్టినట్లు 'ఆపృచ్ఛస్వ' అని మేఘునితో చిత్రకూటశైలమును పరామర్శించి పొమ్మనిచెప్పెను. అందులకు శ్రీరామసంపర్కముచే నాశైలము పుణ్యప్రదమగుట యొక కారణము. సంవత్సరమున కొకసారటు వర్షాకాలమందుఁ గనుపించుట గనుక మిత్రుఁడగు చిత్రకూటమునకు విరహాంతసమాగమము వలన నయ్యేడి యానందమునిచ్చుట రెండవకారణము. ఇట్లు మేఘునికి పరమార్థము, స్వార్థము నెఱవేరునుగనుక కొంత తడవచట నాగుమని కోరును. కాన నీ రెండు హేతువులతోనే శ్లోకార్థము పర్యవసన్నమైనదని తలంచుట యుక్తముగ తోఁపదు. అలంకారపుష్టిగాని యిశరరసాభివ్యంజకతగాని యుండవలెను. యక్షుఁడుగాని వానిభార్యగాని యనుభవించుచున్న అన్యోన్యవిరహము శైలమునం దారోపింపఁబడెనని వ్యంగ్యార్థము స్ఫురించు ననవచ్చును. ఈవిరహులయార్తిని తీర్పవలెనన్న మేఘుఁడే తగినవాఁడని ప్రార్థనారూపమగు స్తుతి. అంతేగాక కవికిఁగల స్వార్థముగూడ నిందు నిగూఢమైయున్నది. ఆమేఘమచటఁ గొంతసేపాఁగి,కవి కొకరమణీయ దృశ్యమును ప్రదర్శించుచుఁ దనకవితాసృష్టి కాధారభూతముగ నుండుమని వ్యంగ్యముగాఁ గోరు

చున్నాఁడు. కనుక తొందఱగా మేఘునకుఁ ద్రోవలో గానవచ్చు వింతలు విశేషములు, గమ్యస్థానము చేరుకొన్న తరువాత యక్షుని భవనము, ప్రేయసి వీనిని వర్ణించుటతో తనకవిత నించుమించుగాఁ బూర్తిచేయును. కవియభిప్రాయ మంతవఱకే యని సువ్యక్తమగును.

పాప మాయక్షునిసందేశమునంతను సావకాశముగా వినుట కాతొలకరిమబ్బునకు స్థిమిత మేది? కావ్యము మిక్కిలి హ్రస్వముగాఁ బరిణమించునను సూచన పొడగట్టి ముందు తన కిష్టమగుమార్గాదివిష యములనుమాత్రము విపులముగా వర్ణించెను.

"మార్గం తావచ్ఛృణు కథయత స్త్వత్ప్రయాణానురూపం
సందేశం మే తదను జలద శ్రోష్యసి శ్రోత్రపేయమ్" ప్ర.13

అని మార్గవర్ణన ప్రారంభించును. తొలకరిసమయములో మేఘము లెక్కైనను యక్షనగరము వైపు ఉత్తరముగానే పోవుచుండును. కనుక మార్గవర్ణనము మానివేసి సందేశమునుమాత్రమే విపులముగాఁ జెప్ప వచ్చు. కాని అది యిష్టముకాదు. ముందుగా మార్గమునుగూర్చియే వినవలెనఁట. సందేశమును 'తదను' అని తేల్చివేసెను. అంతేగాక మార్గము విషయములో 'శృణు' అని విధ్యాద్యర్థక 'లోట్'ను సందే శముపట్ల 'శ్రోష్యసి' అని సామాన్య భవిష్యదర్థక 'ల్యృట్'ను ప్రయో గించెను. ఈ 'ల్యృట్'ను విధించెడి 'ల్యృట్ శేషేచ' (3-3-13) అనే పాణిని సూత్రమునకు 'భవిష్యదర్థాద్ధాతో ర్ల్యృట్ స్యాత్ క్రియార్థా యాం క్రియాయాం అసత్యాం సత్యాంచ' అనిభట్టోజీదీక్షితులవృత్తి. సందేశశ్రవణము పాక్షికముగా లేకున్నను 'శ్రోష్యసి' అని సామాన్య భవిష్యత్తును వాడవచ్చును. కావ్యరచనలో కవి తాత్పర్యము మార్గ వర్ణనాదికముననే ప్రాధాన్యమిచ్చుటగాని సహృదయులకు ఉపదేశ రూపమునఁ బర్యవసింపఁగల సందేశమును విపులీకరించుటకాదు. ముందు మార్గమునుగూర్చి వినుము. తరువాత సందేశమునుగూర్చి అవకాశ

మునుబట్టి వినిన వినెదవుగాని (లేకపోయిన లేదు)అనెడిభావమును పై క్రియాప్రయోగములు స్పష్టముచేయుము. ఇదేభావము ముందుకూడ కొన్నిసందర్భములలో వ్యక్తమగును.

"ఉత్పశ్యామి ద్రుతమపి సఖే మత్ప్రియార్థం యియాసోః
కాలక్షేపం కకుభసురభౌ పర్వతే పర్వతే తే" ప్ర. 23

'మిత్రసందేశమును త్వరగా అందింపవలసినబాధ్యతను గుర్తించి నీవు శీఘ్రగమనముగా వెడలువాఁడవైనను మార్గములో నున్న ప్రతి పర్వతసౌందర్యమును ఉపేక్షించి ఆనందింపకుండఁబోయెదవు సుమీ ! అక్కడ నీకు ఆలస్యము తప్పదు' అని హెచ్చరించుచు. అంతేకాదు

"నీచైరాఖ్యం గిరిమధివసే స్తత్ర విశ్రామహేతోః" ప్ర.26

(విదిశాప్రాంతమునందున్న నీచైరాఖ్యపర్వతముమీఁద విశ్రాంతి తీసికొనవలెను.)

"తాం కస్యాంచిద్భవనవలభౌ సుప్తపారావతాయాం
నత్వా రాత్రిం చిరవిలసనాత్ ఖిన్నవిద్యుత్కళత్రః" ప్ర.42

(ఉజ్జయినిలో నేదైన భవనముమీఁద ఆరాత్రి గడపవలెనఁట)

"వక్ష్యస్యధ్వశ్రమవినయనే తస్య శృఙ్గే నిషణ్ణః" ప్ర. 56

(హిమవచ్ఛిఖరముమీఁద విశ్రమించి మార్గాయాసమును పోఁగొట్టుకొనవలె) బతిమాలి చేయించుకొనవలసిన కార్యకర్తకు అంతరాయముగా నిట్లు మేఘుని సావకాశముగా మార్గసౌందర్యమును దిలకించుచుఁ బొమ్మని చెప్పుటనుబట్టి కవి మార్గవర్ణన కెట్టిప్రాముఖ్యము నిచ్చెనో తెలియఁగలదు.

ఇంక మేఘుడు బయలుదేరునప్పుడు విశేషమును

"అద్రేః శృఙ్గం హరతి పవనః కిం స్విదిత్యున్ముఖీభి
ర్దృష్టోత్సాహశ్చకితచకితం ముగ్ధసిద్ధాంగనాభిః" ప్ర.14

అని మిక్కిలి స్వాభావికముగా ఉత్ప్రేక్షించును. ఈనల్లటిమబ్బు ఆ

చిత్రకూటశిఖరముతో తాదాత్మ్యమును బొందెను. అది బయలుదేరి పోవునపుడు గాలివేగమునకు పర్వత శృంగమే కొట్టుకొనిపోవుచున్న ట్లగుపడునఁట. ఆ పర్వతప్రదేశము మేఘమండలమునం దుండుటచే నిం దతిశయోక్తికిఁ దావులేదు. ఇట్టిప్రకృతిసౌందర్యము ఉదకకుండ లమువంటి పర్వతప్రదేశములలో మిక్కిలి సామాన్యముగఁ గనఁబడు చుండును. ముగ్ధ రాండ్రగు సిద్ధాంగనలకు మాత్రమే భ్రమనుగలిగిం చెడి యీప్రకృతిశోభ తనకవితలో సహృదయులకు ప్రమగనే అనఁగా స్వాభావికమైనదిగనే గోచరింపవలెనని మహాకవితాత్పర్యము సిద్ధాం గనల నాశ్చర్యచకితలనుగాఁజేయుట మేఘుని కొంకదుర్కారణమని 'దృష్టోత్సాహ' పదము సూచి చును.

మఱియొక వర్ణనము:

> "రత్నచ్ఛాయా వ్యతికర ఇవ ప్రేక్ష్యమేతత్పురస్తాత్
> వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుఃఖండ మాఖండలస్య,
> యేన శ్యామం వపురతితరాం కాంతిమాపత్స్యతే తే
> బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః" ప్ర. 15

ఇందు తమకెదురుగా కనుపించుచున్న ఒక ఇంద్రధనుస్సు వర్ణింపఁ బడును. మేఘసమీపమున ఇంద్రధనుస్సు విచిత్రవర్ణములతో రత్న కాంతుల మిశ్రమముగాఁ గనిపించుట సహజమే. కాని అది 'వల్మీకా గ్రాత్ప్రభవతి' (పుట్టకొననుండి పుట్టుచున్నది)అని చెప్పుటమాత్రము కొంచెము అపరిచితముగనే తోఁచును. సామాన్యముగా ఇంద్ర ధనుస్సు చెట్లమీఁదినుండి గుట్టలమీఁదినుండి బయలుదేరునట్లు కని పించుట చూచుచుందుము. అది అందముగా ఆకాశములో కనిపించు టయే ప్రధానముగాని అది యెక్కడినుండి బయల్దేరినదన్నేప్రశ్న సామాన్యముగా నెవ్వరికిని తట్టదు. దానిని 'వల్మీకాగ్రాత్ప్రభవతి' అని కవి చెప్పుచున్నాఁడు. ఈప్రయోగమునకే సార్థక్యము మృగ్య

మనుకొను చుండ, 'వల్మీకాత్ వామలూరువివరాత్' అనే మల్లినాథుని వ్యాఖ్యతో మఱొక సమస్య బయలు దేరినది. చెట్లమీఁదినుండి గుట్టల మీఁదినుండి బయలుదేరినట్లే పుట్టమీఁదినుండికూడ ఇంద్రధనుస్సు పైకిరావచ్చునని యెట్లో సమాధానపఱచుకొందమన్నను వ్యాఖ్యాత పుట్టకన్నములోనుండి పుట్టినదని చెప్పుచున్నాఁడు. ఏమిటి యీసొంపు? ప్రాచీన దేవాలయాదులలో ద్వారములపైన మకరతోరణములనఁబడే అర్ధవృత్తాకారపు శిల్పాలంకరణములను దఱుచుగాఁ జూచుచుందుము. అవి యిరువైపుల మకర ముఖములనుండి బహిర్గతమగుచున్నట్లు చెక్కబడియుండును; గనుక వానిని మకరతోరణము లందురు. వీనినే హంస ముఖములనుండి బహిర్గతమగుచున్నట్లు చూపిన హంసతోరణము లందురు. అట్లే యక్షులముఖములనుండి వచ్చుచున్నట్లుగాని వారిచేతులలో నిలువఁబెట్టినట్లుగాని తోరణములను జూపుట శిల్ప సంప్రదాయము అమరావతి, నాగార్జున కొండలందున్న బౌద్ధశిల్పములలోఁగూడ నిట్టితోరణములు బహుళముగాఁ కనిపించును. సుమారొక అర్ధశతాబ్దికిఁ బూర్వముకూడ మనగృహనిర్మాణములో ద్వారముల ఉత్తరమునకిరువైపుల దారునిర్మితములైన మకర (లేక హంస) ప్రతిమలు అమర్చఁబడుట వాస్తుసిద్ధమైన యాచారముగ నుండెడిది. అట్టి తోరణము లలంకరణము లగుటయేగాక అవిగలద్వారములనుండి నడచుట శుభప్రదమని వాస్తు సమ్మతము. ప్రస్తుతము మేఘునియొక్క నిర్గమన ద్వారమునుకూడ ప్రకృతియనెడి శిల్పిచే నిర్మింపఁబడిన సుందరమగు వల్మీకతోరణముతో అలంకరించి అందుగుండా పోవుట శుభశకునమని మహాకవి సూచించెను. ఆ యింద్రధనుస్సు రంగులనుమ నీనల్లని మేఘుడు పోవుచున్న నెమిలిపింఛము ధరించిన గోపాలకృష్ణునివలె నుండునని కార్యార్థి గనుక యక్షుఁడు మేఘుని స్తుతించును. ఇంద్రధనుస్సులోఁ గనిపించెడి మేఘమున కట్టి శోభ యస్వాభావికముగాదు.

ఇచట వెనుకఁ జెప్పినట్లు అచేతనమగు మేఘము నొకపురుషునిగామార్చి దానిద్వారా తనప్రియసందేశము పంపింపవలెనన్నట్లు దానిని ఉత్కృష్టవిలాసపురుషుఁడైన శ్రీకృష్ణపరమాత్మతోఁ బోల్చెను.

ఈవిధముగా ప్రయాణముకాఁగా త్రోవలో తటస్థపడు ఆమ్రశైలము, నర్మదానది, విన్ధ్యారణ్యములు మున్నగు ప్రకృతి సౌందర్యస్థానములతో వర్షాగమ మేఘసంపర్కముచే నేర్పడుశోభాతిశయము నత్యంత స్వాభావికముగా హృదయంగమమగునట్లు వర్ణించెను. తదుపరి తన కభిమానవిషయమగు ఉజ్జయినీనగరము మార్గములో లేకపోయినను దానినిచూచి తీరవలె ననిచెప్పెను.

> "వక్రః పన్థా యదపి భవతః ప్రస్థితస్యోత్తరాశాం
> సౌధోత్సఙ్గప్రణయి విముఖో మాస్మభూరుజ్జయిన్యాః,
> విద్యుద్దామస్ఫురితచకితై ర్యత్ర పౌరాఙ్గనానాం
> లోలాపాఙ్గై ర్యది 'నరమసే లోచనై' ర్వఞ్చితః స్యాః" ప్ర 28

తొలకరిసమయములో వీచు ఋతుపవనములు దక్షిణదిక్కున నీలగిరి వంటి ప్రాంతమున దేశములోఁ బ్రవేశించి యీశాన్యదిశను జూచుచు నుత్తరముగా హిమాలయములు చేరుచుండును. కాని మేఘునికి కవి చూపింపఁదలఁచిన యుజ్జయిని చిత్రకూటమునకు పడమటివాలుగా నుండును. త్రోవలోనే యున్నదని చెప్పి దానిని వర్ణించి సహృదయులను తనకవితాధోరణిలో మభ్యపెట్టక భౌగోళికముగా స్వభావసిద్ధమైన మార్గవక్రతను 'వక్రఃపన్థాయదపి' యని చక్కఁగా కంఠోక్తిగా జెప్పెను. అంతేగాక దౌత్యకర్మలో మేఘున కిందువలన నగు నాలస్యమునుగూడ లెక్కింపక ఆ యుజ్జయినికి వెళ్ళి తీరవలెనఁట. పైపెచ్చు ఆనగరములోని విలాసినులదృక్కులను మేఘుఁడు తన విద్యుత్కాంతిచే మిఱుమిట్లుగొలిపి వారు పడెడి చీకాకునుజూచి ఆనందింపకపోయిన జన్మము వ్యర్థమేయనునట్లు బలాత్కరించిచెప్పెను. ఇట్లే పైనఁజెప్పఁ

బడిన "అద్రేః శృఙ్గం హరతి పవనః కింస్విత్." అను శ్లోకములోఁగూడ ముగ్ధసిద్ధాంగనలు కొండ యెగిరిపోవుచున్నదని ఆశ్చర్యచకితులై చూచునట్లుచేసి మేఘుడు ఆనందింపవలెనఁట. యువకులు స్త్రీలయెడఁ బ్రదర్శించు విలాసచేష్టల నింత రమ్యముగా వ్యక్తముచేయుటకే కవి యీ స్వతంత్రరచనకుఁ బూనుకొనె నని తోఁచును. ఉజ్జయినీసౌందర్యమును పదునాలుశ్లోకములలో వర్ణించును. మహాకాళమనఁబడు చండీశ్వరాలయములో జరుగు సాయంకాలపూజను జూచి పునీతుఁడు కావలెనఁట. అందులకుఁగాను మేఘుఁడొకవేళ అక్కడికి ముందుగాఁ జేరుకొన్నను సాయంకాలముదాఁక నచట నుండి దానిని జూచిపోవలెననును. కన్యాకుమారికిఁబోవు యాత్రికులు సాధారణముగా నచటి సముద్రములో సూర్యోదయ సూర్యాస్తమయములందలి మనోహర దృశ్యములను పనిపెట్టుకొని చూచిగాని వెళ్లరు. అట్లే చండీశ్వరుని సాయంకాల పూజకూడ. కరాత్రి యచటనే బసచేయుమని చెప్పెను

"తాం కస్యాంచిద్భవనవలభౌ సుప్తపారావతాయాం
నీత్వా రాత్రిం చిరవిలసనాత్ఖిన్నవిద్యుత్కళత్రః," ప్ర. 42

పైనఁ జెప్పినట్లు ఆరాత్రి పూర్వభాగమందు విలాసినులను తనవిద్యుత్ప్రదర్శనములతో చీకాకుపఱచుచు ఆనందించి ఆమీఁదట మెఱుపులు క్షీణించును గనుక నేదేని భవనపుటుపరిభాగమందు విశ్రమించి రాత్రి గడపవలెను. మఱునాఁటిప్రొద్దుట సూర్యోదయానంతరము మంచునీళ్లు ఆఱునంతవఱ కుండిపోవలెనఁట.

"తస్మిన్కాలే నయనసలిలం యోషితాం ఖణ్డితానాం
శాన్తిం నేయం ప్రణయిభిరతో వర్త్మ భానో స్త్యజాశు,
ప్రాలేయాస్రం కమలవదనాత్సోఽపి హర్తుం నలిన్యాః
ప్రత్యావృత్తస్త్వయి కరరుధి స్యాదనల్పాభ్యసూయః" ప్ర.43

ఆనగరములో సూర్యోదయసమయము ప్రియులు తమఖండితనాయిక లను కన్నీరుతుడిచి యోదార్చువేళ. సూర్యుఁడుకూడ పద్మలతల కమలముఖమునుండి 'మంచును తొలఁగించువేళ. ఉభయులు నాయి కాంతరాసక్తులయి రాత్రియంతయు గడిపి ఉదయసమయమునఁ దమ ఖండితనాయికలయొద్దకు తిరిగివచ్చి వారి నోదార్చుటకు త్వరపడు చుందురు. కనుక వర్షరూపముననఁగాని, ఛాయారూపముననఁగాని యీ యిద్దరి 'పనులకు మేఘుఁ డడ్డుపడఁగూడదు. కొంచెము ప్రొద్దెక్కు వఱకు వేచియుండి పొమ్మని భావము. ఉజ్జయినిలోని మనోహర దృశ్య ములను సాయంసాలము, రాత్రివేళ, ప్రొద్దుటఁజూచి ఆనందింపవలెనని యర్థము. ఈనగరము నింతగాఁ బ్రశంశించుటనుబట్టియే యీ మహా కవియొక్క నివాసస్థానము ఉజ్జయిని కాఁదగునని తలంపఁబడు చున్నది.

తరువాత గంభీరానదిని వర్ణించుచు ఆరమణీయతను చవి చూచిన మేఘుఁడు ముందునకు సాగిపోవుట కష్టసాధ్య మనును.

"ప్రస్థానం తే కథమపి సఖే లమ్బమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః" ప్ర. 45

ఇంతకుఁ బూర్వము

"నస్యాదన్యో హ్యహమివ జనో యః పరాధీనవృత్తిః" ప్ర.8

అని తనప్రియురాలిని గలియుటలో ప్రతిబంధకమయిన పరాధీనవృ త్తిని నిందించినయక్షుఁడు తన సందేశవిషయమును బూర్తిగా తృణీక రించి మేఘునకు ఆగంభీరానదీసౌందర్యమును జూపించుటయే తన పరమాశయముగా వ్యక్తపఱచును. ఎంతటి ప్రకృతిరమణీయదృశ్యము నచట కవి స్వయముగాఁ దిలకించి యీ శ్లోకమును జెప్పెనో యని పించును. ఆనదీసౌందర్యమును జూచినపిమ్మట మేఘుఁడు దానిని విడిచి పోలేకపోలేక ఉస్సురుమనుచుఁ బోవలసినదేయఁట 'కథమపి'

'లంబమానస్య' అనేపదములలో బలవంతముగాఁ బోవుట స్ఫురించును. 'కో విహాతుం సమర్థః' అని ప్రశ్నించుటలో తానే యగుచో విడిచిపెట్టి పోయెడిమాట యబద్ధమని కవీశ్వరుని యభిప్రాయము. మేఘుని నిజముగా నలకానగరమునకు త్వరగాఁ పంపఁదలఁచినవాడైన నిట్టి ప్రలోభమును మార్గమధ్యమున కల్పింపఁడుగదా యక్షుఁడు. 'వక్రః పన్థాః' అనుసరికే కవి కావ్యోద్దేశము అడ్డముతిరిగి పాఠకులకు ఉజ్జయినీప్రాంతపు ప్రకృతిరమణీయతను, ముందు మఱికొన్ని విశేషములను జవిచూపుటముగాఁ బరిణమించినది,

ఈ విధముగా అడుగడుగునకు తాను స్వయముగా చిత్రకూట పరిసరములందును, ఉజ్జయినీప్రాంతమందును, హిమాలయములందును, జూచిన పర్వతవిశేషములను, నదులను, పల్లెలను, నగరములను, ఒకటేమిటి, యెక్కడెక్కడ ప్రకృతిసుందరి తన విలాసము చిందులాడునట్లు నాట్యమొనర్చెనదో యాయాప్రదేశములకన్నిటికి మేఘుని బలాత్కారముగానైనఁ బంపిచూపెట్టి వానిద్వారా సహృదయులకుగూఁడఁ జవిచుపవలెనని కవితాత్పర్యము. తన కథావస్తువులైన ప్రకృతియొక్క సహజరమణీయతకు మేఘుఁడొక ప్రధానాంగముగా గ్రహింపఁబడెను.

హిమాలయమునుగూర్చి రఘువంశ కుమారసంభవములలోఁ గూడ వర్ణనము కాననగును, అది సంతృప్తికరముగ లేదనట్లు మేఘునికిఁ బ్రత్యేకించి వినిపించును. అట్టితృష్ణ యీక్రిందిశ్లోకములను జూచిన వ్యక్తముకాఁగలదు.

రఘువంశములో,

"సకీచకైర్మారుతపూర్ణరంధ్రైః కూజద్భిరాపాదితవంశకృత్యమ్
శుశ్రావ కుంజేషు యశః స్వముచ్చై రుద్గీయమానం
వనదేవతాభిః" రఘు. ద్వి. 12

కుమారసంభవములో,

"యః పూరయన్ కీచకరన్ధ్రభాగాన్ దరీముఖోత్థేన సమీరణేన
ఉద్గాస్యతామిచ్ఛతి కిన్నరాణాం తానప్రదాయిత్వ

మివోపగన్తుమ్" కుమా ప్ర. 8.

మేఘసందేశములో,

"శబ్దాయంతే మధురమనిలైః కీచకాః పూర్యమాణాః
సంసక్తాభి స్త్రిపురవిజయో గీయతే కిన్నరీభిః
నిర్హ్రాదస్తే మురజఇవ చేత్కన్దరేషు ధ్వనిః స్యాత్
సంగీతార్థో ననుపశుపతే స్తత్రభావీ సమగ్రః" ప్ర. 60.

ఈ మూఁడు సందర్భములలోను వెదుళ్లు గాలిపోసికొని మధురముగా ధ్వనిచేయుటను అలంకారయుక్తముగా వర్ణింపవలెనని కవి యభిమతము. మూడువర్ణనలు ఒకదానికంటె మఱియొకటి రమ్యము గను పుష్టితరముగను ఉన్నవనుట స్పష్టము. మొదటి రెండుసందర్భములలోను వనదేవతలయొక్కగాని కిన్నరులయొక్కగాని గానముతో వెదుళ్లు తమ స్వరమును మేళవించి వక్తవ్యార్థమం దుపయోగపడుచున్నవి. మూఁడవసందర్భములోఁగూడ కిన్నరులు త్రిపురవిజయము గానముచేయుచుండఁగా వెదుళ్లు తమ స్వరమును మేళవింపజేయును. కాని యందలి గానసంపుటికి మృదంగమువలె మేఘునియురుములు, పర్వతగుహలనుండి వెలువడు వానిప్రతిధ్వనులు కలియుచో అచట నాట్యముచేయుచుండు శివునకు సర్వాంగసమృద్ధమైన సంగీతము అమరునఁట. వెదుళ్లధ్వనినిగూర్చి చెప్పెడిసంగీతవర్ణన తుదకు మేఘుని గూడ కలిపినగాని పూర్తికాలేదు. ఇంతకుమించి యీ కీచకధ్వని విషయములో వేఱొకవర్ణనయుండబోదు, ఇదియే సమగ్రమైనదన్నట్లు శ్లోకాంతమున 'సమగ్ర'పదప్రయోగము సూచించును.

ఇట్లు ప్రతిశ్లోకమునందు కవియొక్క ప్రతిభావిశేష మతిగంభీరముగ సహృదయవేద్యమై స్ఫురించుచుండును. ఈవర్ణనలన్నియు కావ్యసామాన్యలక్షణములై యున్నను ప్రతివర్ణనయందు ప్రకృతియొక్క సహజసౌందర్యమునకు మేఘసాన్నిధ్యమును జోడించి, అట్లు ద్విగుణీకృతమగు నాయారమణీయ దృశ్యములనే కథావస్తువుగఁజేసి తనసౌందర్య తృష్ణ తీరునట్లు పూర్వార్ధమందు మేఘునిపాత్ర నతిరమ్యముగా పోషించెను 'ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః' అని మొదటే మేఘునికి సందేశహరణమందు యోగ్యతలేదని స్పష్టముగా చెప్పెను గనుక కావ్యమందు మేఘపాత్రకిదియే సార్థకతయని వ్యక్తమగుచున్నది. లేకపోతే యీకల్పిత కావ్యములో మేఘునికిబదులుగా సందేశహరణ సమర్థమగు విమానమునివంటి వేరొకపాత్రను సృష్టించవచ్చునుగదా. దీనినంతనుజూడగ తొలకరియందలి రమణీయమేఘ మొకటి చిత్రకూటసమీపమున మహాకవియొక్క దృష్టిపథమునుండి తప్పించుకొనలేక కావ్యస్థముచేయబడినదని తెలియుచున్నది. నవీన కవితాదృక్పథమున కిదియొక పరమాదర్శము. ఆధునిక కవిలోకమున కా మహాకవి యొక పరమగురువు.

# నివాపాంజలి

విద్వాన్ వేమల శ్రీరామచంద్రకీర్తి, ఎం.ఏ. (ఆనర్సు) బి.ఇడి.

సీ|| ఎంతసామ్మైన వెచ్చించి శ్రీ సూర్యరా
యాంధ్రనిఘంటు వేయధిపుఁ డిచ్చె
దైవభక్తికి శాశ్వతమ్మైన గుఱుతుగా
బ్రహ్మమందిరము నేప్రభుఁ డొసంగె
గ్రాంథికవాణి నగ్రస్థానమున నిల్పి
పరిషత్తు నెప్డు నేప్రభుఁడు సాకె
విద్యాలయమ్ములు వెలయించి పోషించి
విపులవిఖ్యాతి నేవిభుఁడు గాంచె

గీ|| నతఁడు వేంకటసూర్యరాయక్షితీంద్రుఁ
డమరపురి కేఁగె కాలధర్మమున నేఁడు
పాంచభౌతికమై వినశ్వరమునైన
దేహమును వీడి; నిలిచెఁ దత్కీర్తియొండె.

గీ|| అతఁడు నిశ్శేషవిశ్రాణితార్థసారుఁ
డగుట శరదభ్రపాండురంబైన యశము
వెలుఁగుపుంతగ వెన్నంటి వెంట నిలువ
అమరపథగామియయ్యె, సూర్యావనిపతి.

ఉ|| రావుకులంబు ప్రాతనధరారమణాగ్రణు లేలుచున్న కోట గు
ఖావిలమయ్యెఁ బండితశిఖామణు లేరును లేరటంచు నా
దేవులపల్లిలోఁ గొలువు దీర్పఁగఁ బోయెనొ రామకృష్ణులన్
దేవులపల్లి సోదరుల దీరిచి కొల్వున నుండఁ బంపుచున్.

గీ|| పార్థివాబ్దంబు తన పేరు సార్థకముగ
సూర్యభూవరు జన్మచే శోభఁ గాంచె
శోభకృన్వత్సరము కృత్తశోభమగుచు
సూర్యనరనాథు గొనిపోయె నవార్యఫణితి.

క|| శ్రీపీఠీపుట భేదన
భూపాలకుఁ డమరపురికిఁ బోయినతఱి, సం
తాపనివాపాంజలి యిది,
తాపోపశమంబు గల్గుతన్ దత్ప్రజకున్.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

తాత్కాలికాధ్యక్షులు

విమర్శకాగ్రేసర, ఐతిహాసిక సమ్రాట్టు

శ్రీ బండారు తమయ్య

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు

సహాయ కార్యదర్శి

శ్రీ గువ్వావ్వరి సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహకవర్గ సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ
7. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
8. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు
9. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.
10. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, ఎమ్. ఏ. (ఆనర్సు)
11. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
12. శ్రీ కావలి శ్రీరామమూర్తి, బి. ఎ. బి. ఎల్.

పత్రికా సంపాదకుడు

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

## ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణములు

### శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | |
|---|---|
| 1వ సంపుటము | రు 6—0—0 |
| 2వ సంపుటము | 6—0—0 |
| 3వ సంపుటము | 6—0—0 |
| 4వ సంపుటము | 6—0—0 |
| 5వ సంపుటము | 10—0—0 |
| 6వ సంపుటము | 10—0—0 |
| 7వ సంపుటము | [ముద్రణములో నున్నది] |

### కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన పెనుకటి విషయసూచికయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణ కీనడుమ ముద్రితమైనది. వెల రు 1—50.

### మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున విరచితము. కొలగాని సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము మూల్యము రు. 2—50

ఆంధ్రసాహిత్యపరిషత్తు,
కాకినాడ.

Printed by J. Gopalam, B.A. L.T., at Republic Press, Kakinada
Edited by **C. PAPAIAHSASTRY**
Published by Andhra Sahitya Parishat, Kakinada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

## విశ్వావసు

## మాఘ-ఫాల్గుణములు

సంపుటము ౫౪ సంచిక ౬



దేశభాషలందు తెలుగు లెస్స.

Journal of the Telugu Academy

KAKINADA

Vol. 54 Part 6

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు :

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

విశ్వావసు మాఘ-ఫాల్గుణములు

సంపుటము 54  సంచిక 6

సంపాదకుడు : శ్రీ కందూరి ఈశ్వరదత్తు.



## విషయసూచిక

శ్రీ

# శ్రీ కాళిదాస నన్నెచోడకవులు –
# తత్కుమారసంభవములు

విద్వాన్ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి.

"కుమారసంభవము" అనఁగనే కాళిదాసకవి–రాజహంసము మన మానసములందు కనబడుచుండును. తెలుఁగుభాషలోఁ గూడ శ్రీ నన్నెచోడకవి ♦ "కుమారసంభవ" ప్రబంధమును రచించెను. ఈ ప్రబంధమందు "పూర్వాంధ్రము" యొక్క తీరు తెన్నులు కొన్ని గాన నగుచుండుటేగాక యీ కవిత "జాను తెలుఁగు" పదములతో జాలువారుచుండును.

ఈ చోడకవి జంగమ మల్లికార్జునుని దనగురువుగాఁ బేర్కొనుటచే నితఁడు శైవకవియని తెలియఁగలదు. ఇతని కుమారసంభవమును మునుముందు ముద్రించి పీఠికవ్రాసిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవి గారు ఈ చోడకవి క్రీ.శ. 940 సం.లోనున్నట్లువ్రాసిరి. మఱికొందఱు "ఇతఁడు నన్నయకుఁ బిమ్మటివాడని బేర్కొనిరి. ఇతని శైలి అట నట తిక్కన శైలి ననుసరించియుండుటచే నితఁడు తిక్కనకుఁ దర్వాతి వాఁడని మఱొక వాదము లేవదీసిరి.*

ప్రస్తుతము శ్రీ కాళిదాసనన్నె చోడకవుల "కుమారసంభవము" లలో గల "కవికల్పనల" లోని యౌచిత్యమును జూపుటయ యీ వ్యాసరచనలోని భావము.

"......అవారితసత్కవికల్పనావిశేషావహ పూర్వవృత్తములు సానలందీరిన జాతిరత్నములు" కదా! ఇట్టి జాతిరత్నములే మానవులకు సంతోషావహములై యిహపరసాధకములగుచుండుననుట విజ్ఞవిదితమే.

---

♦ఇతఁడు "కవిరాజశిఖామణి" అను బిరుదముకల వేంకటాదిత్యుఁడు *"చూ కుమారసంభవవిమర్శనము"
మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణము. 1935 సం.

ఈ చోడకవి కవికుల గురువుపైఁ దనప్రత్యేక భావము దెలుపుకొనినాఁడు.

క. భాసురమతి వాల్మీకి వ్యాసాదులుచనిన జగతినగకవితా సిం।
హాసనమెక్కి కవీంద్రులదాసులుగానేకి కాళిదాసుఁడు పేరెన్

పై ప్రత్యేక గౌరవభావమును చోడకవి, తద్వ్యాఖ్యాన[illegible]సరణరూపమునఁ బ్రకటించినరీతిని ఈ క్రింది యుదాహరణములు వ్యక్తముసేయగలవు.

స్థాణ్వాశ్రమములో అకాలవసంతప్రలక్షణములను వర్ణించుచు కాళిదాసు తన. కు. సం.లో "కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ గంతుం ప్రయాతే సమయం విలంఘ్య। దిగ్దక్షిణా గంధవహం ముఖేన వ్యలీక నిశ్వాసమివోత్ససర్జ॥" (3–25)

పై శ్లోకభావమును చోడగవి గ్రహించియుదే సంస్కృతము

క. తనసూడగు ధన దదిశాం
గననినుఁ డొసఁగూడఁ జోకగనియామ్య దిశాం
గన నొచ్చి వెచ్చ నూర్పనొ
యన శిశిరవిముక్త దక్షిణానిలమెసఁగన్॥ (4 ఆశ్వా)

ఇట్లే స్థాణ్వాఽశ్రమములో నకాలమున విజృంభించిన సమ్మోహనప్రకృతిని సర్వసమ్మోహనముగ వర్ణించును కాళిదాసు.

శ్లో. "మధుర్ద్విరేఫః కుసుమైకపాత్రే।
పపౌ ప్రియాం స్వామనువర్తమానః।
శృంగేణచ స్పర్శని మీలితాక్షీం
మృగీ మ కండూయత కృష్ణసారః॥" (కు. సం. 3–36)

శ్లో॥ దదౌరసాత్పంకజరేణుగంధి। గజాయగండూష జలంకరేణుః।
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాంగనామా॥ (కు. సం. 3–37)

పై శ్లోకభావములను గ్రహించి చోడకవి ఇట్లు

సీ. కరియిచ్చెనగమే సికరిణికి సల్లకీ।
పల్లవముల్లంబు పల్లవింప
మృగమర్ధిఁగబళించి మృగికిచ్చెనంచు
దర్భాంకురంబులు చిత్తమంకురింప
హంసపెక్కువనిచ్చె హంసికినోర్నోర
నెలదూడుమొగముల నెలమిమిగుల
భృంగము తావితో భృంగికి దయనిచ్చె
మధుధారమ్ముఖరాగముదముదలక (ఆశ్వా 4 ప. 469)

ఇట్లు భావక్రమమున దన స్వాంతంత్రతను జూపుచు నన్నెచోడ కవి చేసిన భావానుసరణ సందర్భములింకను ఎన్నియో నున్నవి. A కాళిదాసుపైని తెలుఁగుకవికిఁ గల మక్కువను జూపుటకే యీ యనుసరణములు చూపఁబడినవని మనవి.

ఇఁకనీకవు లిర్వురియొక్కయు కుమారసంభవములలోఁ గల "కల్పనల"ను గొన్నిటిని సరిపోల్చిచూచి, వానియందలి యౌచిత్యముఁను గన్గొందము.

తెలుఁగులో కావ్య కథోపక్రమణిక యిట్లుకలదు.

"—నాచెప్పం బూనిన దివ్యకథా సూత్రంబెట్టి దనిన, "సతి జన్మంబున్ గణాధీశ్వరుజననము దక్షక్రతుధ్వంసమున్ పార్వతీ జన్మంబున్-

ఇట "గణాధీశ్వరు జననము" ను వర్ణింపఁదలచిన చోడకవి కిఁబ్రసక్తానుప్రసక్తముగా సతీశివుల గజకేళి కూడ నవసరమైనది. ఈ వర్ణనలో చోడకవి, ప్రపంచమువకే ఆదిదంపతులైన సతీశివులంగూర్చి తన ప్రబంధములో

A చూ 5-41 కి తెలుఁగు 1-15, 5-60 కి తెలుఁగు 7-19; 5-9 కి తెలుఁగు 6-472; 3-42 కి తెలుఁగు 5-489 మొదలగునవి.

"ఆదిమూర్తులు శివశక్తులచలమతులు
హరుఁడు సతియును సురతార్థులై విహంగ
తరములగు మృగరూపముల్ దాల్చికొనుచుఁ
గాము మాయల నెవ్వాఁగ లేమిగారు।" (౨ శ్వా। ప. 104)

ఇఁకఁ గాళిదాసు తన కుమారసంభవములో

"........సతీ సతీయోగవిసృష్టదేహా తాంజన్మనే శైల వధూం ప్రపేదే"

అనిమాత్రమే "సతి జన్మంబు" ను సూచించి "గణాధీశ్వర జననమును" విడిచినాఁడు. వివరమున్నచోఁ గాళిదాసునకును "అచల మతులగు నాదిమూర్తులను" కాముమాయలలో జిక్కుకొనుఁ జేయ వలసివచ్చునేమో? తెలుఁగులోనికి వేంచేసియున్న శివశక్తులు "అచలమతులు" కదా! ఇట్టివారికి కాముని చేతిలో జిక్కుకొనుట యెందులకు గల్గినదో? పోనిండు. పురాణకథ ఏ ద్రావిడదేశమునందో అట్లున్నదని సమాధానమిచ్చెదరా? "........అన్యథాసా ప్రకల్ప్యేత్" అని కవులు ఇతిహాసమును మార్చవచ్చును కదా! కనుకనే కాళిదాసు తన దివ్యపాత్రయగు శివునకు సామాన్యమానవునకువలె నిట్టి పాట్లు లేకుండుటకై "గణాధీశ్వర జననకథను విడనాడెను. మన్మథుడు తనపై సమ్మోహనాస్త్రమును బ్రయోగించిన తరుణములోఁ గూడ నీ శివుఁడు తన చిత్తమును కామునకుఁ జిక్కనీయలేదు.

"అథేంద్రియక్షోభ మయుగ్మనేత్రః పునర్వశిత్వా ద్బలవన్నిగృహ్య। హేతుంస్వచేతో వికృతేః దిదృక్షుః। అని యీశ్వరుని" జితేంద్రియత్వమును కాళిదాసు "వశిత్వాత్" అనునొక్క విశేషణముతో నిలఁబెట్టి దివ్యపాత్రయొక్క దివ్యత్వమునిట దీపింపఁజేసినాఁడు.

(చూ. కు. సం. సర్గ 3. శ్లో 69)

ఈవర్ణనచే "భౌతికశక్తి, ఆధ్యాత్మికశక్తిని ఎప్పటికిని జయించ లేదు" అను పరమార్థము కాంతాసమ్మితముగ లోకమునకుబోధింపఁ

బడినది. ఈ మహోపదేశము తెలుఁగు కుమారసంభవములో విపర్యస్తమైనది. జగత్తునకే తల్లిదండ్రులైన యీదంపతులరతి, ధర్మప్రవణమై జితేంద్రియత్వ పూర్వకమైనపుడే జగత్తునకు మార్గదర్శకముగఁ బ్రసిద్ధము కాఁగలదు. మొత్తము పై తెలుఁగులోని "గజకేళి" కల్పనము జితేంద్రియుని, ఇంద్రియజితునిగా మార్చి విశ్వేశ్వరపాత్రకు "...విహీనతిరత్వమును" గల్పించినది. ఇంతియేకాదు.

"ఏకత్రైవానురాగశ్చేత్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా"

అనునాలంకారిక వచనమును బట్టి యిట (తెలుఁగులో) రసాభాసముగూడ కలిగినదనవచ్చును. కనుకనే మన కాళిదాసు ఇన్నియనర్థములతోఁ గూడిన యీ గజకేళికల్పనమును విడిచినాఁడు. "ఔచిత్యభంజనాన్నాన్యద్రసభంగస్యకారణ" మ్మనికదా యభియుక్తోక్తి. ఇట్టివే మఱికొన్ని కల్పనలు.

హిమగొండపై నేకాంతముగఁ దప మొనరించుచున్న యీశ్వరుని దర్శించుటకై చలిమల ఱేఁడు చనుదెంచు సందర్భమునఁ దెనుఁగులో "ఆహిమవంతుఁడప్పు...డవాజివరూథదంతి సామంత విలాసినీ స్వజనమంత్రి పురోహిత భృత్యయుక్తుఁడై"

"నిజకళత్రపుత్రీ సమేతుండై చనుదెంచి...నిజదేహాది సమస్త రాజ్యనిధనంబులు నీశ్వరు శ్రీపాదంబులకు నివేదించి

(ఆశ్వా 3-ప. 339)

ఉండఁగా "నిరతిశయ సమాధినిష్ఠలోనున్న యీశ్వరుఁడద్దానికి సంతసించి గిరిరాజునకు వరంబులొసంగెనఁట."

ప్రస్తుతమున శివునకు సతీవియోగము కలుగుటచే నతఁడు విముక్తసంగుఁడై యేకాంతముగాఁ దపస్సుచేసికొనుటకు అనువుగానున్న హిమవంతమునకు వచ్చినాఁడు. ఇట్టి యేకాంతవాసియొద్దకు ఉచ్చైశ్శిరస్కుఁడైన గిరిరాజు దండయాత్రకు వెడలినట్లు ఇంతదండుతో

వెళ్ళుట యిప్పుడనుచితముగాఁ దోఁచదు. సర్వసంగపరిత్యాగియైన వానికి "సమస్తరాజ్యవిభవసమర్పణము" ఎందులకు? ఈ విలాసినీ జనము అతని తపోభంగమునకు చక్కని సంసాధనము కాదా? ఈ యసందర్భములలోనే యొక్కటియు సంస్కృతమునఁ గానరాదు.

"అనర్ఘ్యమర్ఘ్యేణ తమద్రినాథః
స్వర్గౌకసామర్చిత మర్చయిత్వా।
ఆరాధనాయాస్య సఖీసమేతాం
సమాదిదేశ ప్రయతాం తనూజామ్" (కు. సం. సర్గ 1 శ్లో 58)

"నగరాజు, సర్వదేవతారాధ్యుఁడైన యీశ్వరుని సత్కరింపించి యథాశాస్త్రముగఁ బూజించి యతనిని ఆరాధించుటకై నియమవంతురాలైన గిరిజను, సఖీసమేతసహాయను నియమించెనట. ఔరా! ఎంత యౌచితి! ఎంత లోకస్వభావజ్ఞత! ఎంత దేశకాలపాత్రాభిజ్ఞత! లోకస్వభావజ్ఞుఁడైన యేయొక మహారాజు తనయింటికిఁ దపశ్చరణకై నేతెంచియున్న యొక దివ్యతపస్వియెడ చూపవలసిన గౌరవము ఇట్టిదేకదా! ఒకవేళ తానే సేవించరాదా? అందురేమో? భావిదేవతాకార్య నిర్వహణమునకై గిరిరాజునియొక్క ప్రస్తుతకర్తవ్య మిదియే. గిరిజను సఖీసమేతగా నియమించుటలో నెంతయో ప్రయోజనమున్నది. లోకజ్ఞుఁడైన వాని చేతలిట్టివేకదా! తెలుఁగు కావ్యమునందలి గిరిరాజుఁగూడ వోఁడకవినలె శైవుఁడుకాను శివభక్తుని దెలుపుకొనుటకే యింత యార్భాటముతో శివునియొద్దకుఁ జేరియుండు ననుకొను లోకజ్ఞత యిట కుంటువడలేదా?" కావ్యప్రయోజనములలో

"కావ్యంయశసేఽర్థకృతే వ్యవహారవిదే......"

అని లోకవ్యవహారజ్ఞానముకూడ ముఖ్యమైనదికదా! నారద వాక్యమునుబట్టి గిరిజ, గిరీశుని ద్రవ్యమైయున్నది. మున్ముందు గిరిరాజు సప్తర్షులు రాయబారులై వచ్చి గిరిజను గిరీశునకు గోరినప్పుడు గిరిరాజు తన తనయనుగూర్చి "ఏహివిశ్వాత్మనే గౌరి భిక్షాసిపరి

కల్పితా।..." అనును. దీనినిబట్టి సంస్కృత నగరాజు శివద్రవ్యమైన నగజను శివసపర్య కుపయుక్తమగునట్లు మొదటనే శివునకర్పించి, తనదూరదృష్టిని వెలయించినాఁడు. తెలుఁగుకృతిలో నీ ముఖ్యక్రియలు స్పష్టమైనవి. ఇంకొక విరుద్ధము చూడుడు.

"........గణికాసమూహితోడ గిరిజ పూజింపఁ బసిఁడితామరలవరదు"

తపశ్చరణ సమయములో ఈ "గణికాసమూహి"ని ప్రవేశ పెట్టిన చోడకవి భావమేమో? సంస్కృత గిరిజకున్న నియమవతిత్వము తెనుఁగు గిరిజకేదీ!

ఇక చోడకవియొక్క యీశ్వరపాత్రదైన యవస్థ చూడుఁడు

"ఇట్లు మదనపరవశయగుచున్న పార్వతి ముఖాలంకారంబుఁ గనుంగొని సొగసి యాక్షణంబయీశుఁడు మఱియుం గనుబేటంబైన దోవగొనక నామాన్యమానవుఁడువోలె" ఇట్లు తలపోయును.

"పులకాంకురంబులు దలలెత్తి మేనుగంపింపఁగోమలిఁ గౌఁగిలింపఁదలచు రాగోత్కటమున సైరణలేక మానినిగాయ్యనఁబై బడిఁ కలయఁదలచు లలితాంగియవయవములు సూచిమదిదనివోవక చూడ్కులఁద్రావఁదలచు దసమహత్వంబుఁ దెలియక తరుణిపొందు పడయ గీడ్వడి తేపన వాపఁదలచు. ఇట్లు చోడకవియొక్క జితేంద్రియుడు ఒక్కప్రేమ్మెకలో పెంపు సెడికామునివలలోఁ జిక్కినాఁడు.

(కూ. ఆశా. 8. ప 523)

ఇట కవిరాజ శిఖామణి, సామాన్యమానవ మానసిక దశా పరిణామ చిత్రణములో మాత్రము తిక్కనను జక్కగ ననుకరించి యున్నట్లు కనుపింపను. ఇట తిక్కన కీచకుఁడు స్మరణకువచ్చును. సైరంధ్రినిజూచి మనోజవికారమగ్నుఁడైన కీచకుఁడు

"అనియనియుగ్గడించు ధృతియల్లలనాడినఁదల్లడించుబై కొనుతల పోతనించుమది కోర్కులు పేర్చిన నప్పళించునెట్టన (విరాటపర్వం2-31)

సఁడునాస్ఫురితాఽధరయగుచు గిరిరాజనందన పరిచ్ఛేదించి" "చెవుడు పడంగనల్గడలు జీరుచునన్నొక వెందు A జేసి మీరి వియవియంచు బుజ్జవములన్నియు నెన్నఁగనేల నాకు నీభవనమున నీశ్వరుండ పతి, ప్రాణము దేహముచిత్తవృత్తులున్ శివపదపంకజార్పణము సేసితిఁబాసితి మీకు నింతతోన్॥" (ఆశ్వా 7)

అని తెగంబలికిన మారువలు కనోడితద్గమనమున కందఱు సమ్మతించిరి'

తెలుఁగులో తండ్రి తనయలమధ్య ఒక తుపాను రేగినట్లైనది. కూఁతురి యార్భాటమున కచ్చటి బంధుగులే భీతిలి యామెయిష్టమున కామెను విడిచిరి. ఒకమహారాజు నాజ్ఞనుకాదని ఒకకన్యక ఆతని నిట్లు ధిక్కరించి గద్దించుట కన్యకాజన శీలమునకు కళంకాపాదకముకాదా! మఱియుఁ దనజీవితసర్వస్వము శివుడేఁయనియు "నిక నింతటితో మీకును నాకునుసరి" అన్న గిరిజ, తండ్రి మున్నగువారి యనుమతి పొందిన పిమ్మటంగూడ తపఃప్రదేశమునకుఁ జేరవలదా?

"హరిణీవచ్ఛెదె కానకుందపముసేయం బోదమంచున్ మృగిం బురుడున్ మావిఁడి నీవు క్రమ్మఱెదెనన్ బోఁ జోపియంచున్ నవాజిర చూతంబులఁ గౌఁగిలించుకొను..."

ఈ కల్పనచే గిరిజఁ (తెలుఁగులో) ఒకరిబలవంతముపైఁ దపమునకు నెళ్ళవలసినట్లు, తడయుచు, విహారయాత్రకు వెడలినట్లున్నది. ఐనచో నింతటి గందరగోళమెందులకు? తమ రాచఱికము చూపుకొనుటకా? ఇట్టి ప్రత్యేక భావములు, లోకోపదేశదక్షములైన కావ్యములలో గల్పనలుగాజేయుట యుచితముకాఁగలదా? పోనిండు తెలుఁగు గిరిజ యిప్పటికైనను దపోవనమునకు వెళ్ళగఁల్గినదా? లేదు.

"గిరినందన గిరినందన తరుగుల్మలతానదీనదప్రాకట నిర్ఝరసగసీ పులినలతాంతరములవిహరించుచును ముదంబోదవమదిన్ ప)

A పుఃగు

ఇది యొక, రాకన్నియ జేసెడు విహారయాత్రవంటిది కాదా!

ఈ యవస్థములలో నొక్కటియు సంస్కృతగిరిజను సంక్రమింప లేదు. ప్రత్యుత ప్రకృష్టమైన కన్యాకాజనముయొక్క ముగ్ధమోహా వృత్తమే - ఉత్తమకులసంజాతయగు నొకయుత్తమోత్తమ శీలవతి యగు కన్యకయొక్క మనసిగ్గుదొంతరలలో దోఁబూచులాడు చున్న యొకకన్యకాఽభిలషితమే - లోకస్వభావమును, కతిసన్నిహితముగా నిట కాళిదాసుచేఁ జిత్రింపఁ బడినది. చూడుఁడు. "కదా చిదాసన్న సఖీముఖేన సా మనోరథజ్ఞం పితరం మనస్వినీ। అయాచతారణ్య నివాసమాత్మనః ఫలోదయాంతాయతపస్సమాధయే॥ (కు. సం. 5-6)

"అథానురూపాఽభినివేశతోషిణా కృతాభ్యనుజ్ఞా గురుణా గరీయసా। ప్రజాసుపశ్చాత్ప్రథితం తదాఖ్యయాజగామ గౌరీశిఖరం శిఖండిమత్॥ (కు. సం. 5-7)

గిరిజ ఒకరోజున సఖీముఖమున తండ్రికి తనకోరిక నెఱింగించెను. ఆకోరికకు సంతసించిన తండ్రిచేతపశ్చరణమున కంగీకరింపఁబడెను. వెంటనే గౌరి మున్ముందు "గౌరీశంకర్" అనఁబడు శిఖరమును జేరెను.

ఈ సన్నివేశము, లోకమున కాదర్శప్రాయము. ఒక మహా రాజైన తండ్రికి, అతనిపుత్రిక యెదుటఁబడక స్వసఖీముఖమున తన కోరిక నెఱింగించుట అతడంగీకరించుటలోఁగల లోకస్వభావము, అందును గౌరవకుటుంబమునకుఁ జెందిన యొకతండ్రియొక్కయు, తత్తన యయొక్కయు నుదాగపవిత్ర, ప్రకృష్ట తమప్రభావ భావితప్రవర్తనలు నిట కాళిదాసుచే నద్దములోవలెఁ జూపఁబడినవి. ఇట్టి సన్నివేశముల యందే ఆయా పాత్రల స్వభావోన్మీలనము, దీనిచే లోకస్వభావజ్ఞత అనునివి సంప్రాప్తములై తన్ముఖమున నిట్టికావ్యములే చతుర్వర్గ సంభవ పద్మములగుచుండును. చోడుని గిరిజాకుమారిలో నిట్టిముగ్ధప్రకృతి ముచ్చటకైనఁ గానరాకుండెఁగదా! కనుకనే కవి, లోకజ్ఞుఁడుకావలె

సందురు. ఇట్లే తెలుఁగున "ఇట్లు మునికుమారుండాక్షణంబ పరమే శ్వరుఁడైనఁ బార్వతి బొట్టులికి యెదురుకొని తన్నోసరించుచు ఇట్లు హార గిరిజ లధికప్రణయగస...సాగరంబులను, నభిమానశీలంబుల నతి క్రమింపనున్న కన్నెఱింగి...చతురిక.

"గిరిసుత కన్యాగుణమాదరమున సుప్రతిష్ఠితముసేసిలసత్పరి ణాయ పూర్వకమునసీ। శ్వర! సుదతిపరిగ్రహింపు సన్మార్గమునన్॥ (906 ప)

"తమకంబున నరుగుమరా। లములంబుదరవమువిని చలాచల మతిసంగము వాసినట్లు ననసంగమమిరువురువదలిచతురికావచనగతిన్ ఇట్టిది లోకరువిద్ధమే యనవలెను. (908 ప)

"బుభుక్షితః కిం ద్విక రేణభుంక్తే"

ఎంత యాఁకలి గొన్నవాడైనను రెండు చేతులతో భుజించునా? ఐనను ఇచ్చట చోడకవికల్పనచే నీశ్వరుఁడు రెండుచేతులతో భుజించి నట్లున్నది. ఒక దాసీప్రబోధమునకు లేక మందలింపునకు ఒక దివ్య పాత్రపాల్పడవలసిన పాట్లు ఇట ఈశ్వరునంతవానికి వచ్చినవి. శ్రుతి మించిరాగానఁబడినది. సంస్కృతమున ని దేసన్ని వేశము చూడండి.

"తంవీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టిః
నిక్షేపణాయపదముద్ధృతముద్వహంతీ।
మార్గాచలవ్యతికరాకులితేవసింధుః
శైలాధిరాజతనయా నయయౌనతస్థౌ॥"

మాయావటువు మహేశ్వరుడై నంతనే గిరిజాకుమారిలోని శృంగారరసభావముద్గతమైనది. ఒకమూలనుండి నునుసిగ్గుదొంతరలు లేచుచున్న, మఱియొకమూలనుండి శృంగారభావవాహిని ప్రవహించి ముందుకుఁద్రోసికొనివచ్చున్నది. ఈ భావద్వయసంఘర్షణాసమయములో సిగ్గుగిరిజాపవమును అటనుండి వెళ్ళుటకు పైకెత్తించుచుండఁగాశృంగార

భావస్రవంతి ఆయెత్తిన కాలినట్లే నిలిచి ఆమె సటనుండిక పట్టనిచ్చుట లేదు. ఇట్లు ముందుగాజనించిన సిగ్గును శృంగారభావమునణంచి స్వశక్తి బలమును జూపుచున్నది. ఈ క్రమమునే సూచించుచును సిగ్గు, ఆమెను భయకంపములను (వేపథుమతీ) పుట్టించగా శృంగారభావము ఆమె యంగములను (చిఱుచెమటలచే) ఆవహించి సాత్త్వికభావస్వేదముచే సినది. (సరసాంగయష్టి) ఇట్టి సంఘర్షణాసమయమున ఆమె మనస్సు ఎట్లున్నదో తెలుపుటకే యిట యద్భుతమైనయుపమను ఉంచవలసెను.

ఒక నదీప్రవాహముముందునకుద్రోసికొని ప్రవహించుచుండగా మధ్యమార్గములోనున్న ఒక పర్వతముతో ఆ నదీప్రవాహము ఢీ గ్రుద్దుకొనును. అట్టిసమయమున ఆప్రవాహవేగము క్షణకాలము పర్వతప్రతిబంధకముచే ఆపఁబడును. కాని ప్రవాహ స్వభావము ముందునకు ప్రసరించును. ఇట్టిసమయమున ఆప్రవాహస్థితి ఒక క్షణ మాత్రము ముందునకుఁ బోఁజాలక పర్వతమువద్ద నిలువను లేక ఇంక కర్త వ్యతామూఢమై, క్షణకాలము కల్లోలితమైయుండును. ఇట్లే ప్రస్తుత మున గిరిజయొక్క శృంగారభావప్రవాహమునకు మార్గమధ్యములో హఠాత్తుగ ఈశ్వరపర్వత మడ్డుతగిలినది. భావప్రవాహ వేగము ముందుకు నెట్టుచుండగా ఆప్రవాహవేగమును ఈశ్వరపర్వత మాపినది. తన చిరకాలతపఃఫలము ఈశ్వరరూపముతోఁ బ్రత్యక్షముకాఁగా ఆమె తత్ఫలమును విడిచి వెళ్ళలేకున్నది. క్రొత్త పెండ్లికుమారుని యెదుట ధైర్యముగానిలబడుటకుఆమెసిగ్గు ఒప్పుకొనకున్నది.ఈ భావద్వయసంఘ ర్షణలో గిరిజామానసము కింకర్తవ్యతామూఢమై క్షణకాలము ఆనదీ ప్రవాహమువలె కల్లోలితమైనది. కనుక గిరిజ ఈశ్వరసన్నిధిని విడిచి వెళ్ళను లేదు; నిలువను లేదు. భళీ! ఎంత చక్కనిసగసన్నివేశము! ఇట కాఁబోవు పెండ్లికూఁతురియొక్క మానసిక భావములుకాఁబోవు పెండ్లి కొడుకుయొక్క సన్నిధిలో ఎన్నిమార్పులు చెందుచుండునో ఎన్నిసంఘ ర్షణలకు గుఱియగునో X రే కిరణముచేఁజూపినట్లు మన కాళిదాసు

చేసి ఉపమాకారణముతో జూపినాడు. చోడకవి గిరిజకు ఇష్టముగ్ధ మో మోను ధ్యానము లేపి! తాఁబోవు పెండ్లికొడుకును పెండ్లికూఁతురు ఎదుర్కొనుట ఉత్సవములలసంజాతయగు కన్యయొక్క శీలమునకు తగునా?

పై విధముగా నీకవులిద్దరును దమ కావ్యములలో దమయంభి ప్రాయములను దమ కల్పనలద్వారా తెలిపినారు. నన్నె చోడకవి కవితా శక్తిని గురించి చెప్పనేల. కాళిదాసు లోకస్వభావజ్ఞుఁడగు కవికుల గురువు. లోకవ్యవహారజ్ఞానమునకు కాళిదాసకావ్యములు ఉత్తమ వాఙ్మయములగుచున్నవి.

## నిగమశర్మ, నిరంకుశుల భార్యలు

శ్రీ శివలెంక శ్రీరామచంద్రమూర్తి, ఎం. ఏ.,
గవర్నమెంటు ఎపిగ్రఫిస్ట్సు ఆఫీస్, ఉదకమండలము.

"నగరసారస్వత పట్టభద్రులు కవుల్ వర్ణించి వర్ణించియున్
సగపాలంతయుఁ గానలేరు తుద యోపావిభ్రమాంభోధికిన్"

అని తెనాలివారి తీర్మానము. నిగమశర్మోపాఖ్యానమునను, నిరంకుశోపాఖ్యానమునను గూడ నీ విభ్రమాంభోధీ ఫేనరింభోళులే సాంద్రముగ నావరించినవి. మన కథానాయకులు నిగమశర్మ నిరంకుశులు. ఈరెండు పాత్రల పరిణితకిని దోహదము చేయు పాత్రలు వారి భార్యలు. ఈ నాయకు లిరువురును సాధించెడు ప్రయోజనములు భిన్నములు. నిగమ శర్మ పాత్ర ప్రయోజనము పాండురంగ మహాత్మ్య పాఠకుల మనస్సును హత్తుకొనునట్లు చేయుట. ఇఁక నిరంకుశుని పాత్ర ప్రయోజనము మన మోక్షసాధనముఁ గామము సైతము మార్గదర్శక మేయని నిరూపించుట, చంద్రయ మతము– "కలరు సుమిూ మనోజశరకంపిత ధైర్యశరవ్యులై తలంపుల వచనంబులం గ్రియల భోగవతీ జనమంద యిచ్ఛనిచ్ఛలముగఁ బూని తక్కిన విచారము దూరముఁ జేసినట్టి మొక్క

లపు మనుష్యులుం బుధులు గాననిసద్గతిఁ గన్నవారిలన్" (సం. 1-40) అని రుద్రయ గ్రంథమున బుధులను గూడ మించిపోయిన పురుష పుంగవుఁడు నిరంకుశుఁడు. రుద్రయ కావ్యములోఁ గామపూజ సడి విపరీతార్థ రమణీయమైనది. కామోపాసన యను రూపాంతరిత జ్ఞానోపాసనమైనది. ఇట్టి కామమున నీదులాడి యీఁదులాడి గెల్చినట్టి నాఁడు నిరంకుశుఁడు. ఇట్టి ప్రతిపాదనలు గల కావ్య సృష్టిలో కానిచ్చును "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అనుటయుఁ గారణము. మొత్తము మీఁద నిగమశర్మ నిరంకుశులిరువురును ప్రయోజనాపేక్షితముగా యుపతరించిన వారే యయినను గాలప్రభావము వలననైన నేమి కవుల యాత్మీయత కారణమునైన నేమి గాను గాను విశృంఖలముగఁ బ్రవర్తించినారు. అసలు వీరికి వంశకర్త గుణనిధి. ఈ భావవిహంగము శ్రీనాథునిలోనుండి యుద్భూతమై, గామకృష్ణునిలో నున్నతస్థాయిని బొంది, రుద్రయ చేసిన వలలోఁ దగుల్కొనినది.

ఏ పాత్ర స్వరూప స్వభావములైనను ప్రయోజనాన్విత ఘటనములనను గని తనకుఁ దానై చెప్పుట కావ్యధర్మముగాదు. ప్రధాన పాత్రలకుఁ దదితర పాత్రలతోఁ గల సంబంధము ద్వారమునగాని, సన్నివేశ ప్రకల్పన ద్వారమునఁగాని యాచిత్రీకరణము జరిగిననే కావ్యమున బిగువు, కవి ప్రతిభ వ్యక్తమగును. ఇక్కడ నిగమశర్మ నిరంకుశుల భార్యల పాత్ర ప్రయోజన మిట్టిది. మొట్ట మొదట కథానాయకుల వారయోషిత పరాయణత, కులాంగనా వైముఖ్యము, క్రమముగా వేశ్యాలోలత, కులాంగనా నిరసనము ప్రదర్శితములగుటతో పాఠకులకుఁ గథానాయకుల యెడల వైమనస్యము, వారి భార్యల యెడల పూర్తి సానుభూతి కల్గును. అనగా నిగమశర్మ నిరంకుశుల పాత్ర పరిణతి యవగత మగు నన్నమాట. పాఠకునకుఁ గథానాయకుల భార్యల యెడల సానుభూతి పరాకోటి ముట్టుటతో నా పాత్రల ప్రయోజనము

పరిపూర్ణమగును. ఇఁకఁ గవి పాఠకుని మనోవీథినుండి ఆ 'భార్యల పాత్రల'ను నిష్క్రమింపఁజేసి, పాఠకుని దృష్టిని గథానాయకులపై లగ్నమగునట్లు చేయును. ఈ దృష్టితో నిగమశర్మ నిరంకుశుల భార్యల పాత్ర నిర్వహణ విషయపరిశీలన ప్రస్తుతాంశము.1

నిగమశర్మ భార్య "నవీన కులాంగన." కనుక నేయా ముద్దగాఱు సాహసించి తన యెదుటపడి మాటాడదు. సౌందర్యవతి, వినయశీల. ఎంతయుఁ గుట్టికి నలంగియు న త్తమామల చిత్తంబు వచ్చునట్లు భక్తిశక్తులు మెఱసి పాటులంబడు' నట్టి యిల్లాలు. ఏమైన నేమి, యీమె యౌవనము, సౌందర్యము వన చంద్రికా వైభవములైనవి. ఆమె స్థితి పాఠకులకే కాదు జాలికల్గించుట, యీమె యీఁడుబిడ్డ – నిగమశర్మ యక్క–కును 'కన్నీరుట్టిప'డునట్లు చేసినది. ఇట్టి చిత్రణతో బ్రప్రథమముననే రామకృష్ణుఁడామె కొక స్థాయిని గల్పించినాఁడు. పాఠకహృదయములో.ఆడుబిడ్డ 'కడుపు చుమ్మలువో' బాధపడు సంతిలో. నిగమశర్మ "చుక్క తెగిపడినవడువున నెక్కడ నుండియో" వచ్చి పడినాఁడు. ఇట్టి సన్నివేశప్రకల్పనకు కవికిఁ బాఠక మనస్తత్త్వము దెలియవలెను. కథానాయకుఁడూరిమీఁద 'బలాదూరు' యయినపుడింటిమొగ్గ నాతని యిల్లాలి పరిస్థితిని నామె యేడుపడుచు 'ద్వారమున' ప్రదర్శించి, సరిగ నప్పుడే కథానాయకుని బాఠకుని కండ్ల యెదుటకుఁ దెచ్చుటతో గవి చాలవఱకు దానాశించిన ప్రయోజనమును – కథానాయకుని భార్యపట్ల సానుభూతి. కథానాయకు నెడ వైమనస్యము– బాఠకులనుండి పొందుచున్నాఁడు. ఇది కవి ప్రతిభ.

ఇక్కడనే మఱియొక్క సన్నివేశమును గూర్చినాఁడు. రామకృష్ణుఁడు. అట్లింటికి భర్త వచ్చినను నాడుపడుచు ప్రక్కనుండఁగా

1 'నిగమశర్మ భార్య: పాత్ర నిర్వహణ శిల్పము' అను పేర సాహితి (అక్టోబరు'64) లో నేను ప్రకటించిన వ్యాసమునందలి విషయములు కొన్ని పునరావృత్తములైనవి.

సతని యెదుట పడలేక "వెనుకదెస నెడఁగలిసియున్న" నిగమశర్మ భార్యకు నేత్రసంజ్ఞ నొనరించినదట నిగమశర్మ యక్క. అప్పటికి నిటవ్వు దెచ్చుకొని-

"ఆ పైదలి ప్రాణేశ్వరు
శ్రీ పాద ద్వయముఁ గడిగె శీతల వారిన్
వ్యాపృత నిజ నిశ్శ్వాస జ
తాపంబునఁ గొంత కొంత తప్తము గాఁగన్"

అపరాధి యగుటను భర్తగావున అనురాగముతో ('ప్రాణేశ్వరు'), నెంతయు భక్తి పురస్సరముగ ('శ్రీపాదద్వయము') జల్లని నీటితో గాళ్ళుల గడిగినది. ఆమె వేడి నిట్టూర్పుతో నిగమశర్మ కాళ్ళ తడి యారిపోవనారంభించినది. ఆమె 'గుట్టెఱుఁగని' తనమనంతయు నిక్కమై కరడుగట్టినది. ఆమె నిట్టూర్పు ఆవేదనా భరితము. ఆ నిట్టూర్పును గమనింపగలుగునది, యాంతర్యము నర్థముచేసికొనవలసినది నిగమ శర్మ యొక్కఁడే. పైవారికి నేమియుఁ దెలియదు. ఎంత గుంభన! ఆ మాత్రమర్థము చేసికొనఁగల శక్తియే నిగమశర్మకు నుండినచో నాతని బ్రదుకింత బండలయ్యెడిది కాదు గదా యని పాఠకుని కనిపించుటతో, సానుభూతి నిగమశర్మ భార్యయెడల, అసహ్యము నిగమశర్మ యెడలఁ గలుగును. అక్కడితో ఆ 'భార్యపాత్ర' ప్రయోజనము నెఱవేఱును. ఇఁక పఠిత మనస్సునుండి నిగమశర్మ భార్యను నిష్క్రమింపఁజేయుటకు రామకృష్ణుఁడు నిగమశర్మ ప్రదర్శించిన స్వల్పకాలిక సద్బుద్ధిని -తుపానుకు ముందుండెడు సముద్రమందలి శాంతి వంటిదానిని వర్ణించి "తేనె పూసిన కత్తి ధాత్రీసురుం" డని హెచ్చరించి, మెలకువతోఁ బఠితను నిగమశర్మవైపున కాకర్షించి, నిగమశర్మ పలాయనముతో నాతని భార్య ప్రసంగమును వదలివేసినాఁడు. ఇట్లు నిగమశర్మ భార్య పల్లెత్తి మాటాడకుండఁగనే తనపబ్బము గడపుకొని పోయినది.

ఇక నిరంకుశుని భార్య. నిరంకుశుఁడును "సవిస్తర సురతాగ్రమైక పథచారి' బలపమును గత్తియును బూని ప్రజల యిండ్లగన్న మెట్టనిదొక్కఁటే కాని కొదవ కడమ దుర్వృత్తులన్నియుఁ గఱచె నతఁడు." ఈ నిరంకుశ ప్రవర్తనను నాతని భార్య "బహువత్సరముల్ ధీరమతిఁ జూచినదట. కాపురమునకువచ్చి బహు వత్సరములయినను తనభర్త నదపులోనుంచుకొనుటకు నీమె ప్రయత్నించిన జాడయే లేదు. నవీన కులాంగన కాదుగదా ముగ్ధవలె ఊరకుండుటకు చివరకొకనాఁ డత్తతో దన బాధనంతను వాయివిడిచి వెళ్ళఁబోసికొననది.

"అత్తవు సర్వలక్షణ సమగ్ర గుణాఢ్యవు నన్ను దిట్టనున్
మొత్తనె కాని నీ కొడుకు మూఢత మానుప వేలవాఁడు రో
తొత్తుల మారియై గృహము ద్రొక్కఁక యొక్కొకదానిఁబూనికన్
గుత్తసంబు నుంచుకొని కోకలురూకలు జోకనీయఁగన్.

అని ఈమాటల నన్నిటి నామె సకరుణంబుగాఁ నన్నదట. కరుణయే కానవచ్చుచున్నదో లేక కసియే కానవచ్చుచున్నదో పోనిండు. కాని యీ పద్యముఁ జదివిన మనకుమాత్రము నిరంకుశుని భార్య నోరు గలదియే యనిపించును. 'ఇందఱున్నారే యొక్కరైన నాతనిని మందలించలేరా' యని యింటిలో నందఱిమీఁద విఱుచుకొనిపడినది. ఒకరి వస్తువును మఱియొకరా చక్కదిద్దనలసినది ? అంతటితో నాగలేదా యతివ వివిధాలాపములతోఁ దన నెఱజాణతనమును, నొప్పిదమును బ్రకటించుకొనినది. "మగఁడు సంసార నివర్తనఁజేసి యిట్లు తిరిగిన మనమునఁ గోపింపకెట్టి మగనాలుండు", అని 'సవాలు' చేసినది. ఈ వాగాడంబరమును జూచిన పతిత కీమె భర్త నదుపులోనమదికిఁ దెచ్చుకొనుటకు బాగుగ బ్రయత్నించునని యనిపించును, కాని కడకు నిరుత్సాహము మాత్రము గలుగును.

తల్లి హితబోధవలన గాకపోయినను "ప్రొద్దుపోయినదని తలా

రులను వెఱచి" యయిన నాపూటను నింటిపట్టున నుండఁజాలఁ కొనినాఁడు నిగమశర్ముఁడు. ఇక నారాత్రి ముచ్చటు.

"అలివేణీమణి సిగ్గుచేత సతపత్రాంబ్రాంతయై రెండు చే
తుల బాగాలొసఁగంగఁ బోయినఁ గృపామాలిన్యచిత్తుండై మనః
జ్వలనజ్వాల కరాళమైన నిడుద నిశ్వాసంబుఁ గావించి యప్పొలి
మోమయ్యె ... ... ... ..."

అందఱిపైన నంతగ విఱిచుకొనిపడి, స్వాతంత్ర్యమను ప్రకృతిని విడిచి యా మానినీమణి యతనియెదుట మఱి పలుకాడలేదు.

"తమకంబు లేక కారు
ణ్యముఁ జూపకతేఁకు సలాంగనా పరపేక్షా
విముఖత్వమిట్లు చూపిన
గుమగుమమని శోకవహ్ని గుబ్బతిలంగన్.

"అకటా యింతయుఁ దెచ్చెనే యనుచు సత్యాసక్తయై జాలత
ల్లికలో వీడియముంచి పంచశర కేళీవాంఛ చాలించి చం
పకగంధిన్ దనలోన మెచ్చుకొనుచుం బశ్చాత్తాపమున్ దుఃఖమున్
వికలంబైన మనంబుతో నిదురఁ జెందం దత్పరతాపస్థలిన్"

దీనితో బాలకునకు దన చేతకానితనమును వారిపైని పీడతోపైన విఱిచ కొని పశుటతప్పనిగమశర్ముని భార్యయు మఱేమియుఁ జేతకాదని తెలియును. అందువలన నవనవమైనంత నానుభూతి పాఠకునినుండి యీ పాత్రలు లభింపజాలదు. మఱి యిఁక నాపాత్ర సాధించిన దేమి యున్నది ?

నిగమశర్మ భార్య, నిరంశులభార్యలలో నిగమశర్మ భార్యయె 'సత్తె కాలపు ముత్తైదువ' లక్షణములు గన్పించును. నిరంశుని భార్యలో అధునాతన స్త్రీలక్షణములు గన్పించును. ఇటువంటి పాత్రలపై సాను భూతి పఠితలో గల్గించుటకు నాపాత్రలను పరోక్షముగ నిర్వహించుచు కొని రావలయును. ఇట్టిమెలకువ రామకృష్ణునిలోఁ గలదు. అతని

ప్రతిభయంతయు 'నిగమశర్మ అక్క'ను సృజించుటలో గలదు. నిగమశర్మ యిల్లాలి మనస్సును మనకు విప్పిచెప్పునది యామెయే. నిగమశర్మ భార్యకు నందఱతోను స్వవిషయమును జెప్పుకొనవలసిన పని యేమున్నది? భర్తతో దాను చెప్పవలసినది యేదో గుంభనగ జెప్పనే చెప్పునది. కాని నిరంకుశునియిల్లాలుమాత్రమిందులకు బూర్తిగా వ్యతిరేకము. నిగమశర్మ భార్యలోగల మాత్రమైనను సమర్థత నిరంకుశుని యిల్లాలిలో లేకపోయినది. నిగమశర్మభార్య తన యాఁడుబిడ్డ సానుభూతిని బొందుట మూలమున నిగమశర్మను "కులవధూరత్నంబుఁగ స్మరించు" వఱకుఁ దెచ్చికొనినది. అసలు రామకృష్ణుఁడు నిగమశర్మ యక్కపాత్రద్వారమున పాఠకహృదయమును గమనించుచునే యున్నాఁడు. మఱి నిగమశర్మ భార్య తన యాఁడుబిడ్డ సానుభూతిని బొందగల్గినదన పఠితల సానుభూతిని బొందినదన్నమాటయే కదా. ఇదియే రామకృష్ణునిలోఁ గలదియును, రుద్రయలోఁ దపించినదియు నైన యింగితము.

ఇఁక రెండవది—ఇట్టి ప్రత్యేకప్రయోజనము నాశించు పాత్రలెంతకును వినయసౌహార్దములతోఁగూడి యుండవలెను. అప్పుడే పాఠకుల సానుభూతి యాపాత్రలకుఁ దేలికగ లభించును. నిగమశర్మభార్య "సలంగియు నత్తమామల చిత్తంబునచ్చినట్లు భక్తిశక్తులు మెఱసి పాటులుఁబడుటచేతనే మఱఁదలు నోరునిడిచి చెప్పుకొనకపోయినను దమ్ముని మందలించుటకుఁ బూనుకొనినది. యాఁడుపడుచు. నిరంకుశుని యిల్లాలు మాత్రమందులకుఁ బూర్తిగ వ్యతిరేకము. ఎంతకు నత్తచేఁ దిట్లు, దెబ్బలుతినుటయే యామెకుఁ లాభించెను.

ఈ రెండుపాత్రలును కరుణరసాత్మకములైనవి. ప్రధానపాత్ర పరిణతికి దోహదము చేయుచు నీపాత్రలు తమ యక్కఱ తీఱగనే రంగమునుండి నిష్క్రమింతురు. దానితోఁ బాఠకుని దృష్టి కథానాయకులపై లగ్నమగును. అందువలన నీ పాత్రలు పఠితను గరుణరసావధికి

చేర్పలేవు. ఈవిషయములోఁగూడ, మిగతఁ జాలవిషయములలో వలెనే, నిగమశర్మ భార్యపాత్ర నిర్వహణలోగల శిల్పపు మెలకువ నిరంకుశుని భార్యపాత్ర యందుఁగానరాదు. ఈ రెండు పాత్రలును భర్తలచే నుపేక్షింపఁబడి ఈ ఉపేక్షితత్వ మొకటి పఠిత సానుభూతిని దేలికగ బొందగలుగుటకుఁ గారణమగునది. ఇట్టి ఉపేక్షితత్వమును బరమావధికి గొనిపోవుటకే. ఈ రెండుపాత్రలను నవ్వులపాలుగను బేలలుగూడ పెట్టలేదు. దీనితోఁ నీరిరువురు నెంత యుపేక్షితలో మనకుఁ దెలియుచున్నది. ఇదియొక శిల్పపు మెలకువ.

ఇంతకును నిగమశర్మ నిరంకుశులిరువురు నొకరిని మించిన పురుషపుంగవులు. మఱియొకరు నిగమశర్మలో నొక సున్నితత్వము గన్పించును. కొంతవఱఁ గొంతయైన నిల్లాలి నాదరించినాఁడు. కాని నిరంకుశుడు కేవలము తెంపరి. అతఁడు భార్యముఖమైనను జూడలేదు. నిగమశర్మకుఁ దన యక్కయెడల నెంత కొంత గలదు. ఇక నిరంకుశుఁడో "అప్పసెల్లెండ్రపై నాదరంబులు నూపి యున్నమున్ గొని పోయి యపహరించు" మహానుభావుఁడు !

మొత్తముమీఁద రామకృష్ణునిలోఁ గల యుక్తిమత్త్వము, పాత్ర నిర్వహణశక్తి, శిల్పపు మెలకువలు ఈ ద్వయములో ద్యోతకించినవి. పాఠకుఁడు నిగమశర్మ యిల్లాలియెడలఁ బొందినట్లు నిరంకుశుని యిల్లాలి యెడల సానుభూతిని బొందలేడు. అందుచే నేప్రయోజనమునకై నిగమశర్మభార్య, నిరంకుశునిభార్య పాత్రలు సృజింపఁబడినవో యా ప్రయోజనమును నిగమశర్మభార్య పాత్ర సాధించఁగల్గుచున్నది. నిరంకుశునిభార్య సాధించలేకపోవుచున్నది. ఈ దృష్టితోఁ జూచిన నిరంకుశుని భార్యపాత్ర సంయమనములేని కవిదృష్టిలోఁబడిన కమనీయప్రకృతి దృశ్యమైనది. నిగమశర్మ భార్యపాత్ర ప్రతిభావంతుడైన కవికిఁగలిగిన రమణీయ భావప్రరోహమైనది.

# కళింగదేశము—కొంగుమండలము

## వీనికి ప్రాచీన సంబంధములు గలవా ?

రచన:- కె. ఎస్. కోదండరామయ్య, ఎం. ఏ. బి. టి.

హొసూరు, సేలముజిల్లా.

కొన్ని నెలలక్రితము విజనగరసామ్రాజ్య చరిత్రలోని, సాళువ నరసింహరాయలు, మఱియు కృష్ణదేవరాయలు వీరిరువురి దండయాత్రలను సంబంధించిన కొన్ని వివరములను పరిశీలించుటకోసము కళింగ దేశచరిత్రమును, అలాగే కొంగుమండలము (కోయంబత్తూరుజిల్లా) చరిత్రమును జదువుట తటస్థించినది. ఇట్లు చదువుచుండగ, ఈ రెండు ప్రాంతములందుఁగల కొన్ని స్థలముల పేర్లు, గ్రామాలు, కొండలు, నీటివనరులు మొదలగు వాని పేర్లు స్మరణకు వచ్చి, పురాతనకాలమున ఈ రెండు దేశములకు నేదో యొక విధమగు సంబంధము, మఱియు సన్నికటత్వము ఉండియుండుననను తలంపు మనస్సునకు తట్టినది. కొంగు దేశమున కళింగ, ఆంధ్ర వలసల జాడలున్నట్లు కనఁబడినది. ఇది నాలో నొక విధమగు ఆశ్చర్యమును, కుతూహలమునుగూడ గలిగించినది. ఆనాఁటినుండి యీ విషయమును గుఱించి ఆలోచించుచునే యుంటిని. మరల నీ విషయమును గుఱించి కొంత పరిశీలనకూడ చేసినాను. నాకు మొదటతట్టిన యూహ క్రమక్రమముగా బలపడుచు వచ్చినదే కాని, ఇంచుకంతయైనను తగ్గలేదు. ఏదో యొక ప్రాచీన కాలమునఁ ఈ రెండు దేశములకు సంబంధముండి, తర్వాత గల్గిన చారిత్రకసంభవాల కారణముగా ఆ సంబంధములు వీడిపోయి, నేఁడు వానిని గుర్తించుటకుఁగూడ వీలుకాని పరిస్థితియందున్నట్లు తోఁచినది. నాకు తట్టిన యూహాలు యథార్థములుగానచ్చును. కాకపోవచ్చును; కాని ఎట్లయినను, యీ నా యూహాలను చరిత్ర పరిశోధకులకును, ఆంధ్రపాఠకమహాశయులకును తెలియఁజేయుట మంచిదను తలంపుతో నీ వ్యాసమును వ్రాయుచున్నాను. ఆంధ్ర చరిత్ర నిష్ణాతులు, చరిత్రా

భిమానులు, నా యీ సాహసమును మన్నించి, పరిశీలనముం గాంచగ
వలయునని మనవిచేయుచున్నాను.

పై రెండు దేశముల ప్రాచీనత.

ఈ రెండు దేశములకును గల సంబంధమును గుఱించి తెలిసికొనుటకు ముందు, ఆ రెంటియొక్క ప్రాచీనతలను గుఱించి తెలిసికొన వలసియున్నది, అనఁగా ఈ రెండు దేశములలో కళింగదేశము ప్రాచీనమైనదా! లేక కొంగుమండలము ప్రాచీనమైనదాయనుటను గనుఁగొన వలయును. అందువలన మొదట కళింగదేశవిషయమును జూతము.

కళింగదేశము చాల పురాతనమైనది. మఱియు ప్రసిద్ధిగాంచినది. దీని ప్రాచీనతను గుఱించి సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులగు. శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు, ఇట్లు వ్రాసియున్నారు. "హిందూదేశమునగల బహు ప్రాచీనమైనట్టియు, సుప్రసిద్ధమైనట్టియు, దేశములలో నొకటి కళింగము. ఋగ్వేదమునందును, బ్రాహ్మణ, బౌద్ధ వాఙ్మయములందును, మహాభారత, రామాయణాది పురాణములందును, రఘువంశాదికావ్యములందును, అశోకునిశాసనాదులందును, ఖారవేలుని, సముద్రగుప్తుని, గాంగ, చాళుక్య, చోళాదిరాజుల శిలా, తామ్రశాసనాదులందును, ఈ దేశముయొక్కయు, అందలి ప్రజలయొక్కయు, రాజకీయ, సాంఘిక, మతాది విషయములు చక్కఁగాఁ దెలుపఁబడినవి." [చూ.కళింగదేశ చరిత్రము. పుట 431].

శ్రీ నీలకంఠశాస్త్రి పండితులు, ఎం. ఏ. ఎం. ఎల్. ఏ. గారీ విధముగ వ్రాసియున్నారు. "వేద, సూత్రకాలమునుండియు, అంగ, వంగ దేశముల మార్గమున కళింగము కొట్టకొనదైనను, ఆర్యావర్తమునకుఁ జెందిన దేశము." [చూ. పై గ్రంథము. పుట 276]

కీ. శే. డా॥ కృష్ణస్వామి అయ్యంగారు, ఎం. ఏ. పి. హెచ్ డి. గారిట్లు వ్రాసియున్నారు. "ప్రస్తుతము ఒరిస్సాయనఁబడు దేశమునకా పేరు, 'ఒఢ్రదేశము' నుండి వచ్చినది. కళింగము, ఉత్కళము,

ఓఢ్రము, లేక ఒఢ్ర, దరార్ణలోని యొక భాగము. . . . . . . . . . . . . ఈ రాజ్యములలో, కళింగము పురాతనమైనదిగాఁగానబడుచున్నది. . . . . . . క్రీస్తుపూర్వము కొన్ని సంవత్సరముల క్రిందట కళింగమున్నత దశలో నుండె వక్కనుసంచలి శాతవాహనులతో సమముగా గాల్డ్రివ్వేను. . ." [మూ. పై గ్రంథము పుట 250–51].

శ్రీమాన్ కళాంబి రాఘవాచార్యులు ఎం. ఏ. బి. ఎల్. గారిట్లు వ్రాసియున్నారు. "కళింగ దేశము బహుపురాతనమైనది. పురాణేతిహాసములందును, ప్రాచీనగ్రంథములందును, కళింగము పలుమారు పేర్కొనఁబడినది." [మూ. పుట 239]

శ్రీ కే. వి. సుబ్రహ్మణ్య అయ్యరు, బి. ఏ. ఎం. ఆర్. ఏ. ఎస్. గారిట్లు వ్రాసియున్నారు. "హిందూదేశములోని ప్రాచీన దేశవిభాగములలో కళింగ యొక్కటి."

[The country of Kalinga is one of the oldest territorial divisions of India...." Vide. Notes on Kalinga History, Page 257 Mythic Society Journal. Vol. XII 1921–22.)

ఇంతేగాక, భరతఖండమునందు ప్రాచీనకాలమందుండిన ఛప్పన్న (56) దేశములలో కళింగ యొకటియని పెక్కు ప్రాచీనగ్రంథములందుఁ జెప్పఁబడియున్నది,

ఇంతవఱకుఁ జెప్పఁబడిన ఆధారములనుండి కళింగ దేశము కడు ప్రాచీనము, ప్రసిద్ధము, మఱియు ప్రాముఖ్యముగల్గిన దేశమని తెలియుచున్నది. ఇక కొంగుమండలముయొక్క ప్రాచీనతను పరిశీలింతము.

కొంగుమండలమును గుఱించిన విషయములుగాని, తుదకు దాని పేరుగాని ప్రాచీన గ్రంథములందేనియందును లేవు. అశోకుని శిలాశాసనములందూ పేరగపడదు. భారత దేశములో ప్రాచీనకాలమందుండిన, అంగ, వంగ, కళింగాది దేశనామముల జాబితాలో దాని పేరు లేదు. బ్రహ్మాండపురాణమున భరతఖండమందలి దేశముల జాబితాలుగలవు.

ఈ పురాణోక్తమైన దక్షిణాపథజనపదములలో పాండ్య, కేరళ, చోళ, కొంకణాది దేశముల నామములున్నవి; కాని, కొంగుమండలము పేరు చెప్పఁబడలేదు. ఈవిషయములనుండి కొంగుమండలము ప్రాచీనమైనది కాదని తేటపడుచున్నది. కళింగరాజ్యము కంటెను, కొంగుమండలము కడు అర్వాచీనమైనదని స్పష్టముగాఁ దెలియుచున్నది.

కొంగుదేశము పేరు, మొట్టమొదటిసారిగ తమిళభాషయొక్క సంఘకాలపు వాఙ్మయ గ్రంథములందుఁ గనఁబడుచున్నది. ఆ వాఙ్మయమునకుఁజెందిన "అహనానూరు", మఱియు 'పుఱనానూరు' మొదలగు గ్రంథములలో ఈ కొంగుదేశము పేర్కొనఁబడియున్నది. మఱియు ఈదేశమును గుఱించిన కొన్నివిషయములుగూడ చెప్పఁబడియున్నవి. సంఘవాఙ్మయపు కాలము క్రీ. శ. 100 నుండి 250 వఱకు వ్యాపించియుండినదని తమిళచరిత్రకారులు చక్కఁగా నిశ్చయించియున్నారు. [చూ. నీలకంఠశాస్త్రిగారి, ఏ హిస్టరీ ఆఫ్ ది సౌత్ ఇండియా. పు. 112.

"The Sangam age may be teken to have extended from say. A. D. 100 to 250"]

ఈ యాధారములనుబట్టి 'కొంగుమండలము' లేక కొంగునాఁడు అను రాజ్యవిభాగము క్రీ. శ. మొదటి శతాబ్దమునందో లేక దానికిఁ గొంతముందో ఏర్పడియుండునని తెలియుచున్నది. ఇట్లు, ఈరెండు దేశముల ప్రాచీనతకు సంబంధించిన యాధారములను జూడఁగా కళింగ దేశమునకున్నంత ప్రాచీనతగాని, ప్రసిద్ధిగాని, కొంగుదేశమునకు లేదనియు, ఇది చాల ఇటీవల నేర్పడినదనియుఁ దెలియుచున్నది.

కొంగుమండలము—తన్నామోత్పత్తి.

కొంగుమండలమునకు ఆపేరెటువచ్చెనో తెలిసికొనవలయును. ఇంతవఱకు దీని నామోత్పత్తిని గుఱించి యెవ్వరును చక్కఁగ పరిశీలించినట్లు కనఁబడదు. దీనియుత్పత్తిని గుఱించిన యంశములు ఆంధ్ర

కానాన్వృతముగ నున్నందున ఈ నామోత్పత్తిని గురించి వ్రాసినవారు తమతమ యిష్టానుసారముగ నూహించి వ్రాయుచు వచ్చినారు. కాబట్టి తన్నామోత్పత్తినిగురించి కొంత పరిశీలింపవలసియున్నది. [illegible] గానించుటకుముందు ఇంతవఱకు నీ నామమునుగురించి తమిళ సంశోధకులు, మఱియు చరిత్రకారులు చెప్పియుండు వివరణములను దెలిసి కొనవలయును.

కొంగుదేశ చరిత్రకారుల అభిప్రాయములు

(1) కొంగుదేశముచేర చోళ, పాండ్య, తొండ, మైసూరులను దేశముల అంచులలోనున్నదనియు. అంచు అను పదమునకు తమిళ భాషలో 'కంగు' అను పేరుగలదనియు, ఆకంగుపదమే 'కొంగు' అను పదముగా మాఱి ఈదేశమునకు 'కొంగు' అను పేరు గలిగినదనియు కొందఱూహించియున్నారు.

(2) ఇది కొండలధికముగా నుండు దేశము. అందువలన తేనె విశేషముగా లభించును. తేనెలలో 'కొంగు' అను నొకరకము తేనె గలదట. దీనినిబట్టి ఈ దేశమునకు 'కొంగు' దేశము అను పేరు గలిగి యుండుననని, మఱికొందఱూహించియున్నారు.

(3) తమిళములో 'కొక్కు' అనుపదమునకు మామిడియను అర్థమున్నదట. ఈదేశములో మామిడిపండ్లు ఎక్కువగా లభించు చున్నందున, 'కొక్కు' అనుపదము 'కొంగు' అనుపదముగా మాఱి, మామిడిపండ్లు అధికముగా లభించుదేశము లేక 'కొంగునాడు' అను పేరేర్పడి యుండునని వేఱు కొందఱు చెప్పిరి.

(4) కొంగుదేశమును క్రీ. శ. 3 వ శతాబ్దినుండి 10 వ శతాబ్ది వఱకు పశ్చిమ గంగరాజులు పాలించినారు. వారిరాజ్యము 'గంగవాడి' యని పిలువబడుచుండెను. ఈ గంగులను అరవభాషలో 'గంగర్' అని చెప్పుదురు. ఈ 'గంగర్' అనుశబ్దము 'కొంగర్' అనుశబ్దముగా మాఱినదనియు, 'కొంగర్' అను వారుండు దేశముగనుక 'కొంగర్

నాఁడు' లేక 'కొంగునాఁడు' అను పేరుగలిగినదనియు నింకను కొందఱు చెప్పిరి. మఱికొందఱు, 'గంగవాడి' యను పేరే 'కొంగు' యని మాఱి తుదకు 'కొంగునాఁడు' అయినదనియు చెప్పియున్నారు.

ఇట్లు 'కొంగు' అను పేరునకు సరియైన యుత్పత్తి తెలియక తమిళపండితు లొక్కొక్కరొక్కొక్క విధముగా నూహించి వ్రాసి యున్నారు. కావున, వీనియన్నిటికంటెను సమంజసమైన యుత్పత్తి కనుగొనుటకు సాధ్యమగునేమో ప్రయత్నింతము.

### కొంగునాఁడు—తన్నామోత్పత్తి

కొంగునాడుయొక్క ప్రాచీనచరిత్రను తెలిసికొనవలయుననిన, దానికా పేరేల వచ్చెనో తెలిసికొనవలయును. కళింగదేశముయొక్క ప్రాచీన రాజకీయవిభాగములను గుఱించి చదువుచుండఁగా, కొంగునామోత్పత్తి మనస్సునకుఁ దట్టినది. ఆవిషయమిట్లున్నది. సర్వసాధారణముగా గోదావరి మఱియు మహానదులమధ్యనుండు ప్రదేశమునకు కళింగదేశము అను పేరున్నప్పటికిని, పూర్వమొకప్పుడీ రాజ్యము గంగానది ముఖప్రాంతమువఱకును, వ్యాపించియుండెనని తెలియుచున్నది. ప్రాచీనకాలమున ఈ విశాలమైన దేశము 1. ఉత్కలము, 2. కొంగోడు 3. కళింగము అను మూఁడుభాగములుగ నుండెనని తెలియుచున్నది. ఒకప్పుడీభాగములు స్వతంత్రరాజ్యములుగఁ గూడ నుండినవి. ఈ మూఁటిలో ప్రస్తుతము మనము రెండవ రాజకీయవిభాగమగు 'కొంగోడు'ను గుఱించి పరిశీలింపవలసియున్నది.

### కొంగోడు దేశము

ఈరాజ్యము చిల్కాసరస్సునకు నుత్తర పశ్చిమముగా వ్యాపించి యుండెనని కళింగదేశచరిత్రమునుండి తెలియుచున్నది. ప్రస్తుత మీ ప్రాంతమున 'సోనుపురము', బౌద్,కిమిడి, గుంసూరు జమీనులున్నవి. ఈదేశముగుండ 'శాలిమ' యనునది ప్రవహించుచున్నది. దేశము చాల భాగము కొండలమయము. దీనిచుట్టుకొలత సుమారు రెండునందల

[illegible]ండెనట. (చూ. కళింగ దేశచరిత్రము.పుట. 509) కళింగ దేశము. దీనికి దక్షిణముననుండెను. ఈ కళింగ దేశము ఆకాలమున ప్రస్తుతపు ఆంధ్ర దేశములోని పిఠాపురమువఱకు వ్యాపించియుండెనని చరిత్రగ్రంథములనుండి తెలియుచున్నది. అనగా ప్రస్తుతపు శ్రీకాకుళముజిల్లా, విశాఖపట్టణముజిల్లా మఱియు తూర్పుగోదావరిజిల్లాలోఁగొంత భాగము కళింగ దేశాంతర్భాగములుగ నుండెనన్నమాట. పైనిజెప్పిన 'కొంగోదు' రాజ్యమునకు 'కొంగూటో' యను పేరుకూడ నుండెనట. ఇఁక నీ 'కొంగోడు' అను పేరును పరిశీలింతము.

'కొంగోడు' అను పేరునందు 'కొంగు+ఓడు' అను రెండుపదములున్నట్లు తెలియుచున్నది. ఈ ఓడుశబ్దము 'ఓఢ్ర' శబ్దమునకు సమానార్థకము. ఓడుయనుదానికి 'ఓట' లేక 'ఒట' యనురూపములు స్థానికులుగూడఁ దెలియుచున్నది. 'కొంగోడు' దేశమనఁగా ఓఢ్రులను ఆశ్రయించియుండిన 'కొంగు' దేశమని యర్థమగుచున్నది. (ఒకవేళ ఓఢ్రులలో 'కొంగు' అను తెగవారుండియుండవచ్చును) కాని ఓఢ్రులీదేశమున మొదటినుండియు నుండినవారు కారని కళింగదేశ చరిత్రములనుండి తెలియుచున్నది. ఈ ఓఢ్రులు ప్రప్రథమమున ఉత్కళింగములోని పశ్చిమ భాగముననుండిరట. కొంతకాలమునకు ఉత్కళుల ప్రతాపము తగ్గినపిదప ఓఢ్రులు పశ్చిమ భాగమునుండి ఈ కొంగు దేశములోనికిని, ఉత్తరకళింగ దేశములోనికిని వలసవచ్చిరట. ఓఢ్రులీదేశమునకు అత్యధికముగా వచ్చి స్థిరనివాసములు కల్పించుకొన్నందుననేమో ఈదేశమునకు 'కొంగోడు' అను పేరు గల్గియుండును. ఎట్లయినను 'కొంగోడు' ఓఢ్రుల ఆధిక్యమును గలిగియుండిన దేశమనుట నిక్కము. ఇట్లు ప్రాచీనకాలమున చిల్కసరస్సు పరిసరప్రాంతమున 'కొంగు'అను దేశముండెననుట తథ్యము. ఇది ప్రస్తుతపు ఉత్తర గంజాంజిల్లా, మఱియు కటకముజిల్లాలను సరిపోయియుండెనని తెలియుచున్నది.

## కొంగుమండలము.

కళింగములోని కొంగు (కొంగోదు) దేశమునకును, దక్షిణమున నుండు 'కొంగు' మండలమునకును చక్కని నామసామ్యమున్నది. ఈ సామ్యమెట్లు సిద్ధించినది ? వీనిలో నొకప్రాంతమునుండి ప్రజలు మఱియొకప్రాంతమునకు వలస వచ్చి నెలకొని, ఆ వలసస్థానమునకు తమ పూర్వనివాసప్రాంతము పేరు పెట్టుకొనుట యస్పష్టముగ నున్నందువలన ఈ రెండుప్రాంతములలో దేనినుండి దేనికి ప్రజలు వలసవచ్చి నెలకొనిరో కనుగొనవలయును. ఇంతకుముందు, కొంగుమండలము కంటెను, కొంగోదు దేశమే చాల పురాతనమైనదని నిరూపించియున్నాను. అందువలన కొంగోదురాజ్యమునుండి ప్రాచీనకాలమున ప్రజలు దక్షిణమునకు వలసలువచ్చి, ప్రస్తుతము కోయంబత్తూరుజిల్లా అనబడు కొంగుమండల ప్రాంతములో స్థిరనివాసము కల్పించుకొనిరనియు, తామే దేశమునుండి వచ్చిరో ఆప్రాంతము పేరే క్రొత్తనివాసప్రాంతమునకు కూడ నుంచిరనియు తెలియుచున్నది. అందువలననే ఈ దక్షిణవలస ప్రాంతమునకు 'కొంగు' మండలము, అను పేరు గల్గినది. ఈ దక్షిణ కొంగుమండలమున నేడుకూడ ప్రాచీనకాలమునాఁటి కళింగ, ఆంధ్రముల వలసల జాడలు స్పష్టముగఁ గనఁబడుచున్నవి. ఈవిధముగ దక్షిణమున కొంగు మండలమేర్పడినది.

దీనినిబట్టి, ఈ కొంగుమండలమునకు ప్రాచీన కొంగోదుదేశమే మూలస్థానమని దృఢముగఁ జెప్పవచ్చును. ప్రాచీనకాలమునఁ బ్రజలు కళింగదేశమునుండి దక్షిణప్రాంతములకు వలసలు వచ్చినట్లు చారిత్రకాధారములు గలవు. మఱియు పురాతనకాలమున కళింగదేశమున బౌద్ధమతము వ్యాప్తియందుండెను. ఇట్టి వలసలను బౌద్ధమత సిద్ధాంతములుకూడ ప్రోత్సహించినటులు తెలియుచున్నది. ఇంతేగాక, పూర్వకాలమున ఉత్తరదేశములోని పెక్కుప్రాంతములనుండి ప్రజలు దక్షిణదేశమునకు వలసగావచ్చినట్లును, అందును ముఖ్యముగా మైసూరు పీఠ

భూమి అంచులందును, కోయంబత్తూరు, మఱియు మధురజిల్లాల నదీప్రాంతములందును వారు నెలకొనినటులు కొంగుదేశచరిత్ర గ్రంథములనుండి తెలియుచున్నది. సుప్రసిద్ధ చరిత్రపరిశోధకులుకూడ ఈవిషయమును గుఱించి వ్రాసియున్నారు. [చూ. నీలకంఠశాస్త్రిగారి. ఏ. హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా పుట. 74.

"All names of villages along the Weston Ghatsmay be taken to indicate that the immigrants hugged the line of the adjacent Highlands and peopled the skirts of Mysore, and Coimbatore and Madura districts before they spread else where"]

కొంగుమండలము, మఱియు తత్పరిసరప్రాంతములలోని గ్రామనామములు, నీటివనరుల పేర్లు మొదలగునవి ప్రాచీనకాలమున ప్రజలు కళింగదేశమునుండి యిచ్చటికి వచ్చినటులను దెలియజేయునని పైని జెప్పియున్నాను. దానిని గుఱించివివరముల నిచ్చుటఁ దెలియఁజేసెదను. ఇట్లుగావించుటకు ముందు, ఈకొంగుమండలముయొక్క స్వరూపమును, దానియెల్లలనుగూర్చి కొంతవఱకుఁ దెలిసికొనవలసియున్నది. అందువలన ఆవిషయములను సంగ్రహముగ వివరించెదను.

ప్రాచీన కొంగుమండలమునకు జెందిన యెక్కువభాగము. ప్రస్తుతము కోయంబత్తూరుజిల్లాలోనే యున్నది. ఇంతేగాక, నేటి సేలముజిల్లాలోని, నామకల్లు, సేలము, తిరుచెంగోడు, రాశిపురము అను తాలూకాలు, పూర్వము కొంగుదేశములోనుండెను. అందువలన ప్రాచీనకాలమున కొంగుమండలము తగినంత వైశాల్యముగలిగి యుండినదని తెలియుచున్నది. (గతశతాబ్దాదియందు, ఆంగ్లప్రభుత్వమువారు, పైనచెప్పిన్న నాలుగు తాలూకాలను, కొంగుమండలమునుండిఁ విడదీసి, దానితో మైసూరు పీఠభూమికి సంబంధించిన బారామహాలు, మఱియుఁ బాలఘాటు అను ప్రాంతములనుజేర్చి క్రొత్తగా సేలము అనుజిల్లాను నిర్మించినారు].

కావేరీనది యీ కొంగుదేశములో నించుమించుగ మధ్యభాగమున, ఉత్తరమునుండి దక్షిణముగా ప్రవహించుచున్నది. ప్రస్తుతమిది పై సేలము, మఱియు కోయంబత్తూరుజిల్లాలకు మధ్య ఎల్లగానున్నది. కోయంబత్తూరుజిల్లాను అరవవారు 'కోవై' జిల్లాయని పిలుతురు. ఈ జిల్లాకు ప్రస్తుతము 'కోయంబత్తూరు నగరము' ముఖ్యపట్టణముగా నున్నది. పూర్వము చాలకాలము 'ధారాపురము' అనుపట్టణము ముఖ్యపట్టణముగా నుండెను. చోళుల పరిపాలనాకాలమున ఈ 'ధారాపురమునకు 'రాజరాజపురము' అను పేరుండెనట. అంతకు పూర్వము దానికి 'స్కంధపురము' అను పేరుండినట్లు తెలియుచున్నది.

ఈవిషయములను మనస్సునందుంచుకొని ప్రాచీనశాసనములను పరిశీలింతము. కొంగుమండలమున ప్రాచీనకాలమునాంటికి కళింగాంధ్ర వలసల జాడలు గనబడుచున్నవనియు, కళింగమునుండి వలస వచ్చినవారీప్రాంతమున నివాసము చేసికొనిరనియు పైని చెప్పియున్నాను. ఇప్పుడిచ్చటి పెక్కుగ్రామములు ప్రాచీన కళింగదేశపు వలసలనుటను విశదపరచెదను. అవి :—

1. కలితలై గ్రామము :—పూర్వము కొంగుమండలమునకు 'కలితలై' అనుగ్రామము తూర్పు సరిహద్దుగనుండెనని కొంగుదేశ చరిత్రములందుఁ జెప్పబడియున్నది. ఈగ్రామము ప్రస్తుతము తిరుచినాపల్లిజిల్లాలో ఆపేరేగల యొకతాలూకాకు ముఖ్యపట్టణముగానున్నది. ఇక, ఈపేరుగల గ్రామము ప్రాచీన కొంగోసురాజ్యములో నుండెనేమో చూతము. అట్లుండినపక్షమున ఆ గ్రామమునుండి ప్రజ లిక్కడికి వలసవచ్చిరనియు, నక్కడివారు నిర్మించుకొన్నగ్రామమున కా పేరే పెట్టిరనియుఁ జెప్పవచ్చును. కళింగదేశ చరిత్రపుటలను దిరుగవేసి చూచినయెడల 'కలితాల'యనుగ్రామము నేడుకూడ నుండుటను కనుగొనవచ్చును. ఇది 'దంతాపురము'నకు సమీపముననున్నది.

ప్రాగ్గ్రామిదే యొక రేవుపట్టణముగ నుండెనట. (చూ. క. దే. చరిత్రము. పు. 192].

అరవవారు 'తల' అను తెలుగుపదమును 'తలై' యని యుచ్చరింతురు. అందువలన 'పలితాల' యనునది 'పలితాలై' యగుచున్నది. వ్యవహారమున 'పలితలై' యని యగును. ఇది తమిళపదముగాదు. తెలుగుపదము. 'పలితలై' యనుగ్రామము ప్రాచీన కళింగవలసయనుట కిదియొక మంచి నిదర్శనము.

2. కోయంబత్తూరు :-ఇదియునొక ప్రాచీనకళింగ వలస గ్రామము. ఈగ్రామమునకు పేరెట్లువచ్చెనో చూతము. దీని నామోత్పత్తినిగూర్చి తమిళపండితులు పెక్కువిధములుగఁ జెప్పియున్నారు. పూర్వ మీదేశమును 'కోసరులు' అనునొక తెగవారు పాలించిరట' ["The kongu was governed by a line of Kings named kosar and they are often mentioned in Tamil classical literature" (vide. Mystic Society Journal Volume. XII 1921-22. Sir S. K. Iiyangar]

వారు తమకొక నగరమును నిర్మించుకొన్నారట. ఆ క్రొత్త నగరమునకు 'కోసర్ పుత్తూర్' (కోసరుల క్రొత్తఊరు) అనుపేరు గలిగెనట. ఆ పేరే కాలక్రమమున 'కోయంబత్తూరు'గ మారెనట. సుప్రసిద్ధ తమిళపరిశోధకులు, కీ. శే. ఆర్. రాఘవైయ్యంగారు అను వారీ అభిప్రాయమును మొట్టమొదట సూచించినారు. "కోసర్ పుత్తూరే కోయంబత్తూరుగని మారినదని" వారు వ్రాసియున్నారు.

కాని, 'కొంగునాట్టుచరిత్ర' (కొంగునాడు చరిత్రము)అను గ్రంథమును వ్రాసిన శ్రీ ఎం.రామచంద్రన్ శెట్టిగారు, ఈ యూహను అంగీకరించక ఖండించుచు క్రిందివిధముగ వ్రాసియున్నారు. "కోసరులు తమిళసంఘకాలమున నుండిరని కాని, ఆకాలమున కోయంబత్తూరు ఉండినదనిగాని నిరూపించుటకు ఆధారములు లేవనియు, అందువలన

కొంగరులకును, కోయంబత్తూరునకును ఎట్టిసంబంధమును లేదనియుఁ జెప్ప వలసియున్నది ? వారు ఈవిషయమునుగుఱించి ముందల నిట్లు వ్రాసి యున్నారు. 'చోళన్ పూర్వపట్టయం' యనుగ్రంథమున, 'కోవన్' యను నొక ఇరుళజాతి వారిగ్రామమును, గట్టించెనని వ్రాయఁబడియున్నది. ఇట్లు, 'కోవన్' అను ఇరుళుల నాయకుఁడు కట్టించి నివసించినందున దానికి 'కోవన్ పుత్తూర్' యను పేరు గలిగినది. అదియే కాలక్రమమున కోయంబత్తూరుగా మాఱినది. శాసనములలో 'కోవన్ పుత్తూర్' అను రూపమేయున్నది. అందువలన నీయుత్పత్తియే సమంజసమైనది." (చూ. కొంగునాట్టువరలారు. "The old name of Coimbatore is Kovan Puttur"] (శ్రీ)రామచంద్రశెట్టిగారి యభిప్రాయమును పెక్కుమంది తమిళపండితులు, మఱియు చరిత్రకారులు బలపఱచి యున్నారు. అందువలన కోవన్ పుత్తూరు అను రూపమే సరియైనదని మనము దృఢముగా నమ్మవచ్చును.

ఇఁక నీ 'కోవన్' అనుపదమును పరిశీలింతము. కోవన్ అను నది 'కోయ' లేక 'కోయుని' అను తెలుఁగుపేరునకు తమిళరూపము. తెలుఁగులోని రాము, కృష్ణ, బోయ. మొదలగు పేళ్లను అరవభాషలో రామన్, కృష్ణన్, బోయన్ అనురూపములతోఁ బిలుతురు. ఈ కోయలు ఆటవికజాతులకుఁ జెందినవారు. ఇట్టి కోయజాతినాయకుఁడిది కట్టించియుండును. అందువలననే యీగ్రామమునకు పూర్వము 'కోయనికొత్తూరు' అను పేరు గలిగియుండును. తమిళులీప్రాంతమున నెక్కువగ చేరినపిదప 'కొత్తూరు' (కొత్త+ఊరు) అను తెలుగుపదమును తొలగించి, ఆ యర్థమిచ్చు తమిళపదమగు (పుదు+ఊరు) 'పుదూరు' అనుపదమును చేర్చియుందురు. వ్యవహారమున 'పుదూరు' అనుపదము 'పుత్తూరు'గామాఱును. ఈవిధముగ తెలుఁగుపేరైన 'కోయని కొత్తూరు' క్రమముగా 'కోవన్ పుత్తూర్'గా మాఱి తుదకు 'కోయంబత్తూరు'గా స్థిరపడినది. ఈవిధముగ తెలుఁగు గ్రామనామ

ములు తమిళ రూపములను బొందియుండుటకు పెక్కు ఉదాహరణ ములు గలవు. ఇట్లు కోయంబత్తూరు తమిళులు నిర్మించినదిగాదనియు, అది తెలుగువారో లేక కళింగ దేశమువారో నిర్మించినదనియుం దెలిసినది.

తమిళ దేశమందు ఇరళులు, తోడాలు మొదలగు ఆదిమనివా సులు గలరు. కాని కోయజాతివారు లేరు. ఈ కోయలు, సవరులు, పుళిందులు మొదలగువారు కొండజాతి తెగలకుఁ జేరినవారు. ఈ జాతి వారు కడు ప్రాచీనకాలమునుండియు నుండినట్లు రామాయణాది గ్రంథములనుండియు, టాలిమి మొదలగు విదేశీయుల వ్రాతలనుం డియుఁ దెలియుచున్నది. కోయజాతివారు ఆంధ్ర దేశపుటుత్తర భాగము నందును, కళింగ దేశమునందును నున్నారు. ముఖ్యముగా గోదావరి, మఱియు విశాఖపట్టణము జిల్లాలలోని ఏజన్సీ భాగములందును, బస్తరు, నైజాము రాష్ట్రములలోని అడవులందును, గుట్టలందును వీరు విరివిగా నున్నారు. [చూ. క. దే. చరిత్రము. పుట. 46]. తమిళ విజ్ఞానసర్వ స్వము అనుగ్రంథములో వీరు కొండజాతివారనియు, పూర్వము వీరు మధ్యప్రదేశ ప్రాంతమునందుండిరనియు, ఆపిదప అచ్చటినుండి తరుమ గొట్టబడి వీరు గోదావరీ నదీతీరభూములకు వలసవచ్చిరనియు, ప్రస్తు తము వీరు గోదావరిజిల్లా ఉత్తరభాగమునందును, కోరాపుట్టియందును అధికముగా నున్నారనియు వ్రాయఁబడియున్నది. ఈ ప్రాంతములు ప్రాచీనకాలమున కొంగోదరాజ్యములో నంతర్భాగములుగా నుండి నవి. కోయవారు, కూయి, మఱియు తెలుగుభాషలను మాట్లాడుదురు. ఇట్లు కోయలు తమిళులుగాగనియు. తెలుఁగువారనియు స్పష్టమగు చున్నది. ఈవిధముగా 'కోయంబత్తూరు' పూర్వము తెలుఁగుగ్రామము గానే ఏర్పడినది. ఆంధ్రదేశపుటుత్తరభాగమందును, కళింగ దేశము నందును నుండిన కోయజాతివారు కొందఱు, ప్రాచీనకాలమున దక్షిణ ముగా వలసవచ్చి, ప్రస్తుతము కోయంబత్తూరు గ్రామముండు ప్రాంత

మున నెలకొనియుందురు. ఇదికూడ నొకకొంగుప్రాంతమే. ఇప్పు కోయం
త్తూరు ఒక ప్రాచీనమైన కళింగవలసయని విశదమైనది.

'కోయంబత్తూరుజిల్లా' యను తమిళగ్రంథమున ఈప్రాంతమునకు
పురాతనకాలమున వచ్చి చేరిన వలసలనుగుఱించి యిట్లు వ్రాయబడి
యున్నది. "ఒకప్పుడు కురుంబరులు, ఎలువరులు, బోయవాండ్లు, మొద
లగుజాతివారి కొంగుదేశములోనుండిరి. సంఘకాలమున మాలవర్,
కోసర్, కొంగర్ అనుజాతులవారుకూడ నీప్రాంతమునకు వచ్చిరి.
ప్రాచీనగ్రంథములందు, 'మాలవరాజు' అనునతడొకడు భవానీనదీ
తీరమున నొక చిన్నప్రాంతమును పాలించుచుండెననియు, ఆప్రాంతము
నకు 'ఈర్‌నాడు' అనుపేరుండెననియు వ్రాయబడియున్నది. (చూ. పు.
21) ఈ భవానీనది పడమటికనుమలలో బుట్టి కోయంబత్తూరు జిల్లా
నుత్తరభాగముననుండు గోపిశెట్టిపాళెము తాలూకాగుండ ప్రవహించి
పిదప కావేరీనదిలో గలియుచున్నది. చరిత్రపరిశోధకులగు (శ్రీ) కె. ఏ.
నీలకంఠశాస్త్రిగారు తమ దక్షిణ ఇండియాచరిత్రలో ఈవలసలను
గుఱించి వ్రాయుచు, ప్రాచీనకాలమున ఉత్తరదేశమునుండి ఆర్యసం
తతివారు వలసలు వలసలుగావచ్చి, మైసూరుపీఠభూమి అంచులందున్న
కోయంబత్తూరు, మఱియు మధుర జిల్లాలగుండ నీనులందును స్థిరనివాసము
లేర్పరచుకొనిరని వ్రాసియున్నారు. (చూ. పు. 74-75.

"The Aryanization of the South was doubtless a slowprocess, spread over several Centuries........All the names of villages along the westernghats may be taken to indicate that the immigrants hugged the line of the adjacent high lands and Peopled the skirts of Mysore and Coimbatore and Madura districts, before they spread elsewhere".

కోయంబత్తూరుజిల్లా ఉత్తరభాగమందు. అనగా నిప్పటి సత్య
మంగలము, భవాని, ఈరోడు. కోయంబత్తూరు తాలూకాలుండు

ప్రాంతమున ప్రాచీనకాలమున 'ఒయ్యంగనాడు', 'ఈర్‌నాడు' 'ఆగయ నాడు' అను చిన్నచిన్న రాజ్యములుండినట్లు తెలియుచున్నది. ఇవి మన్నెయు ఉత్తర దేశమునుండి దక్షిణమునకు వలసవచ్చిన ఆర్యసంతతి వారేర్పరచిన వలసప్రాంతములని చెప్పవచ్చును. క్రీస్తుశకమునకు పూర్వము మౌర్యచక్రవర్తులకాలమందే, ఉత్తరదేశమునుండి పెక్కు మంది దక్షిణమునకు వలసవచ్చిరనియు, మౌర్యచక్రవర్తుల సైన్యములు, దక్షిణమునకే వచ్చి, తమిళరాజ్యములను జయించి వశపరచుకొనియుండిరనియు చరిత్రకారులు భావించియున్నారు. మఱియు జైన, బౌద్ధప్రచారకులు మైసూరు, కొయంబత్తూరు మొదలగు ప్రాంతములకే వచ్చి యుండిరనియు, నాటి దక్షిణ దేశము నాకాలమున లభించుచుండిన బంగారమును కొనవచ్చి వర్తకమును సాగించుచుండిన మగధవర్తకుల సహాయము పొందుచుండిరనియు తెలియుచున్నది. ఈ కారణములవలన కొయంబత్తూరుజిల్లాలో ప్రాచీనకాలమున ఆర్యసంతతి వారి వలసప్రాంతములు ఏర్పడియుండవచ్చునని తలంపవచ్చును. ఈ విషయమును ప్రసిద్ధచరిత్రకారుడగు దామోదర ధర్మానంద కోసాంబి అను పండితుడు విశేషముగఁ జెప్పియున్నాఁడు.

"Chandragupt's armies penetrated the deepsout certainly into Mysore State, which belonged to Asoka's domains without any notice of his or his fathers having campaigned there. The Vamba Moriyar of anciant Tamil poetry may refer to a Mauryan army which had virtually reached Madura before being driven back or stopped by a mountain which their Charriots could not pass............The Mouryan empire was thus the first real, 'Universal Monarchy' over the whole country............A considerable number of Jains followed the Jain Acharya Bhadra Babu (about 300 B.C.) South words, to settle in Kanarese County. Their main support would have been the Magadha traders, who had been attracted by the gold and other produce that the Hydrabad-Mysore Country had yie-

lded since the late stonage ..........." [Vide An Introduction to the Study of Indian History page 195].

ఇట్లు ప్రాచీనకాలమున మైసూరు, మఱియు కోయంబత్తూరు ప్రాంతములందు కళింగాద్యుత్తర దేశీయుల వలసలేర్పడినవని తెలియ వచ్చును.

"కొంగర్" అనుజాతివారు అన్యప్రాంతములనుండి యిచ్చటికి [కొంగుమండలమునకు] వచ్చి స్థిరనివాసముల నేర్పఱచుకొనిరనియు, వారు తమిళులు కారనియు, అన్యులనియు, తమిళపండితులు, మఱియు తమిళచరిత్రకారులు వ్రాసియుండుట గమనింపదగిన విషయము. కొంగుమండలము ప్రాచీనకాలమున కళింగదేశమునందుండిన 'కొంగోడు' రాజ్యమునకు సంబంధించిన వలసరాజ్యమనుటకు పైని జెప్పిన ఆధారములు అనుగుణముగానే యున్నవి. కావున కొంగుమండలమునకు అసలు మూలస్థానము కొంగోడుదేశమే యనుట పరమ విశ్వాసార్హముగఁ గనఁబడుచున్నది.

3. ఈరోడుపట్టణము.

కోయంబత్తూరు జిల్లాలోనిది రెండవ పెద్దపట్టణము. ఇచ్చటి ఈరోడు అనుతాలూకాకిది ముఖ్యపట్టణము, భవానియను పట్టణము దీనికుత్తరమున 16 కిలోమీటర్ల దూరమునందున్నది. ఈరోడుపట్టణము కావేరీనది కుడిగట్టుననున్నది. నది కెదుటిప్రక్కన, అనఁగా సేలంజిల్లాకుఁ జెందిన 'తిరుచంగోడు' అను తాలూకాయున్నది. ఈతాలూకాకు 'తిరుచంగోడు' అను ఊరే ముఖ్యపట్టణము. గత శతాబ్దిలో సేలంజిల్లా ఏర్పడుటకుముందు తిరుచెంగోడు తాలూకా మఱియు దాని పరిసరములలోనుండు సేలంజిల్లాకు చెందిన మఱికొన్ని తాలూకాలు కొంగుమండలములో నంతర్భాగములుగ నుండెను. సేలంజిల్లాకు చెందిన తిరుచెంగోడుతాలూకా మఱియు కోయంబత్తూరు జిల్లాకుఁజెందిన ఈరోడుతాలూకా ఈరెండుతాలూకాలుండు ప్రదేశమునకు ప్రాచీనకాలమున 'ఆగయ'నాడు అనుపేరుండినటులు తెలియుచున్నది. (సశేషము)

# గ్రంథస్వీకారము—సమీక్ష

శ్రీ బండారు తమ్మయ్య.

1. శ్రీ సత్యసాయీశ్వరకృతి తరంగణి ప్రథమ ప్రవాహము:- క్రౌను, పుటలు 76. వెల రు 2-0-0. కర్త:-శ్రీ ఉప్పాడ రాజారావు గారు ఎం. ఏ., ఆంధ్రోపన్యాసకులు. శ్రీ వేంకటేశ్వర కళాశాల న్యూఢిల్లీ ప్రాప్తిస్థానము. ప్రశాంతినిలయాధిపతి ప్రశాంతి నిలయము పోస్టు అనంతపురము జిల్లా ఆంధ్రప్రదేశ్.

ఆంధ్రదేశమున, అనంతపురముజిల్లా, పుట్టపర్తి యనుగ్రామమున నెలసిన శ్రీ సత్యసాయిబాబాగారు నేటి ప్రసిద్ధమహాత్ములలో నొకరు. ఆధ్యాత్మిక శక్తిసంపన్నులగు వీరు ప్రత్యక్షముగఁ బ్రకటించు మహిమాదికములు ప్రజలను మిక్కిలి యాకర్షించుచున్నవి. అందుచేఁ నేఁడు పుట్టపర్తి యొక యాత్రాస్థలముగఁ బరిణమించుచున్నది. వీరు క్షత్రియవంశజులు. వీరివయస్సు నలువది వత్సరములలోపు. పుట్టవలె వీరి మూర్ధముపయి వెలయు శిరోజములు చూపఱులకాకర్షణీయముగ నుండును. కీర్తిశేషులు షిర్డిసాయిబాబా మహాత్ముల యంశము వీరి యందు నెలకొనియున్నదని ప్రజల విశ్వాసము. అందువలననే వీరిని పుట్టపర్తి సాయిబాబాయని వ్యవహరించుచున్నారు. ప్రస్తుతకృతి తరంగిణిలోని ప్రథమప్రవాహము వీరి జీవితవిశేషములగుఱించి మహిమాదికములగుఱించి బాబాగారిభక్తులు శ్రీ ఉప్పాడ రాజారావుగారు వెలయించినది. రాజారావుగారింతకుముందు కాకినాడలో పిఠాపురము మహారాజావారి కళాశాలలో నాంధ్రోపాధ్యాయులుగానుండి ప్రస్తుతము న్యూఢిల్లీలో శ్రీ వేంకటేశ్వర కళాశాలలోఁ బనిచేయుచున్నారు. కాకినాడలోనున్నప్పుడు వీరు రచించి ప్రకటించిన "మధూదయము" అను ప్రౌఢకావ్యము వలననే వీరి కవితాశక్తియుక్తులు లోకమునకు వెల్లడియైయున్నవి. ప్రస్తుతకృతిలోఁ గవిగారి వదనహస్త

ములనుండి సాయిబాబాగారి స్తుతితరంగిణి వివిధరూపములఁ వెల్లివిరిసి ప్రవహించినది. శ్రీ సత్యసాయీశ్వరోదాహరణము, సంస్కృతనక్షత్రతారావళి, దండకము, ముక్తకము, ద్విపదము, శతకము, సంకీర్తనములు, వారణమాల, రత్నమాల, భాస్కరమాల, అష్టోత్తరకళలు, చంద్రహారము, తారహారము, మధ్యాక్కరలు, త్రింశత్సంస్తుతి అను పదియేను అంతర్భాగముల నామములే కృతిస్వరూపమును నిరూపింపఁగలవు. సాయీశ్వరభక్తులకెల్లరకిది యవశ్యపఠనీయము. హృత్ప్రీతిదాయకము మచ్చునకుఁ గొన్ని యుదాహరణములు.

(1) ఉదాహరణ కృతియందలి సాత్త్వికభక్తికపద్యము.

శా. నీవీశుండవు, నిన్ను భక్తిఁ గొలుతున్. నీచేఁ గృతార్థుండ, నీ
కై వాంఛింతుమనంగ నీవలస సౌఖ్యాభోగముల్ గందు నీ
కే విజ్ఞాపనమాచరింతుఁ దవులం బేరైన నీయందు, స
నత్వాంకిత శంఖచక్రధర శౌరీ! సత్యసాయీశ్వరా!

(2) ముక్తకమునుండి

ఆ. వె. షిర్డిసాయిబాబ శేషాంశ సంభవ ?
స్వర్ధునీప్రవాహ సదృశ భావ !
సార్థకాభిధాన ! సర్వజ్ఞ ! సర్వేశ !
నిత్యమున్ స్తుతింతు సత్యసాయి.

(3) త్రింశత్సంస్తుతినుండి

మ. రవివంశంబున నుద్భవించితివి ధార్మ్యాచరితి సమ్మోహసం
చిపురెత్తన్ బహుళాకృతుల్ వెలయ నావిర్భూతి సంధింపుమున్
దవులం బెంతయుఁజూచ్చుమన్ దయమున ధ్యాత్మంబు నీ నామ స
య్యావనీభారముఁ బాపఁ బొల్పడితె దేవా! సత్యసాయీశ్వరా!

(2) నావాఙ్మయమిత్రులు. ఆధునిక ఆంధ్రరచయితల జీవిత చరిత్రలు. రేఖాచిత్రములు-డెమ్మీ.పుటలు 344. వెల రు 8-0-0 లు

రచయిత శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావుగారు, బి. ఏ., బి.ఇడి. 55/6 గాంధీనగర్, చిత్తూరు, ఆంధ్రప్రదేశ్. ప్రతులు గ్రంథకర్తకే వ్రాయవలెను.

శ్రీ కామేశ్వరరావుగారు కీ॥ శే॥ శ్రీ టేకుమళ్ళ అచ్యుత రావుపంతులుగారి ప్రథమపుత్రులు తండ్రికొడుకులిరువురు సుప్రసిద్ధ రచయితలయి యాంధ్రవాఙ్మయరంగమున విశేషగౌరవస్థానమును బడసినవారు. కామేశ్వరరావుగారికి వ్యావహారిక భాషలో రచన సాగించుట పరిపాటి. ఈ రచనమయినను విశృంఖలముగ నుండక వారేర్ప రచికొన్న కొన్ని నియమములకు లోనయి యుండును. కొంతకాలము క్రిందట వీరు "వాడుక భాష,రచనకు కొన్ని నియమాలు" అను గ్రంథముకూడ వ్రాసి ప్రకటించినట్లు తెలియుచున్నది. భాషాకాఠిన్యము లేక రచన చదువరులకు చాల సుగమముగనుండును. ఈ గ్రంథము ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి గ్రాంటును పొందినది. రచయిత మిత్రులు శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు (రిటైర్డు హైకోర్టు న్యాయమూర్తులు) రచించిన 4 పుటల పీఠిక, గ్రంథమునకు ముఖాలంకారముగ నున్నది. అటుతరువాత "నామాట" యను పేరితో 4 పుటలు రచయిత విజ్ఞప్తియున్నది.

కేవలము భాషాభిమానులయి ప్రతిఫలాపేక్ష యేమియు వాంఛింపక నిస్స్వార్థ సారస్వతసేవ గావించిన కవిపండితుల రచయితల,జీవితములిందు గలవు. కీ॥ శే॥ 1846 లో జనించిన గుంటూరు వీరభద్ర శాస్త్రిగారు మొదలుకొని 1894 లో జనించిన పింగళి లక్ష్మీకాంతము గారివఱకు నిండుమించుగ నొక యర్ధశతాబ్ది కాలములో సేవగావించిన, కావించుచున్న, ప్రఖ్యాత రచయితలు 102 మంది జీవితములిందు గలవు. వీరందఱు నేదోవిధముగ రచయితకు బరిచితులయిన మిత్ర వర్గములోనివారే. అందుచేతనే గ్రంథమునకు 'నా వాఙ్మయమిత్రులు'

